

# ఆంధ్రప్రదేశ్

అక్టోబరు 1968

బాపూజీ
శతజయంతి
సంచిక



30 పైసలు



గాంధీజీ వచ్చారు

రెక్కలు విదిల్చి, ఆకాశంలోకి ఎగిరి, గుండె నిండా మనం పీల్చే గాలి తెంలాగ, చీకటిని చీల్చుకుని మన కళ్ళ మసక పొరల్ని పటాపంచలు చేసే కాంతి కిరణం లాగ, సుడిగాలి లాగ గాంధీజీ వచ్చారు. ఏ ఆకాశం నించో అకస్మాత్తుగా ఆయన ఊడి పడలేదు. కోట్లాది భారతీయుల మధ్య నుంచే వచ్చారు. వారి మధ్య వుంటూ, వారి భాషలోనే వారితో మాట్లాడుతూ తమ జీవితాన్ని తామే దర్శించు కొనేట్టు చేయడానికి గాంధీజీ వచ్చారు

*భారత దర్శనం నుండి*



## బాపూ వాణి

ప్రతి పురుషుడూ, ప్రతి స్త్రీ శారీరకంగా ఎంత బలహీనులైనా తమ ఆత్మాభిమానాన్నీ, స్వేచ్ఛనూ పరిరక్షించుకునే శక్తి సమన్వితులన్న భావాన్ని మానవ జాతిలో ప్రతిష్ఠించగలిగితే నేను వచ్చిన పని పూర్తయినట్లే



అహింసను ప్రకటించడం అంటే కేవలం దుష్టునికి తల వగ్గి వుండమని కాదు, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా ఆత్మను ప్రతిష్ఠించడం . భారతదేశం బలహీనత కారణంగా అహింసాయుత విధానాన్ని అవలంబించమని నేను అనడం లేదు. తన శక్తి సామర్థ్యాలను గుర్తించే అహింసను ఆచరించమంటున్నాను.



ఆంధ్రులు పౌరుషవంతులు. ఉత్తమ సాంప్రదాయం కలవారు మతం మీద నమ్మకం గలవారు. త్యాగానికి కూడా వెనుదీయని వారు. వారి నుంచి దేశానికి ఒనగూర వలసినది ఎంతైనా వుంది

# ఆంధ్రప్రదేశ్

సంపుటి: 12] అక్టోబరు 1968 సంచిక: 12
ఆశ్వజ_కార్తీక 1890 శా.శ.

ప్రధాన సంపాదకులు బి. యన్. రామన్, ఐ ఏ. యస్

సంపాదకులు: ఎస్. వి. గోపాలశాస్త్రి



# బాపూజీ శతజయంతి శ్రద్ధాంజలి

ఈ సంచికలో



ఇంత కాలంగా ఈ దేశాన్ని ప్రకాశమానం చేసిన ఈ జ్యోతి యిటుపైకూడా యీ దేశాన్ని వెలిగిస్తుంది. యింకా వేల కొలదీ సంవత్సరాలపాటు ఈ దేశాన్ని కాంతిమయం చేస్తుంది. ఇప్పటికీ ఈ జ్యోతి ఇక్కడ వెలుగుతూనేవుంది. ప్రపంచానికి నిత్యం దర్శనీయమౌతూనే వుంటుంది. అసంఖ్యాక మానవాళి హృదయ పరితాపాన్ని, చీకటులనూ పారద్రోలుతూనే వుంటుంది.

— జవహర్లాల్ నెహ్రూ




# అతడసామాన్యవ్యక్తి

అతడు సామాన్యవ్యక్తి
    అతడసామాన్యవ్యక్తి
తృణంకన్నా తేలిక
    మేరువుకంటే ధీరుడు
ఆగర్భ శ్రీమంతుడు
    నిత్యదరిద్ర నారాయణుడు
వయస్సు మీరిన బడుగు
    వయస్సులేని నిసువు
అన్యాయం సమక్షంలో
    ఆగ్రమహో దగ్రమూర్తి
చరాచర ప్రపంచానికి
    క్షమా మార్గదర్శి
అతడిప్పుడు లేడు
    అతడెప్పుడూ వున్నాడు
అమరత్వం అందుకున్న
    అతనికి మా సతులు

—శ్రీ శ్రీ

# నైతిక చైతన్యం

—డా॥ జాకిర్ హుసేన్

అది 1926 జూన్ నెలలో—ఒకనాటి ఉదయంపూట—జమియ మిల్లా ఇస్లామియాకు చెందిన ముగ్గురు మిత్రులూ—నేనూ—గాంధీజీని దర్శించేందుకు సబర్మతి ఆశ్రమానికి వచ్చాం. ఆ ముందురాత్రి ఆలస్యంగా మేమక్కడికి చేరుకోడంతో మాకా ఆశ్రమంలో వసతి చూపించేందుకు త్వరత్వరగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. గాంధీ గారి కుటీరంలో మాకు ఉదయం అల్పాహార విందు ఏర్పాటు చేయబడిందని చెప్పారు. మేం నలుగురం ఆ కుటీరంలో ఒంటింటికెదురుగా ఒక వరుసలో కూర్చొనివున్నాం — మాత కస్తూర్బా ఫలహారం వడ్డిస్తున్నది "ఎంత ముచ్చటగా వుంది" అని ఉన్నట్టుండి మా వెనుక ఒక గొంతుక వినిపించింది

మేమంతా వెనుకకు తిరిగిచూచాం. అది గాంధీజీ కంఠమే ఆయన ప్రసన్నంగా నవ్వుతూ మా వద్దకువచ్చి మంచంపై కూర్చున్నారు. ఎన్నో సంవత్సరాల పరిచయం వున్నట్లు పలకరిస్తూ, నవ్వుతూ అతిసన్నిహితంగా ఆయన మాతో మాట్లాడారు.

జర్మనీలో గాంధీగారిని గురించి ఎక్కువగా చెప్పుకొనేవారు. రచయిత రోమారోలా వ్రాసినపుస్తకం అనువాదప్రతులు అక్కడ విరివిగా అమ్ముడుపోయేవి. నేను జర్మనీలో వుండేకాలంలో గాంధీగారి మీద ఒక పుస్తకం వ్రాశాను. ఆయన అహింసా సిద్ధాంతం మీద ఉపన్యాసాలుకూడా చేశాను. అయితే ఆయనను కలుసుకోవడం మాత్రం నా కిదే మొదటిసారి. ఆశ్రమంలోవున్న రెండుమూడు రోజుల్లో గాంధీగారితోనే ఎక్కువసేపు మాట్లాడుతూ కాలంగడిపాను. జమియమిల్లాలో కృషిచేసేందుకు నేనిదివరకే అంకితమైపోయాను. ఈ నాదీక్షవల్ల ప్రముఖవ్యక్తులైన హకీమ్ అజ్మల్‌ఖాన్, డా॥ అన్సారీ, మౌలానా మహమ్మదాలీ, మౌలానా అబుల్‌కలామ్ అజాద్ మొదలగువారితో పరిచయభాగ్యం నాకు కలిగింది. వారివద్దనుండి అమూల్య సందేశాలనూ సలహాలను అందుకుందాం, కృషికి ఎక్కువ ఫలితాన్నిచ్చే విధానంగూర్చి తెలుసుకుందాం — అని సహజంగా నేను ఉవ్విళ్ళూరే వాణ్ణి. గాంధీజీని దర్శించడంలో కూడా నా ఉద్దేశమిదే ప్రోద్బలం నాకవసరంలేదు. గంభీరంగా మాట్లాడేశక్తి నాకు వుండనేవుంది. ఇవికాదు నేను గాంధీగారి నుండి కోరేది.

అసలు జమియమిల్లాను గురించి గాంధీగారి అభిప్రాయమేమిటి ? దాని నిర్వహణకూ, విస్తరణకూ ఆయన ఏ విధంగా తోడ్పడేందుకు యిష్టపడతారు ?—అనేవిషయాలే ఆయనవద్ద నుండి నేను తెలుసుకోవాలనుకున్నాను. 1924 లో ఒకసారి ఆ సంస్థను బలపరచే అనేకమంది పలుకుబడివున్న పెద్దవ్యక్తులే అది యింక



కొనసాగేందుకు సాధ్యపడదనీ, కొనసాగవలసిన అవసరంకూడా లేదనీ ప్రకటించినపుడు గాంధీగారే ఆ సంస్థను కాపాడారు. అదే సంస్థ విషయంలో ఆయనిప్పుడు ఏం చేయదలచుకున్నారు ?

## సందేశం

వ్యాప్తిలోనున్న అనుమానాల దృష్ట్యా, చెలరేగుతున్న సంఘర్షణల దృష్ట్యా ఆయనిప్పుడు ఏమీచేయలేరని నాకు తోచింది. కాని గాంధీగారు నాకప్పుడు అందించిన సందేశం చాలావిలువైనది. ఉదారంగా ఆర్థిక సహాయం చేస్తానని ఆయన నాకు వాగ్దానం చేసినపుడు కలిగే ఆనందానికన్నా ఆయన సందేశమే నాలో ద్విగుణీకృతమైన ఉత్సాహాన్ని, ఆత్మవిశ్వాసాన్ని రేకెత్తించింది. ఒకవేళ ఆయన పైవిధంగా వాగ్దానం చేసివుంటే ఏమయ్యేది ? నాకు ధనం సమకూరేది. జమియమిల్లా మనుగడకు ధనం ప్రధానంకాని జనంకాదు—అని నేను భావించివుండేవాణ్ణి గాంధీగారు చెప్పేమాటల తీరూ, అవి చెపుతున్నపుడు ఆయన అగుపించే విధానం నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. కాని ఆయన మాటలకు దాసుణ్ణి కాలేదు. వ్యక్తిగా నాకుగాని, సంఘంగా జమియమిల్లాకు గాని జీవితం ఒక పూలబాటని నేనెప్పుడూ అనుకోలేదు. అయితే చేయదలచుకున్నది దృఢంగా చేసేందుకు గట్టిగా నిశ్చయించుకున్నాను—దేనివల్ల ఈ విధంగా జరిగింది ?

## అమోఘమైన వ్యక్తిత్వం

గాంధీజీ మాటలనుబట్టి చూస్తే జమియమిల్లాతో ఆయన సంబంధం ఏ సత్యసూత్రంపై ఆధారపడివుండాలో, ఆసత్యాన్నే ఆయన అన్వేషిస్తున్నారని నాకు తేటతెల్లమైంది. అందులో సందేహమేమీలేదు. జమియామిల్లా విషయంలో - అది బాగా వేరుదన్ని నిలవాలనీ, శక్తిసంపన్నం కావాలనీ, దినదినాభివృద్ధి చెందాలనీ, తను అనుకున్న భావాన్ని చాటకలిగేదిగా వుండాలనీ గాంధీజీ కోరారు. అయితే స్వయంశక్తిపై ఆధారపడి ఆ సంస్థ పైకిరావాలే కాని తన సహాయంకై ఎదురు చూడకూడదని ఆయన భావన. అంతమాత్రంచేత ఆ సంస్థ విషయంలో ఆయనకు శ్రద్ధలేదని చెప్పలేం. ఆయన దాని బాగోగుల విషయం ఆందోళన చెందుతుంటారు. కార్యకలాపాలు గమనిస్తూవుంటారు. అభివృద్ధిని కాంక్షిస్తూనే వుంటారు. దాని అనన్యత్వానికి, ప్రసిద్ధికి దోహదంచేసే స్వేచ్ఛకు ప్రమాదం కలిగించే ఏ సహాయమూ ఆయన చెయ్యరు. వ్యక్తుల మాదిరే సంస్థలు కూడా తమ ఉద్దేశ్యాలకనుగుణంగా రూపురేఖలు దిద్దుకొని నిలవాలని ఆయన అభిప్రాయం. గాంధీజీ మాటలు నాకు బాగానచ్చాయి. అందుకు కారణం లేకపోలేదు. ఆయన భావనల వెనుక, భాషణల వెనుక అమోఘమైన ఆయన వ్యక్తిత్వం తొంగి చూస్తుంటుంది. ఆ వ్యక్తిత్వం ఆయనకు నైసర్గికంగా వచ్చింది కాని, లేదా సంప్రదాయసిద్ధంగా సంక్రమించింది గాని కాదు. దాన్ని స్వయంకృషితో నైతిక సిద్ధాంతాల మీద ఆయనే మలుచుకున్నారు. చక్కని పనివాని నేర్పుతో, ఓర్పుతో దీర్ఘంగా ఆయన దాని కోసం కృషి చేశారు. అయినా ఆయనకు సంతృప్తి కలుగలేదు. ఎందుకంటే ఆ కృషి ఏకాంతంగా జరిగింది కాదు. మానవ జీవిత రంగస్థలం మీద బహిరంగంగా ఆయన పాటుపడ్డారు. అచంచల సంకల్ప శక్తితో, అలసటలేని శక్తి సంపత్తితో ఆయన శ్రమించి తాననుకున్న విధంగా వ్యక్తిత్వాన్ని రూపొందించుకున్నారు. దాని శక్తిని పరీక్షించుకున్నారు కూడా. నిజాయితీ, వినమ్రత, ఎన్నెదరుగని ఆయన మందహాసం తాను నిర్ణయించుకున్న విధానానికి మూల వస్తువులు. తనధ్యేయం పూర్తిగా సాధించిన వానివలెగాక, తత్సాధనకై యింకనూ కృషి చేస్తూ, పొరపాట్లు జరుగవచ్చునేమోనని భావిస్తూ, తానుపయోగించే సాధనాలు పట్టు తప్పి పోవచ్చునని భయపడుతూ, పట్టుదల సడలిపోతుందేమోనని తహతహలాడేవాని మనస్తత్వం ఆయన మాటల్లో మనకు గోచరిస్తుంది. సిద్ధాంతాలమధ్య, ఆచరణలమధ్య పూర్తి సమన్వయాన్ని ఒకేసారి సాధించలేం. దీనికి దీర్ఘ కృషి కావాలి, తరచూ వ్యక్తిలో ఆత్మపరీక్ష అవసరం. ఈ విధానంలో నిజాయితీ, వినమ్రతాభావాలు ప్రత్యేకతను సంతరించుకుంటాయి. గాంధీజీ నిజాయితీ నాకు తెలిసిందే నాలోని నిజాయితీ గుణానికి అది ఒక సవాలు వంటిది. భక్తిభావంతో కార్యసాధనపట్ల కృషి చేయాలని నేను భావించాను. కార్యం పెద్దదయ్యే కొద్దీ సమస్యలనేకం ఎదురౌతాయి. అందుకే వినమ్రతాభావంతో పని చేయాల్సి వుంటుందని కూడా నేనూహించాను. ఎప్పుడు ఏ పద్ధతిలోకూడా వ్యక్తి, తానుచేసే పనికి అర్హుడైనవాడనిపించుకోవాలి.

సాటి మానవుల సేవకంకితమైన కొన్ని నిర్దుష్ట కార్యక్రమాలు నిర్వహించేందుకు మానవునికి కాలం, పరిస్థితులు కలిసి రావాలి. కాని గాంధీజీ అవలంబించే మార్గాలను ఆయా పరిస్థితులలో వేరుచేసి చూడకూడదు. నిరాహారదీక్షలో, గాంధీగారికున్న నమ్మకం మనకు సులభంగా గోచరిస్తుంది. 'చిత్తశుద్ధితోకాని లక్ష్యశుద్ధి చేకూరదు– ఆ చిత్తశుద్ధికి నిరాహారదీక్ష అవసరం. ఒక ప్రముఖమైన లక్ష్యసాధనలో వ్యక్తి కృతకృత్యుడు కాలేకపోతే అతనిలో ఆత్మశుద్ధి లోపించిందని మనం గ్రహించాలి' ఇది గాంధీగారి విశ్వాసం. ఆత్మనిగ్రహం కలిగి తమ లక్ష్య సాధనకై పాటుపడ సంకల్పించేవారికే ఆయన ఈ విధానాన్ని బోధిస్తారు. నిగ్రహం లేనివారు దీనిశక్తిని దుర్వినియోగ పరుస్తారేమోనని ఆయన సంశయం. గాంధీజీ స్మృతి చిరస్మరణీయం కావాలని కోరేవారు ఈ విషయం గుర్తుంచుకోవాలి. ఆయన నిరాహారదీక్షకు పూనుకున్న కారణాలు కాని, సందర్భాలుకాని మనకవసరం లేదు. 'అధికారమనేది వ్యక్తులను అవినీతి మార్గం తొక్కిస్తుంది. ఆత్మపరిశుద్ధి లేనివాడు ఈ అధికారాన్ని ఉత్తమ లక్ష్యసిద్ధికి సద్వినియోగపరుచుకోలేడు– అన్న గాంధీజీ సిద్ధాంతాన్ని వారు గుర్తుంచుకోవాలి. అధికారం కోసం ప్రాకులాడే వారుగాని, దాన్ని ఆపాదింపచేసేవారుగాని లక్ష్యశుద్ధి విషయంలో గాంధీజీ నెలకొల్పిన ఆదర్శాన్ని దృష్టిలో వుంచుకోవాలి.

ఆయన దృఢంగా ఆచరించి ప్రవచించిన అహింసా సిద్ధాంతంపట్ల మాటలలో మాత్రమే మనం విశ్వాసం ప్రకటిస్తున్నాం. ఆచరణ శూన్యం. దానికితోడు అది సర్వసాధ్యమైన విషయం కాదేమోనని మనమే సందేహాలు వెలిబుచ్చుతున్నాం. మారణాయుధాలతో మనపై పోరాటం సాగించే శత్రువు విషయంలో అహింసా సిద్ధాంతం నిష్ప్రయోజనకరమేనని ఒకవేళ మనం అనుకున్నా, మనలో మనం, వ్యక్తుల పరస్పర సంబంధాల విషయంలో దీన్నెందుకు పాటించకూడదు ?– అంతఃకరణ, విశాల హృదయం, ధైర్యం, నైతికబలం– వీటిబాహ్యరూపమే అహింస అనే సత్యాన్ని మనం మరచిపోవలసిందేనా ? నైతిక సిద్ధాంతాల ఆధిక్యతపట్ల విశ్వాసం మనం ప్రకటించినంతకాలం ఈ సద్గుణాలను సర్వత్రా సర్వకాలాల్లో అలవరచుకోనేందుకు మనం కృషి చేయాలి. విభిన్నమతాలు, విభిన్నభాషలు, విభిన్నసంస్కృతుల సామరస్య భావనకు కీలకమైన సహనం మీద, శాంతి సహకారాలు ఆధారపడి వున్న మనలాంటి దేశాల్లో జీవనగౌరవాన్ని పరిపోషించేందుకూ, కొనసాగించ కలిగేందుకూ పై పేర్కొన్న సద్గుణాలను ప్రతి ఒక్కరు అనుసరించ వలసిన అవసరం ఎంతైనా వుంది.

## నిజాయితీ

నైతిక సిద్ధాంతాల ఆధిక్యతను గాంధీజీ నమ్మేవారనీ, ఆ నమ్మకాన్ని వ్యక్తపరచి ప్రచారం చేసేందుకే సత్యాగ్రహాన్ని ఆయన సాధనంగా చేసుకున్నారనీ మనకు తెలుసు. ఆయన సత్యాగ్రహోద్యమానికి దక్షిణాఫ్రికాలోని జాతి విచక్షణ సమస్య, భారతదేశంలోని బ్రిటిష్వారి పరిపాలన చరిత్రాత్మకమైన నిర్దుష్ట రూపాన్ని కలిగించినా, ఈ రాజకీయ సమస్యల వెనుక, సంఘ

టనల వెనుక దూరంగా మనం ఆలోచిస్తే దాన్ని వివిధ పరిస్థితులలో ప్రయోగార్హంచేసే విశిష్టగుణం మరొకటి అంతర్లీనంగా వున్నదనే భావం మనకు గోచరిస్తుంది. మానవాళిలో నైతిక చైతన్యం దృఢతరమయ్యే కొద్ది, సత్యం, న్యాయం, లోకంలో పటిష్టమైన పునాదులు వేసుకుంటాయి. అధికారం చలాయించి ప్రజలలో నైతిక చైతన్యం వర్ధిల్లేటట్లు చేయలేం. నైతిక చట్టానికి బద్ధులుగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వ్యవహరించేటట్లు మనం ప్రజలలో ఆసక్తిని కలిగించాలి. ఇది చూచేందుకు అతి సర్వసాధారణమైన విషయంగా కనిపిస్తుంది. ఆచరణకు ప్రారంభించినపుడు అది ఎంత కష్టతరమైన విషయమనేది మనకు బోధపడుతుంది. ఇతరులలో నైతిక చట్టం పట్ల విశ్వాసాన్ని పెంపొందింప దలచిన వ్యక్తి తన లక్ష్య సాధనకు అధికారం ఉపయోగించే విధానానికి ముందుగా తాను స్వస్తి చెప్పాలి. కష్టపడి, ఇతరుల పట్ల సహనభావం వహించే పద్ధతిని తరచూ అవలంబించి ఆచరించాలి. దీని కెంతో ఓర్పు. దీర్ఘ పరిశీలనాశక్తి, పరిశ్రమ అవసరం. సత్య మార్గంలో ప్రజలకు నాయకత్వం వహించ దలచిన ప్రతి వ్యక్తీ, కీర్తిభావాన్ని వెనక్కు నెట్టాలి. నిరంతరం ఆత్మపరిశీ చేసుకుంటూ నాయకుడు అనుచరుల అందరిమేలు కాంక్షించిన పిమ్మట తనమేలు చూచుకోవాలి. సిద్ధాంతాల కనుగుణమైన ఆచరణ అవసరమని మనమంతా అంగీకరిస్తాం. ఈ రెండింటి మధ్య స్వచ్ఛమైన సమన్వయాన్ని ఆదర్శప్రాయంగా సాధించ కలిగేందుకు ఎంతమందిలో అందులకు అవసరమైన నిజాయతీభావం మనకు గోచరిస్తుంది? ఈ సమన్వయాన్ని సంపూర్ణంగా సాధించేందుకు గాంధీగారు కృషిచేశారు. ఆయన దైనందిన జీవితవిధానాన్ని, వేషభాషలను, ఆహారపానీయాల నియమాలను అన్నింటికంటే ముఖ్యమైన, తోటి కార్యకర్తలపట్ల ఆయన అనుసరించే విధానం గురించి మనం తెలుసుకోవాలి. ఈ విషయాలనే మనం సాధారణంగా విస్మరిస్తుంటాము. మన చేతులు కట్టివేసే ఈ విధానాలను మనం అనుసరించదలచుకోము. అదే మన బలహీనత. నిజాయతీ వ్యక్తులు మాటలతో సంతృప్తి చెందరు

## నిర్మాణాత్మక కార్యక్రమం

గాంధీజీ తాను సూచించిన నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులై పోయేందుకు సర్వదా కృషి చేస్తారు. ఈ నిర్మాణ కార్యక్రమంలో ముఖ్యమైనవి రెండు అంశాలు. ఒకటి-ఎన్నుకొనే పని, రెండవది-దానిని నిర్వహించేందుకు సామర్థ్యంకల కార్యకర్త. తను విశ్వసించిన దాన్ని ఆచరించేందుకు గాంధీజీ తన వయోజన జీవితంలో గడిపిన ప్రతినిముషమూ, అనుసరించిన ప్రతి మార్గమూ ఆదర్శప్రాయంగా నిలచిపోయాయి. తాను నిజాయతీగా వుంటే ఇతరులలో ఆ గుణాన్ని ప్రోత్సాహించేందుకు వీలుంటుందని ఆయన భావన. నా కార్యనిర్వహణ విషయంలో నేను చూపే భక్తి శ్రద్ధలలో గాంధీ తత్వం ప్రతిఫలిస్తుంది. ఆ తత్వం నా మాదిరే అనేక మందిని ప్రభావితంచేసి వుండవచ్చు. గాంధీజీ నిర్మాణాత్మక కార్యక్రమం చరిత్రాత్మకమైనది. ఆయన సమాజ నిర్మాణ విధానం అన్ని కాలాల్లోనూ ప్రాధాన్యతను కలిగివుంటుంది.

ఈ నాడు ఈ విషయాలే మనం గుర్తించుకోవాలి. స్వేచ్ఛాయుత ప్రజానీకంగా ప్రభుత్వాన్ని నడిపే అధికారం కలిగిన మనలో, నాయకత్వం అనేది అధికారం మీద ఆధారపడకుండా, నిజాయతీ గుణాన్ని మూలాధారం చేసుకొని, నిర్మాణ కార్యక్రమం సాగిస్తూ తరతరాలు ఈ సదాశయ జ్యోతిని మోసికొని పోగల ఉత్తమ సమాజాన్ని సృష్టించ కలిగేదిగా వుండాలి. అదే నిజమైన నాయకత్వం. సర్వదా వాంఛనీయమైన నాయకత్వం.

*[డా. రాధాకృష్ణన్ సంపాదకత్వంలో వెలువడిన "గాంధీజీ-నూరేళ్ల చరిత్ర" నుండి.]*



# దేశం మరిచిపోలేని దివ్యపురుషుడు

వి. వి. గిరి

ప్రసిద్ధ ప్రజా నాయకుడూ, ప్రపంచ శాంతిదూత, సత్యాహింసల ప్రవక్త అయిన గాంధీజీ మన దేశంలో జన్మించడం భారతీయుల పూర్వజన్మ సుకృతం అది మన భాగ్యం. జీవిత కాలంలోనే తన ఆశయాలను సిద్ధింప జేసుకున్న ధన్యజీవి ఆయన.

తాను స్పృశించిన ప్రతి వస్తువుకూ రమణీయత చేకూర్చ గలిగిన మహా ప్రతిభావంతుడు గాంధీజీ ఆయన భావనలో సంఘజీవనం, సమగ్ర సంపూర్ణత్వాన్ని సంతరించుకున్నది సంఘ జీవనంలోని ప్రతిభాగము మహిమా సంపన్నమైన ఆయన స్పర్శచే ప్రభావితమై, చైతన్యవంతమైన ఆయన వ్యక్తిత్వాన్ని తన ప్రతి ఫలింప జేసుకున్నది మహాత్ముని జీవితం ఆయన సేవలు— ప్రపంచ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడుతాయి. ఆయన భారత దేశానికి స్వాతంత్ర్యం సాధించిపెట్టారు. ఈ స్వాతంత్ర్య సాధనా విధానంలోనే ఆయన మనకెన్నో అత్యంత ప్రాముఖ్యం గల విశేషాలను ప్రబోధించారు. భయద్వేషాలను విసర్జించేటట్లు తన అనుచరులకు శిక్షణనిస్తూ; సమైక్యత, సమానత్వం, భ్రాతృభావాల పరమార్థాన్ని గాంధీజీ ప్రజలకు బోధించారు.

చిన్ననాటినుండి గాంధీజీ కొన్ని ప్రాథమిక నైతిక సిద్ధాంతాలను అంటి పెట్టుకొని వుండేవారు ఇంగ్లాండులో వున్న రోజుల్లో మాంసం, మద్యం, మగువ అనే ఈ మూడింటిని ముట్టనని తల్లికి శపథంచేసి, తూ.చా తప్పకుండా ఆ నియమాలను పాటించి మాట నిలబెట్టుకున్న మహనీయుడాయన. అక్కడ చదివే రోజులలో ఛార్లెస్ బ్రాడ్లో, దాదాభాయ్ నౌరోజీలతో గాంధీజీకి పరిచయమేర్పడింది. లేబర్‌పార్టీ, ఫేబియన్ సొసైటీ, కారల్ మార్క్స్ బోధలపట్ల ఆయన ఆసక్తి ప్రకటించారు. ప్రముఖ వ్యక్తులైన లియోటాల్‌స్టాయ్, డేవిడ్ థోరో విధానాలపట్ల ఆదర భావాన్ని వ్యక్తం చేశారు

## మూల బీజం

దక్షిణాఫ్రికాలో గాంధీజీ సాగించిన కృషి, భవిష్యత్తులో ఆయన భారత రాజకీయ నాయకత్వం వహించేందుకు తగిన శిక్షణ నిచ్చింది. సత్యాగ్రహం అనే ఆయుధంతో ఆయన అక్కడ విదేశ ప్రభుత్వంపై పోరాటం నడిపించి, ముందు ముందు స్వదేశాన్ని రాజకీయ బానిసత్వం నుండి విముక్తి గావించే మహత్తర కృషికి పునాదులు వేసుకున్నారు.

కేవలం ఒక వ్యక్తిగానే గాక, ఒక సంస్థగా ఆయన వ్యవహరించి భారత భాగ్య విధాతగా దేశ ప్రజల భవిష్యత్తును తీర్చి



దిద్దారు అంతే గాదు, ప్రపంచ మంతటా శాంతి కాముకులైన ప్రజల హృదయాలను గాంధీజీ మహదాశయాలు నిరంతరం ప్రభావితం చేస్తూనే వుంటాయి.

## సర్వసద్గుణ రాశి

ఒక నిర్ణీత రూపంలో గాంధీజీని మనం వర్ణించలేము. ఆయన రాజ్యతంత్రజ్ఞుడు, రాజకీయవేత్త, సంఘ సంస్కర్త, రచయిత, ప్రబోధకుడు, మానవతామూర్తి, సత్యాన్వేషి, ఋషి, సర్వసంగ పరిత్యాగి—ఒకటేమిటి మూర్తీభవించిన సర్వసద్గుణ రాశియైన ప్రవక్తగా ఆయనను అభివర్ణించవచ్చు తన నమ్మకాలు ప్రకటించడంలో ఎప్పుడూ ధైర్యాన్ని ప్రదర్శించే వారు గాంధీజీ. అంతరాత్మ చెప్పినట్లు నడుచుకొనేవారు సర్వమానవ సంక్షేమమనే ఆదర్శ సాధనకై ఆయన అనేకమార్లు మొత్తం ప్రపంచాన్నే నిశ్చయంగా, నిస్సంకోచంగా ఎదిరించి నిలువ గలిగారు గాంధీజీ

నాయకత్వం జాతిని చైతన్య పూరితం చేసింది. ఒక్క జాతికే కాదు, సర్వ ప్రపంచానికే ఆయన నాయకత్వం ఆశాదీపంగా ప్రకాశించింది. కేవలం ఒక పావు శతాబ్దంలోనే దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం తేగలిగిన ఆయన నాయకత్వ ప్రధానం ఎట్టిదో మనం తేలిగ్గా వూహించుకోవచ్చు. మొక్కవోని సత్యాహింసలనే సరికొత్త సాధనలతో ఆయన స్వరాజ్యాన్ని సాధించారు. ఈ లక్ష్య సాధన విషయంలో ప్రపంచంలోని యితర దేశాలు హింసా ప్రవృత్తి గలిగిన దారుణ మారణ కారకమైన అణుబాంబుల సాధనంపై ఆధారపడుతున్న రోజుల్లో అహింసా మార్గంలో గాంధీజీ దేశానికి స్వాతంత్ర్యం సాధించారంటే ఆయన అనుసరించిన పద్ధతిలోగల ప్రాముఖ్యం మనకు తేలికగా గోచరిస్తుంది.

## నిజమైన ప్రజా నాయకుడు

మహాత్మాగాంధీ నిజమైన ప్రజానాయకుడు. ఆయన ప్రజలను నడిపించారు. కాని వారిచే నడిపింపబడే వారు కాదు. జన సామాన్యం మెప్పు పొందాలని వారి మతాల కనుగుణంగా ఆయన నడుచుకొనేవారు కారు. అట్లని ఆయనకు సమయం, సందర్భాలు తెలియవని కాదు. మారుతున్న పరిస్థితుల కనుగుణంగా తన పద్ధతిని మార్చుకోవాలనే విషయాన్ని ఆయన విస్మరించేవారు కారు. మౌలికమైన ఆశయాలు, సిద్ధాంతాల ముందు ఎంతటి త్యాగాన్నైనా ఆయన గొప్పదిగా భావించరు. చెడ్డది అని తాను భావించిన విషయంతో ఎప్పుడూ ఆయనకు అంగీకారం కుదిరేదికాదు.

అతి పవిత్రమైనదిగా, అనునిత్యం ఆచరించదగినదిగా మనం భావిస్తున్న గాంధీ తత్వం మూల ప్రాతిపదికను గురించి తెలుసుకొనడం ఈ నాడు మనకు సముచితమైన విషయం. భారత జాతి స్వేచ్ఛకే కాక సర్వమానవ జాతి స్వేచ్ఛకే గాంధీజీ కృషి చేశారు. "క్విట్ ఇండియా", "క్విట్ ఏషియా" అనే గాంధీజీ నినాదాలు కొన్ని కోట్ల ప్రజానీకాన్ని చైతన్య పూరితం చేశాయి. ఆసియాలో అనేక దేశాలు స్వేచ్ఛను సాధించుకున్నాయి. ఈ విషయంలో భారతదేశం మార్గదర్శకం కాగలిగింది. తన సర్వ సత్తాధికారానికు భంగం కలిగించే ఏ దేశాన్నైనా, ఏ శక్తినైనా దృఢంగా ఎదిరించి పోరాటం సాగించాలని ప్రతి జాతినీ, ప్రతి వ్యక్తినీ గాంధీజీ కోరేవారు.

ముందెప్పటికన్నా, గాంధీజీ సందేశాన్ని అర్థంచేసుకుని, అవగాహన చేసుకొనవలసిన అవసరం ఈ నాడు ఎక్కువగా వుంది. మన సరిహద్దుల్లో ప్రమాదం తెచ్చిపెట్టే దూరాక్రమణ శక్తులపట్ల మనం అప్రమత్తులమై వుండాలి. ఈ సందర్భంలో గాంధీజీ పలుకులు మనం గుర్తుంచుకోవాలి. "ఒకరిని దోచుకోవాలనే తత్వం మనదికాదు. ఇతరులు మనలను దోచుకోనియ్యం. అందుకే మన జాతీయభావం యితర జాతులకు ప్రమాదాన్ని కలిగించేది కాదు" అని ఆయన అన్నారు. మన జాతి విధానాలకు ఆదర్శప్రాయంగా వుండే గాంధీమహాత్ముని పై సందేశంలోని సారాంశాన్ని మనం గ్రహింగలిగితే అది మనకు క్షేమదాయకం.

మానవుడు ఎప్పుడూ పనిచేస్తుండాలి అనే విషయంలో గాంధీజీకున్న నమ్మకాన్ని మనం మరచిపోకూడదు. నిరంతర కృషి సంభరితమైనదే మానవజీవితమని ఆయన నిర్వచనం. న్యాయసాధనకు అన్యాయ మార్గాన్ని అనుసరించరాదని ఆయన సిద్ధాంతం. అనుసరించే విధానానికన్నా లక్ష్యమే ప్రధానమన్న సిద్ధాంతంతో ఆయన అంగీకరించరు. ఆయన ఒకసారి ఈ విధంగా అన్నారు "నీలోనూ, నాలోనూ ప్రత్యణువునా భగవంతుడు వ్యాపించి వున్నాడు. అందువల్ల ప్రపంచ సృష్టిలో సర్వప్రాణి కోటిలో సమానత్వ సిద్ధాంతాన్ని నేను వాంఛిస్తాను" అనే వాదన వారిది. జాతి, మత, వర్ణ, ఆర్థిక, సాంఘిక కారణాలపై మానవ జాతిలో విచక్షణా భావాన్ని ఆయన తీవ్రంగా ప్రతిఘటించేవారు.

గాంధీజీకి అతిసన్నిహితంగా వ్యవహరించే అదృష్టానికి నోచుకొన్న ఆచార్య కృపలాని మాటలలో చెప్పాలంటే "సాంఘిక ఆర్థిక, రాజకీయ జీవనాల మధ్య - వ్యక్తికీ సంఘానికీ మధ్య సమన్వయం కలిగించకలిగే మిశ్రమ విధానాన్ని రూపొందించ గలగడమే సర్వ మానవజాతి విముక్తికి తారకం కాగలదు" దీన్ని సాధించేందుకు వ్యక్తి కృషిలోను, సమిష్టి కృషిలోను, రాజకీయ, సాంఘిక ఆర్థికరంగాల్లో కృషిలోను ప్రవర్తన నీతిదాయకమై వుండాలి అని గాంధీజీ ప్రబోధించారు. ఆయన దృష్టిలో సత్యం, అహింస లక్ష్యసాధన విషయంలో సముచిత పరిజ్ఞానం మొదలైనవే నీతి సూత్రాలు.

ఆ విధంగా చూచినపుడు, ఉత్తమ శ్రేణికి చెందిన ప్రపంచ నాయకునిగా మనం గాంధీజీని చెప్పుకోవచ్చు. దేశానికిస్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మరో పాతిక సంవత్సరాల పాటు ఆయనజీవించి వుంటే తన అహింసా సిద్ధాంతాల కనుగుణ్యంగా, ప్రపంచశాంతినీ అంతర్జాతీయ సమైక్య భావాన్నీ ఆయన నెలకొల్పి వుండేవారు.

ప్రపంచ శాంతి మూలకందానికే ప్రమాదం కలిగించే మారణాయుధాల ప్రాతిపదికపై గాక, ఏ సదుద్దేశాలతో "ఐక్యరాజ్యసమితి" ఏర్పడిందో ఆ వుద్దేశాల ప్రాతిపదిక మీదనే, ప్రపంచ శాంతి భద్రతలకు ప్రతిభావంతంగా పనిచేయగల సంఘటిత శక్తిగా, దాన్ని గాంధీజీ వ్యవస్థీకరించి వుండేవారు.

## ఏకైక విశ్వసామ్రాజ్యం

అన్ని దేశాలు స్వయం పరిపాలనాధికారంతో, స్వయం శక్తిపై ఆధారపడాలి అని తాను చెప్తున్నా, వర్గవర్ణ విభేదాలు లేకుండా ఈ దేశాలన్నీ ప్రశాంత అంతర్జాతీయ తత్వాన్ని సృష్టించేందుకుకృషిచేయాలని గాంధీజీఉద్బోధించారు. ఏకైక విశ్వసామ్రాజ్యాన్ని నెలకొల్పాలని గాంధీజీ ఆశించారు. ఈ సందర్భంలో ఆయన అన్న మాటలు గమనించదగినవి "దేశ దేశాలమధ్యా రవాణా సౌకర్యాలు, మానవులంతా ఒకటే అనే భావన అతి వేగంగా పెరిగిపోతున్న ఈ రోజుల్లో, ప్రవర్ధమానమౌతున్న అంతర్జాతీయతా భావానికి, మన జాతీయత సమన్వయం కుదుర్చుకోవాలి. ఇది ప్రపంచంలో యితరచోట్ల జరిగే సంఘటనలకు సంబంధంలేనిదిగా వుండరాదు. ప్రపంచంతో సంబంధాలు తెంచుకొని, ప్రత్యేక దేశంగా భారతదేశం మనుగడసాగించలేదు. ప్రపంచ అభివృద్ధికర శక్తులతోపాటు మనం ముందుకు సాగిపోవాలి" అట్టి దివ్యపురుషుని దేశం ఎన్నటికీ మర్చిపోలేదు ★

# ఎల్లలులేని సందేశమిచ్చిన ఎల్లదేశాల నాయకుడు



డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్

ఈ సంవత్సరం అక్టోబరు రెండో తేదీన మనం జరుపుకుంటున్న గాంధీజీ శతజయంతి ఉత్సవాలలో ఉత్సాహంగా పాల్గొనడానికి ప్రపంచంలోని దేశాలు అనేకం ఎంతో ఆసక్తిని చూపిస్తున్నాయి. గాంధీజీ ప్రపంచ మానవుడే అయినప్పటికీ ఆయన భారతీయుడు కావడంవల్ల మనంకూడా ఆయన శత జయంతిని జరుపుకోవలసివుంది. "భారతదేశంవినా మరే దేశం కూడా, హిందూమతంవినా మరేమతంకూడా గాంధీజీని సృష్టించలేడు" అని లండన్ టైమ్స్ పేర్కొంది అందుకే గాంధీజీ మనవాడు. దేశానికీ, ప్రపంచానికీ గాంధీజీ చేసిన సేవ బహుముఖమైనది ఆయన గొప్ప జాతీయవాద నాయకుడు. బానిస సృంఖలాలను తెగగొట్టిన స్వేచ్ఛా ప్రదాత. ప్రేమకు పరాజయంలేదని ఋజువుచేసిన దయా మూర్తి నైతిక విలువలకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చే నిష్కళంకుడు, ఇతరులకు, ఆయన బోధ చేసేముందు తన లోని లోపాలను ముందుగా తొలగించుకో జూసే ఆదర్శ ప్రజానాయకుడు.

ముప్పయ్ సంవత్సరాలక్రింద నేను గాంధీజీని మూడు ప్రశ్నలు అడిగాను—1. మీ మతం ఏమిటి? 2. దానిని మీరు ఏ విధంగా అనుసరిస్తారు? 3. జీవితంమీద దాని ప్రభావం ఎట్టిది?

సంక్షిప్తంగా ఆయన యిచ్చిన సమాధానాలు యివి "ఇంతకుముందు నేను 'దేవునిలో నాకు విశ్వాసం వుంది' అని చెప్పేవాడిని, ఇప్పుడు 'నేను సత్యాన్ని నమ్ముతాను' అని అంటాను. లోగడ 'దేవుడే సత్యం' అని అంటూ వచ్చాను. ఇప్పుడు 'సత్యమే దేవుడు' అని అంటాను దేవుడు లేడనేవారు వుండొచ్చు. కాని సత్యాన్ని కాదనేవారు వుండరు. నిరీశ్వర వాదులుకూడా సత్యాన్ని అంగీకరించక తప్పదుకదా'' గాంధీజీ కొత్తగా చెప్పినదేమీ కాదిది. తరతరాలుగా, అనాదినుంచీ మనరక్తంలో జీర్ణించుకొని వస్తూవున్న ప్రాథమిక సత్యాలివి. వీటిమధ్య ఆయన ఊపిరి పీలుస్తూవున్నారు గనుక ఈ సత్యాలే ఆయిన రక్తంలోనూ ప్రవేశించాయి. 'సత్యంవద-ధర్మంచర' అన్న సూత్రాలను ఆయన చేపట్టారు. సత్యం-సత్ప్రవర్తన, వీటినే ఆయన సత్యాహింసలుగా పేర్కొన్నారు సత్యం అనేది తేలిగ్గా మనకు అందుబాటయ్యేదేమీకాదు బాహ్యాంత రాలమధ్య ఏకీకరణ సాధించడానికి ఆత్మకు కొంత పరిశ్రమ అవసరం వాఙ్మనసాయోరైకరూపం సత్యం. వాక్కు, మనసు ఒక్కటి కావాలి. ఆ ఐక్యతను మనం సాధించగలిగితేనే సత్యాన్ని అందుకోగలం. ఆ విధమైనసత్యం మనల్ని పక్కదారుల్ని పట్టించదు. అభూత కల్పనలవైపు కదలనివ్వదు. అబద్ధాల్ని మచేత ఆడించదు. అందువల్లనే సత్యాన్ని సాధించడం అనేది తేలిగ్గా అయ్యే పనికాదు. సత్యసంధులం కావాలనుకోవడంతోనే అయిపోతేం. అందుకే గాంధీజీ మాటల్లో చెప్పాలంటే "నామట్టుకు నేనే ఎంతో సంఘర్షణ పడుతున్నాను. నా లక్ష్యానికీ, నా స్వభావానికీ మధ్య ఒక పెద్ద సంఘర్షణ నాలో కొనసాగుతున్నది. ఈ రెండూ ఒకదానితో ఒకటి కలవవు ఈ రెంటికీ సఖ్యతను కూర్చాలంటే ఒకవిధమైన తపస్సు లాటి స్థితిని చేరుకోవాలి నేను. నాలోని మాత్సర్యాన్నీ, ద్వేషాన్నీ, చెడునూ అణచి వేసుకోగలగాలి, పరమేశ్వరునిలో తాదాత్మ్యం చెందగలగాలి"

గాంధీజీ బోధించిన మరొక విషయం -అహింస. ఈ అహింసా సిద్ధాంతాన్ని మనం ఆచరణలోకి అక్షరాలా తెచ్చి చూపాలనుకుంటే మనం ఈ అహింసా సిద్ధాంతాన్ని చాలా జాగ్రత్తగా అనుసరించాలి. అహింస అంటే దుర్బలత్వాన్ని ప్రకటించుకోమని కాదు, ఆత్మను పరిశుద్ధంగా వుంచుకోమని. అహింసా ప్రతిష్ఠాయాం తత్ సన్నిధౌ వైర త్యాగః అని యోగసూత్రం చెప్తున్నది.

అహింస వున్నచోట ద్వేషానికి తావులేదు. వైరత్యాగం-ప్రపంచంలోని ఏ ప్రాణిమీదా అసహ్యం లేకపోవడం వైరం లేకపోవడం, అదీ మనకు కావలసింది. వ్యామోహాలను మనం అణచివేసుకోవాలి. కోరికలను నిగ్రహించుకోవాలి ఏ వ్యక్తి మీగా ఏ ప్రాణిమీదా అసహ్యాన్ని పెంచుకోరాదు. ఈ విషయాల్నే యితర మతాలూ చెప్పాయి యితర వేదాంతులూ పలికారు "నీలోనూ, ప్రతి యితర వ్యక్తిలోనూ యావన్మానవజాతిని సందర్శించు. ఒక సాధనంగా కాదు, అదే ఒక లక్ష్యంగా" అన్నాడు కాంట్.

"ప్రాణం మీద భక్తిప్రపత్తులు కలిగివుండడం అవసరం మనం అనుసరించవలసిన సిద్ధాంతం యిదే" అన్నాడు స్విట్జర్. ఒకే ప్రాథమిక సత్యాన్ని' పలురకాలుగా వ్యక్తం చేసే మార్గాలు యివన్నీ. గాంధీజీ అహింసను గూర్చి చెప్పారంటే ఇక్కడ అహింసకు అర్థం మనం మనలోని చెడును జయించుకోవాలని. ప్రేమతో చెడును అణచివేయాలి. మంచిగా అణచి వేయడం సాధ్యంకానప్పుడు బలం వుపయోగించాలి. మహాభారతం కూడా చెప్పినది యిదే శాస్త్రాదపి శస్త్రాదపి ఈ రెండూ అనుసరణీయాలేనని గాంధీజీయే చెప్పారు.

హింసకు ఏ మాత్రం తావివ్వకుండా వుండేందుకే సాధ్యమైనంతవరకు మనం ప్రయత్నించాలి. ఒకవేళ చెడును జయించలేకపోతే, చెడును నిర్మూలించలేకపోతే ద్వేషంతో, భయంతో ప్రపంచాన్ని మాత్రం కలుషితం కానివ్వరాదు. ద్వేష భావాన్నే తీసివేయాలి మన ఆలోచననే విషపూరితం చేస్తుందది. సత్యాన్ని దర్శించడంలో యిది ఆటంకంగా నిలుస్తుంది. అందువల్ల ఏ విధమైన ద్వేషమూ, వైరమూ మన మనసుల్లో లేకుండా పరిశుద్ధులం కావాలి. అలా కానప్పుడు అహింసావాదులంగా చెప్పుకోవడంలో అర్థంలేదు. అహింస అంటే బలప్రయోగం చేయకపోవడంకాదు. అహింస అంటే ద్వేషంనుండి, వైరంనుండి, చెడు నుండి పరిశుద్ధులమై వుండడం. మనకూ, మన సాంప్రదాయానికీ పరిచితమైన పద్ధతిలో గాంధీజీ యిచ్చిన నిర్వచనం యిది భగవద్గీత యీ విషయాన్నే చెప్పింది అర్జునుడు యుద్ధం చేయడానికి నిరాకరించి యుద్ధ రంగం నుంచి నిష్క్రమించాలని భావించినప్పుడు కృష్ణుడు ఆయనకు ఉపదేశించాడు. క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వా ఉత్తిష్ఠ పరంతప. ఈ విధమైన హృదయ దౌర్బల్యం నీకు తగదు అన్నాడు. "అనార్యజుష్ట మస్వర్గ్యమ కీర్తికరమర్జున "

హింసను సహించమన్న గాంధీజీ క్రమక్రమంగా వైరాన్నీ, ద్వేషాన్నీ మనలోనించి తొలగించుకోవాలన్నారు. అయితే ప్రపంచం భయంకరమైన అణ్వస్త్రాలను తయారు చేస్తోంది. ఇప్పుడు మనముందు రెండేరెండు ప్రశ్నలు నిలచి వున్నాయి. నాశనం కావాలా? బ్రతకాలా? మనం బ్రతకాలంటే దౌర్జన్యాన్ని, హింసా విధానాన్ని పూర్తిగా విడనాడాలి అన్నారు గాంధీజీ. ఈ సిద్ధాంతంమీదే ఆయన తన జీవితకాలం యావత్తూ ప్రయోగం చేసి యుద్ధాన్ని మనం దూరం చేయాలన్న సందేశాన్ని మనకు అందించారు

ఈనాడు అణ్వస్త్రాలువున్న అగ్రరాజ్యాలకు ఒకదానిపై మరొకదానికి కన్నెర్రగా వున్నా సర్వమానవ హోమానికి తలపడడంలేదంటే అందుకు రెండు కారణాలు వున్నాయి. ఒకటి— బ్రతుకు మీద ఆశ వుండడం. ' రెండు— మూకవుమ్మడి మానవ మరణాలు దారుణంగా, కిరాతకంగా భావించడం. అయితే యింత మాత్రంచేత మారణ హోమం నిలిచిపోదు. మన స్వభావంలోనే, మన ఆలోచనలోనే మార్పు రానంత వరకు అణ్వస్త్ర మారణ హోమం ప్రమాదం మనల్ని వీడిపోజాలదు. అందువల్ల భయంతో ఈ ధోరణికి స్వస్తి చెప్పడం కన్న మరో మార్గంగా దీనిని విడనాడేట్టు చేయడానికి అగ్రరాజ్యాలు ఆలోచిస్తున్నాయి. ప్రస్తుత పరిస్థితుల్లో గాంధీజీ సిద్ధాంతాలు, ఆయన సందేశం మనకు ఒక గొప్ప ఓదార్పు. వాటిని ఆచరణలో పెట్టడానికే మనం కృషి చేయాలి.

అహింస అంటే సర్వోదయం అన్నారు గాంధీజీ. అంటే ప్రజలందరి జీవితాలకూ వెలుగు వెల్లివిరిసే ఉదయం. అదే ఆయన అన్నారు— రాజకీయమైన ఆధిపత్యం ఎక్కడా వుండడానికి వీల్లేదని. బాధ, అవమానం, బానిసత్వాల్తో యీ దేశం క్రుంగుతుంటే చూసి 'ఈ వ్యవస్థతో నేను పోరాడ వలసివుంది. దీనిని నేను తొలగించివేయాలి' అన్నారు. అలాగే తొలగించివేశారు. క్రిందఅణగివున్న, నిస్సారమైన భారతదేశం వల్ల దేశానికిగాని, ప్రపంచానికిగాని ఏ విధమైన సహాయమూ ఒనగూడదు. స్వేచ్ఛాయుతమైన, జ్ఞానవంతమైన భారతదేశం తనకేకాక యావత్ప్రపంచానికీ తోడ్పడగలదు—అని అన్నారు గాంధీజీ.

"నాదేశం స్వేచ్ఛావాయువుల్ని పీల్చాలని నేను కోరుతున్నాను. ఎందుకంటే ఒకవేళ ఎప్పుడైనా యీ మానవకోటి నిమిత్తం, అవసరమైతే, ఈదేశం తన ప్రాణాల్నైతం త్యాగం చేసుకోవచ్చు అప్పుడు."

మన దేశంలోనే మనం మనకు యిష్టంలేని పనులను అనేకం చేస్తున్నామని గాంధీజీ అభిప్రాయపడ్డారు. తోటిమానవులనే మనం హీనంగా చూస్తున్నాం. అందుకే ఆయనకు అస్పృశ్యత ఒక దురదృష్టంగా కనిపించింది. "ఈ అస్పృశ్యతా భావం హిందువుల హృదయాలలో చోటు చేసుకుని వున్నంత కాలం నేను హిందువుడిగా చెప్పుకోదలచుకోలేదు" అన్నారు గాంధీజీ. అదేవిధంగా లక్షలాది ప్రజల భవిష్యత్తును ఏ కొద్ది మందో హస్తగతం చేసుకుని వుండడం—అది కృత్రిమం, అస్వాభావికం, అనాగరిక చర్య దానిని మనం కొనసాగనివ్వరాదు. అదే విధంగా సాంఘిక అసమానత కూడా తొలగిపోవాలి. ఆర్థిక వ్యత్యాసం రూపుమాసిపోవాలి. మనదేశానికి సంబంధించినంతవరకు ఆయన వీటిగురించే పోట్లాడారు. కేవలం అహింసాయుత విధానంతోనే ఆయన వీటికి వ్యతిరేకంగా పోరాటం సాగించారు. అహింస అంటే సర్వ మానవుల

సంకేతము. దానికే ఆయన సర్వోదయం అని పేరు పెట్టారు. తన కాలాన్ని యావత్తూ ఆయన తనతో తాను పోరాడడానికే వినియోగించారు గనుకనే ఆయన జీవితం యావత్తూ దీనికే అంకితమైంది

గాంధీజీ నమ్రతగల వ్యక్తి. ఇతరులు చెప్పే అభిప్రాయాలను ఆయన చాలా ఓపికతో వినేవారు ఎప్పుడూ ఆయన సహనాన్ని కోల్పోలేదు. ఆ విధమైన సహనమే యీనాడు ప్రపంచాన్ని జయించగలదు ఈనాటికీ మనం ఉన్నత స్థితికి చేరుకోలేదు. నాగరికత జీవులుగా మనగలగడంలేదు. మానవ చరిత్ర తొలి ఉషోదయవేళల్లో వున్నాం. మనం ప్రయాణం చెయవలసిన దూరం యింకా ఎంతో వుంది. ఈ సిద్ధాంతాన్ని మనం క్రమపద్ధతిలోనూ, చిత్తశుద్ధితోనూ పాటిస్తే యీ ప్రపంచాన్ని యింతకన్న చక్కగా తీర్చిదిద్దగలం.

మాతృదేశాభిమానం ఒక్కటే అంతిమ లక్ష్యం కారాదని గాంధీజీ పేర్కొన్నారు. దానికి కూడా కొన్ని హద్దులు వున్నాయి. "నా దేశానికి సేవ చేయడానికై నేను జర్మనీకిగాని, ఇంగ్లాండుకుగాని బాధ కలిగించను" స్వదేశాభిమానంతో యితరులకు బాధ కలిగించే సంకుచిత దృక్పథం, స్వప్రయోజనా విధానం నిజమైన నాగరికతకు పనికిరాదు. పాశవిక బలంమీద ఆధారపడడం నాగరికతకు చిహ్నంకాదన్న నమ్మకాన్ని ఆయన లోకానికి కలిగించారు. మన బాధ్యతలను గుర్తింపజేశారు. ఆత్మ గౌరవాన్ని కలిగించారు. కారణం ఏదైనప్పటికీ, మనం హింసాయుత ధోరణిని అనుసరిస్తే, అది మనం తప్పుచేస్తున్నట్టే లెక్క. ఈ సిద్ధాంతాల్ని మనం అనుసరించలేకపోయినప్పటికీ వీటి సత్యాల్ని మనం అంగీకరించక తప్పదు, వీటిని గౌరవించక తప్పదు

గాంధీజీ సందేశానికి ఎల్లలులేవు అది సర్వ ప్రపంచానికీ సంబంధించిన సందేశం. గాంధీజీ సందేశాన్ని మన ప్రజలకూ, ప్రపంచ మానవాళికీ వినిపింపజేయడానికి శక్తి వంచన లేకుండా మనం కృషి చేద్దాం. అలా మనం పరిశ్రమించగలమనే నా దృఢ విశ్వాసం.



# మతం

దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

నారాయణ ! నారాయణ !
అల్లా ! అల్లా !
నా పాలిటి తండ్రీ, నీ పిల్లల మేమెల్ల !

మత మన్నది నా కంటికి మసకైతే
మతమన్నది నీ మనసుకు మబ్బైతే,
మతం వద్దు, గితం వద్దు
మాయా మర్మం వద్దు — నారాయణ ! నారాయణ !

ద్వేషాలూ రోషాలూ తెచ్చేదే మతమైతే,
కలహాలూ కక్షలు కలిగించేదే గతమైతే;
మతం వద్దు, గతం వద్దు
మారణ హోమం వద్దు — నారాయణ — నారాయణ !

మత మన్నది గాంధీ జీవితమైతే,
మత మన్నది లోకానికి హితమైతే
హిందువులం ముస్లిములం
హిందువులం క్రైస్తవులం
అందరమూ సోదరులం
అందరమూ మానవులం — నారాయణ ! నారాయణ !

# నెహ్రూనివాళి



గాంధీ గొప్ప జాతీయవాది. అంతేకాదు భారత దేశానికే కాక ప్రపంచానికంతటికీ తన సందేశమివ్వ దలచిన వ్యక్తి ఆయన. ప్రపంచ శాంతిని కోరారాయన. కనుక ఆయన జాతీయవాదం విశాల దృక్పథంతో కూడినది. స్వతంత్ర రాజ్యాలతో ప్రపంచ సమాఖ్య ఏర్పడాలని ఆయన అభిలషించారు. ఈ గమ్యం సుదీర్ఘమైన దైనప్పటికీ సక్రమమైనదని ఆయన విశ్వాసం గాంధీజీ ఇలా అన్నారు: "నేను మొత్తం ప్రపంచాన్ని దృష్టిలో వుంచుకొని ఆలోచిస్తాను. నా దేశభక్తిలో మానవాళి శ్రేయస్సు కూడా యిమిడివుంది. కాబట్టి నేను చేసే దేశ సేవలో మానవాళి సేవకూడా చేరివుంది. ఒంటరిగా స్వాతంత్ర్యాన్ని అనుభవించడం, ప్రపంచ రాజ్యాల లక్ష్యంకారాదు. పరస్పరం పోరాడే స్వతంత్ర రాజ్యాలు కాక స్నేహంగా మెలిగే స్వతంత్ర రాజ్యాలు కావాలి."

* * *

భారతదేశంలో గాంధీజీ ప్రభావం బహుముఖంగా వ్యాపించింది. అన్నింటనూ దాని ముద్ర పడింది ఆయన అహింసా విధానంవల్ల కానీ, ఆర్థిక సిద్ధాంతాల వల్లకానీ గాంధీజీ దేశనాయకులలో అగ్రేసరుడు కాలేదు. స్వాతంత్ర్యం పొందడానికి కృతనిశ్చయమైన భారతావనికి చిహ్నంగా అసంఖ్యాకమైన భారతీయులు ఆయనను భావించారు. భారతదేశంలోని అనేకమంది ప్రజలు ఎన్నో విషయాలలో ఆయనతో ఏకీభవించి వుండక పోవచ్చు. ఆయనను విమర్శించి వుండవచ్చు. భారత దేశ స్వాతంత్ర్య పోరాటం సమయంలో ఏదైనా విషయంలో ఆయనతో భేదాభిప్రాయం వచ్చిన వారు ఆయన సాహచర్యాన్ని వదులుకొని వుండవచ్చు. అయినప్పటికీ అట్టివారు తిరిగి ఆయన సాహచర్యాన్ని పొందారు. తమకు అనివార్యమైన నాయకునిగా ఆయన అండన చేరారు.

* * *

స్నేహితులారా, సహచరులారా, మన జీవితాలనుంచి వెలుగు అదృశ్యమై పోయింది అంతటా అంధకారం అలుము కున్నది. మీకు యిది ఎలా చెప్పాలో, ఏమిచెప్పాలో నాకు తెలియ కుండావుంది మన ప్రియతమ నాయకుడు. మనం ప్రేమ పూర్వకంగా పిలుచుకునే బాపూజీ, జాతి జనకుడు ఇక మనకు లేరు ఇలా నేను అనడం పొరపాటేమో అయినప్పటికీ, అనేక సంవత్సరాలుగా మనం ఆయనను చూస్తున్నట్లుగా యింక చూడ లేము. ఆయన సలహాలు పొందలేము. ఇది నా ఒక్కడికే కాదు దేశంలోని కోట్లాది ప్రజలకు పెద్ద దెబ్బ. నేనుకానీ, మరెవరైనా కానీ యిచ్చే సలహాలవల్ల తీరే విఘాతం కాదిది.

వెలుగు అంతర్ధానమైందని నేను అన్నాను అది కూడాపొర పాటే. ఈ దేశంలో ప్రకాశించిన వెలుగు సాధారణమైనది కాదు ఇన్ని సంవత్సరాలుగా ఈ దేశాన్ని ప్రకాశమానంగా వుంచిన ఈ వెలుగు యింకా ఎన్నో సంవత్సరాల వరకు దేశాన్ని యిలాగే వెలుగొందిస్తూ వుండగలదు. వెయ్యి సంవత్సరాల తరువాతకూడా దేశంలో ఆ వెలుగు కనిపిస్తుంది. ప్రపంచం దానిని చూస్తుంది. అసంఖ్యాకమైన ప్రాణులకు అది ఉపశమనం కలిగిస్తుంది అద్యతన వర్తమానాన్ని మించిన దేనికో ఆ వెలుగు ప్రాతినిధ్యం వహించింది. సజీవ సత్యానికి, మనను పెడమార్గం నుంచి తప్పించి సన్మార్గంలో పెట్టగలిగిన శాశ్వత సత్యానికి అది ప్రాతినిధ్యం వహించింది.

ఆయన చేయవలసింది యింకా ఎంతో మిగిలివున్న తరుణంలో ఈ దుర్ఘటన జరిగింది. ఆయన తన పని ముగించు కున్నారనికానీ, ఆయన అవసరం లేదని కానీ అనుకోలేము. ఇప్పుడు ఎన్నో ఇబ్బందులకు లోనైవున్న మనకు ఆయన లేని లోటు భరించ శక్యం కానిది.

(1948 జనవరి 30 వ తేదీన గాంధీజీ హత్య జరిగింది. నాటి సాయంత్రం నెహ్రూ ఆలిండియా రేడియోలో, మొదటే ప్రసంగాన్ని సిద్ధం చేసుకోకుండా అసువుగా ప్రసంగించారు ఆప్రసంగంలోని భాగమిది )

× × × ×

గాంధీజీ మనకు ఎలాంటి విజయాన్ని కోరారు? అనేక మంది ప్రజలూ, దేశాలూ, హింస, విద్రోహం, వంచన, దుష్ట మార్గాల ద్వారా పొందదలచే విజయాన్ని మాత్రంకాదు. ఈ విధమైన విజయం సిర్థమైనది కాదు చిరస్థాయిగా నిలువగల విజయానికి సత్యమనే శిలపైననే పునాదులు వేయడానికి సాధ్యమవుతుంది. గాంధీజీ మనకు కొత్తరకం రాజకీయ పోరాట విధానాన్నీ, నూత్నమైన రాజనీతిజ్ఞతనూ నేర్పారు. ఆయన రాజకీయరంగాలలో సత్యాహింసల శక్తిని ప్రదర్శించి చూపారు వారి వారి మత, రాజకీయ విశ్వాసాలతో నిమిత్తం లేకుండా ప్రతి భారతీయుణ్ణీ సాటివ్యక్తిగా, తోటి పౌరునిగా గౌరవించడం, అతనితో సహకరించడం బాపూజీ మనకు నేర్పారు. మనమంతా భారతమాతకు పుత్రులమే. మనం ఈ ధరిత్రిలోనే జీవించి తనువు చాలిస్తాము. మనం సాధించిన స్వాతంత్ర్యంలో మన మందరమూ సమాన భాగస్వాములం కాబట్టి స్వతంత్ర భారత దేశం ప్రసాదించే అవకాశాలను పొందేహక్కు దేశస్థులందరికీ సమానంగా వుండాలి. గాంధీజీ త్యాగాలు చేసింది, ఆత్మార్పణం గావించింది ఎవరో కొందరి కొరకు కాదు. ఈ ఆదర్శం కొరకే మనం పాటు పడాలి అప్పుడే "మహాత్మా గాంధీ కీ జై" అనడానికి మనకు అర్హత వుంటుంది.



## విజయానికి దగ్గర మార్గం లేదు



విజయ సాధనకు హింసాయుతమైన దగ్గర మార్గాలమీద నాకు విశ్వాసం లేదు. మహోన్నతమైన లక్ష్యాలపై నాకు ఎంతటి, గౌరవం, సాను భూతి ఉన్నప్పటికీ, వాటి సాధనకు హింసా విధానాలను అనుసరించడానికి మాత్రం నేను ఎట్టి పరిస్థితులలోను అంగీకరించ జాలను. దానికి నేను పూర్తిగా వ్యతిరేకిని. హింసా తత్వానికీ, నాకూ ఎప్పుడూ పొసగదు. అయితే నా అహింసా తత్వంయొక్క పరమార్థం యితరులతో వేరుపడి ఉండడమ్ము కాదు దౌర్జన్యవాదులతోనూ అరాజక వాదులతోకూడా నేను సంబంధాలు పెట్టుకుంటాను అయితే వారిని ఆ తప్పుడు మార్గంనుండి మరలించే ఉద్దేశ్యంతోనే వారితో నేను సంబంధం కలిగివుంటాను అసత్యం, హింసా మార్గాలద్వారా శాశ్వతమైన మంచి ఎన్నటికీ ఒనగూడదని అనుభవం రూఢిపరిచింది.

--గాంధీజీ



# గాంధీ తత్త్వంలో మూల సిద్ధాంతం

—సి. రాజగోపాలాచారి

సాధారణంగా లోకంలో ప్రజలు రెండు రకాల జీవిత సిద్ధాంతాలను నమ్ముతుంటారు. వ్యాఘ్రం తన మచ్చలను మార్చుకోలేదనే ధోరణి—అంటే తత్త్వాలు సామాన్యంగా మారవనే తత్త్వం కొందరిది. మరికొందరు ప్రతివ్యక్తీ సహజంగా మంచివాడేననీ, దుష్టులను, దుర్మార్గులను కూడా సరి అయిన మార్గదర్శకత్వం ద్వారా సన్మార్గంలో పెట్టవచ్చుననీ విశ్వసిస్తారు. ఈ జీవన తత్త్వాలలో గాంధీజీ రెండవ దానికి చెందినవారు.

గాంధీజీ చేసిన ప్రబోధాలకూ, ఆచరించిన విధానాలకూ యిదే ఆలంబన. ఆయన దేనినైతే ఆచరించారో దానినే ప్రబోధించారు. తన అభిప్రాయాన్ని సమ్మతింపజేయడం చాలా ముఖ్యమైన సందర్భంలో, అందుకు తాను చేసిన ప్రయత్నం విఫలమైనప్పుడు ఉచితమైన విధంగా సత్యాగ్రహం చేయాలని గాంధీ మనకు బోధించారు. ఈ విధమైన ఆత్మక్షోభ నిజాయితీని వెల్లడిస్తుంది. తన విశ్వాసానికి తాను ఎంత వరకు కట్టుబడివుండేదీ యిది ఋజువు పరుస్తుంది ఈ సత్యాగ్రహ విధానం ప్రతికక్షులపై విజయం సాధించగలుగుతుంది వారిలో పరివర్తన తేగలుగుతుంది.

హింసా చర్యలకు ప్రత్యామ్నాయంగా సత్యాగ్రహ విధానాన్ని గాంధీజీ ప్రపంచానికి ప్రతిపాదించారు తమ లక్ష్యసాధనకు యితర సరళ మార్గాలు విఫలమైనప్పుడు హింసా విధానమొక్కటే శరణ్యమని అప్పటి వరకు భావిస్తుండేవారు. హింస మూలంగా సాధించగలిగిన దానికంటే సత్యాగ్రహం ద్వారా అధికంగా పొందవచ్చునని గాంధీజీ అభిప్రాయం కోర్కెల సాధనలో సత్యాగ్రహం సుహృద్భావ వాతావరణాన్ని ఏర్పరచగా, హింసా చర్యలు తద్భిన్నమైన పరిస్థితిని సృష్టిస్తాయి సత్యాగ్రహానికి ఉదారస్వభావులు మాత్రమే ప్రభావితులవుతారు కాని కఠిన హృదయులను అది కదిలించలేదనే వాదనను ఆయన అంగీకరించలేదు 'ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే తిష్ఠతి' అన్న హైందవ సూక్తి పట్ల గాంధీజీకి నమ్మకం వుండేది స్వతహాగా మనుషులంతా మంచివారే. వారిలోని మంచితనాన్ని మేల్కొల్పాలనే భావన, హిందూ వేదాంత తత్త్వం నుంచి ఉద్భూతమైనదే.

అద్వైత సిద్ధాంతాన్ని ఛాయా మాత్రంగానైనా అవగాహన చేసుకోడానికి కఠోరమైన సాధన అవసరం. మన మహర్షులు చాటిన సత్యం అపూర్వ ధనరాశివలె నిక్షిప్తమై వుంది. దానిని మనం వెలికితీయాలి. అద్వైతం మన అద్వితీయమైన వారసత్వం. కాని మనం, మనమెంతటి ఐశ్వర్యవంతులమో తెలుసుకోకుండా దారిద్ర్యాన్ని, దుస్థితినీ అనుభవిస్తున్నాము.

మనకు సంక్రమించినటువంటి వారసత్వం మరే దేశానికి లేదు. కాని ఈనాడు, బహుశః ప్రపంచంలో మరెక్కడా కూడా, ప్రజలు భారత దేశంలోవలె ఆధ్యాత్మిక అంధత్వాన్ని అనుభవించడం లేదేమో! భీతి, దుర్బుద్ధి జీవితాన్ని దుర్భరం చేస్తాయి అద్వితీయమైన మన వారసత్వాన్ని మనం పొందగలిగినప్పుడు ఆనందాన్ని విశ్వవ్యాప్తం చేయగలుగుతాము.

యస్తు సర్వాని భూతాని
ఆత్మన్యే వానుపాస్యతి
సర్వ భూతేషు చాత్మానాం
తతోనో విజుగుప్సతే

తన చుట్టూరావున్న మనుష్యులు తనలో జీవిస్తున్నట్లుగానూ, వారందరిలోనూ తాను జీవిస్తున్నట్లుగానూ చూడగలిగిన చక్షువులతో వీక్షించే వ్యక్తి ఎవ్వరికీ భయపడడు ఎవ్వరినీ ద్వేషించడు. ఏకత్వాన్ని గుర్తించిననాడు మానవునికి అన్ని దుఃఖాలూ దూరమవుతాయి.

యస్మిన్ సర్వాని భూతాని
ఆత్మైవాభూత్ విజానత
తత్ర కో మోహః కః శోక
ఏకత్వం అనుపశ్యతే

అద్వైతం మన పరమలక్ష్యం. భారత దేశంలో దాదాపు ప్రతి ఒక్కరూ ఈ సిద్ధాంతాన్ని అంగీకరించేవారే కాని దురదృష్ట వశాత్తు మన చర్యలు మన ఈ పరమ లక్ష్యానికి అనుగుణమైనవిగా లేవు దీని నుంచి మనం చాలా చాలా దూరంగా వున్నాము

విశ్వమానవ భావనను పెంపొందించడంలో సఫలత సాధించడానికి సుదీర్ఘ ప్రయాణం సాగించాలి. కాని అందుకు దగ్గరి గమ్యం కూడా వుంది. ప్రయత్నం చేసినట్లయితే దానిని మనం తప్పని సరిగా చేరుకొనగలుగుతాము భయభ్రాంతులకూ రాగ ద్వేషాలకూ లోనైన వారితో ఏకత్వం పొందాలి. మనం చాలా అసమగ్రమైన వ్యక్తులం జీవాత్మ, పరమాత్మలకు మధ్య అభేదాన్ని గుర్తించలేక పోతున్నాము. అయినప్పటికీ మనం సానుభూతి, అవగాహనవంటి ఉదాత్తమైన స్వభావాలను ప్రదర్శించ గలుగుతాము ఇదే నిజమైన యోగం ఉత్తమ వ్యక్తులు తమ జీవిత రంగాలన్నింటిలోనూ వీటిని ఆచరణలో పెడతారు వీటిని ఆచరించకుండా యోగులుగా, తత్త్వవేత్తలుగా నటించరు ఇటువంటి విశిష్ట వ్యక్తులే ప్రపంచాన్ని అయోమయం నుంచి కాపాడుతారు.

"యోసావాసే పురుషః సోహాస్మి"

సూర్య భగవానుని ఉద్దేశించి ఈ మంత్రం చెప్పినట్లు సాధారణంగా వ్యాఖ్యానిస్తుంటారు కాని ఇక్కడ, ఈ ప్రపంచంలో మన చుట్టూరావున్న ప్రతి ఒక్కరినీ ఉద్దేశించి కూడా యిది చెప్పినట్లు నాకు అనుపిస్తుంది. అద్దం ముందువున్న బింబమే దానిలో ప్రతిబింబిస్తుంది సాధారణ దైనిక జీవితంలో సానుభూతినీ, అవగాహననూ ప్రదర్శించడం ద్వారా మనం ఈ సత్యాన్ని, ఈ సంపదను గ్రహించవచ్చు. ద్వేషాసూయలు, భయాందోళనలన్నింటినీ ఇది పారద్రోలుతుంది. ఈ మార్గాన్ని అనుసరించడానికి కఠినమైన సాధన అవసరంలేదు దైనిక జీవితంలో స్థిరచిత్తంతో, చిత్తశుద్ధితో సానుభూతినీ, అవగాహననూ, ఔదార్యాన్నీ ప్రదర్శించాలి.



# దండియాత్ర

-- కుందుర్తి

ప్రజలందరూ గాఢంగా నిద్రిస్తున్నవేళ
చీకటి స్వైరవిహారం చేస్తున్నప్పుడు
అకాలంగా వచ్చిన రవిలా ఒకానొక వృద్ధ భారతీయుడు
చినిగిన కొల్లాయి కట్టుకుని చేత్తో కర్ర పట్టుకుని
గుండెలో విశ్వాసబలం కూడగట్టుకుని
ఎవరికీ అందనంత ఎత్తున ఊహల మేడ కట్టుకుని
పరిపాలకుడు పరమాత్ముడైనా
ఊడిగం చేయించుకునే హక్కు వుండదని కేకలు పెట్టుకుంటూ
ఒంటరిగా పరుగెత్తుకుని వచ్చి ప్రజల మనస్సుల్లో
"తుంటరి" ఊహలు రేపాడు।

ఆయన పేరు సత్యం
భారతీయ సముద్రగర్భంలో దొరికిన మానవ ముత్యం
ఆయన ఊరు పోరుబందరు
ఊరిలోనే పోరున్నదని ఉలిక్కిపడ్డారు కొందరు।

అనాడు – కన్నగడ్డను ప్రేమించడం తప్పు
ప్రజలందరూ మనుషులేనని ప్రవచించడం తప్పు
ఆకాశంలో ఎగిరే విహంగాన్ని ఆశీర్వదించడం తప్పు
సెలయేటి స్వేచ్ఛాగానాన్ని సంస్తుతించడం తప్పు।

ఆయన్ను చూసేసరికి ప్రజలందరూ లేచారు
పర్వతాలు కదిలాయి ; నదులు పొంగాయి ; సముద్రాలు ఘూర్ణిల్లాయి
సమస్త విశ్వాంతరాళంలో విప్లవ నాదాలు మార్మోగాయి.



ఆయన అప్పుడు తన మౌనం చాలించి
బోసినోటి చిరునవ్వు ముత్యాల వాన
సముద్రం మీద జల్లుగా చల్లి

అప్పుడే పుట్టిన చరిత్ర శిశువుకు స్వాతంత్ర్యవాంఛా స్తన్యం పట్టి
ఇసుక తిన్నెల బియ్యపు రాసిలో
రాసిన భాషలో "లవణ"మని పేరు పెట్టి
తనే తల్లిగా, తనే తండ్రిగా
తనే సర్వ భారతీయ స్వాతంత్ర్య దీక్ష శక్తిగా
పరదాస్య బంధవిముక్తిగా
అభయ హస్తం లాంటి తన దక్షిణ హస్తమెత్తి
కరకరా పొడిచి వస్తున్న కర్మసాక్షికి నమస్కరించి
ప్రజాసందోహాల అలల కల్లోలాన్ని ఆగమని ఆనపెట్టి
సముద్రం వేపు చూసి
తనవెనుక పొంగివస్తున్న ప్రజాసముద్రం వేపుచూసి
పంచభూతాత్మకమైన సర్వప్రకృతిని
సాక్షీభూతంగా నిలిపి – సముద్రం మీదికి దండెత్తాడు

ఆయన యుద్ధానికి వ్యతిరేకి – మరి సింహాన్ని నిర్జించేదెలా ?
ఆయన శాంతికి చెలికాడు – మంత్రాలకి చింతకాయలు రాల్తాయా ?
హింసావాది సింహం పీడ వదల్టానికి అహింస తన మార్గ మన్నాడు
అందరికీ అంతా అర్థం కాలేదు కాని మొత్తంమీద సరే నన్నారు.

ఆయన వెంట నడిచారు కొందరు మౌనంగా
కొందరు పరువెత్తారు కొండంత ఉత్సాహంతో
అందరూ కదిలారు సముద్రం వేపు
అదేమి చేసింది పాపం !
సింహాన్ని వదలి సముద్రం మీదికి
చిత్రంగా వుంది దండయాత్ర !
దానిపేరే దండియాత్ర.



# సత్యాగ్రహం పుట్టుపూర్వోత్తరాలు

— జి. కె. గోగియా



అహింసా భావనాత్మకమైన కార్యాచరణ పథకమే పేరెన్నిక గాంచిన సత్యాగ్రహోద్యమం. ఈ ఉద్యమం భారతీయ తత్వానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. 1893 లో, వృత్తిరీత్యా గాంధీజీ దక్షిణాఫ్రికా పర్యటన జరిపినపుడు, ఆదేశంలో ఈ వుద్యమం విచిత్రంగా వెలుగులోకి రావడం తటస్థించింది. అక్కడ స్థిర నివాస మేర్పరచుకొన్న యూరోపియన్లు, భారతీయుల పట్ల అనుసరిస్తున్న దుర్భర విధానాన్ని కళ్ళారా చూచి, ప్రత్యక్షంగా అనుభవించి, గాంధీజీ దిగ్భ్రాంతి చెందారు ఈ దుస్సహ పరిస్థితే, ఆ పిదప, సత్యాగ్రహోద్యమానికి నాంది పలికింది. జాన్ గంథెర్ అన్నట్లు దక్షిణాఫ్రికా సంఘటన భవిష్యత్తులో జరుగనున్న దానికి ఒక రిహార్సలు వంటిది.

1893 లో అప్పుడే ఇంగ్లాండు నుండి స్వదేశానికి తిరిగి వచ్చిన 'బారిస్టర్' కావడం మూలాన, గాంధీజీ న్యాయవాద వృత్తిలో రాణించలేకపోయారు హిందూ, మహమ్మదీయ న్యాయ శాస్త్రాలకు సంబంధించిన విషయ పరిజ్ఞానం అంతంగా గాంధీజీకి లేకపోవడం కొంతవరకూ పై పరిస్థితికి కారణమైతే, ఆయనలో ఆత్మ విశ్వాసం లోపించడం మరో కొంత కారణమైంది వృత్తిలో అపజయం ముఖంలోకి తేరి పారజూస్తున్న తరుణంలో పోర్ బందర్‌లోని మేమెన్ల ఫరమ్‌కు చెందిన అబ్దుల్లా అండ్ కంపెనీ వారినుండి, గాంధీజీ ఒక కేసు విషయంలో దక్షిణాఫ్రికాలో కంపెనీ ప్రతినిధిగా వ్యవహరించేందుకు ఆహ్వానం వచ్చింది.

## ఆనాహ్లాదకరమైన అనుభవం

నేటాల్, ట్రాన్స్‌వాల్, ఆరెంజి ఫ్రీస్టేట్, కేప్ కాలనీ అనేవి నాలుగూ, దక్షిణాఫ్రికాలో బ్రిటిష్ కాలనీలు ఈ కాలనీలలో భారతీయుల పరిస్థితి బహు దుర్భరంగా వుండేది హేయ భావంతో యిక్కడి భారతీయులను 'కూలీల'ని పిల్చేవారు రెస్టారెంట్లలోనూ పార్కులలోనూ, థియేటర్లలోనూ వీరికి స్వేచ్ఛగా ప్రవేశం లభించేది కాదు.

డర్బన్ చేరుకొన్న మూడవ రోజు, గాంధీజీ తన క్లైయింటు అబ్దుల్లాతో కలసి ఒక న్యాయ స్థానానికి వెళ్ళడం తటస్థించింది. తలమీద టోపీ వుంచుకొని స్వదేశీ దుస్తులతో గాంధీజీ కోర్టుకు హాజరయ్యారు ఈ రకమైన వేషధారణ మేజిస్ట్రేటుకు నచ్చలేదు సహనం కోల్పోయిన ఆయన టోపీ తీసివేయవలసిందిగా గాంధీజీ నాదేశించారు మధ్యవర్తుల ఆదేశాలకు లొంగిపోయే మనస్తత్వం తనది కాకపోవడంతో టోపీ వుంచుకొనే గాంధీజీ సరాసరి కోర్టు బయటికి నడచి వెళ్ళారు.

కంపెనీ కేసు, ట్రాన్సువాల్ ముఖ్య పట్టణం 'ప్రిటోరియా'లో విచారణ జరిగేటట్లు నిర్ణయించబడింది. గాంధీజీ అక్కడికి వెళ్ళాలి. మొదటి తరగతి టిక్కెట్టు కొనుక్కొని ఆయన కంపార్టుమెంటులో కూర్చొన్నారు నల్లజాతివాడు ఫస్టుక్లాస్‌లో ప్రయాణం చేస్తున్నాడని ఒక శ్వేతజాతి ప్రయాణీకుడు ఫిర్యాదు చేయడంతో, రైల్వే గుమాస్తా, మూడవ తరగతి పెట్టెకు మారవలసిందిగా గాంధీజీ నాదేశించాడు. అందుకు గాంధీజీ నిరాకరిస్తే పోలీసుల సహాయంతో ఆయనను కంపార్టుమెంటు వెలుపలికి నెట్టించేశారు. ప్రయాణం మానుకొని తన క్లైయింటును, నట్టేట ముంచడం గాంధీజీ కిష్టంలేదు అందుచేత కొంత దూరం బాడుగ బండిలో ఆయన ప్రయాణం సాగించాలనుకున్నారు. కోచ్ కండక్టర్, తెల్లవాళ్ళతో పాటు. గాంధీజీని, కేబిన్‌లో కూర్చొని ప్రయాణం చేసేందుకు అనుమతించలేదు. పిల్లి మార్చినట్లు అనేక మార్లు ఆయన సీటు మార్పించడం జరిగింది. ఒకసారి కోచ్‌మెన్‌కు దగ్గరగా, మరోసారి నేలమీదా గాంధీజీకి స్థానం చూపించడం జరిగింది. ఇక్కడ కూడా వర్ణ వివక్షణా సమస్య గాంధీజీకి ఎదురైంది.

## వోటింగ్ చట్టం

గాంధీజీ దక్షిణాఫ్రికాకు వచ్చి అప్పుడే ఒక సంవత్సరం గడిచింది. ఏ కేసు విషయంలో తాను దక్షిణాఫ్రికాకు రావడం తటస్థించిందో అదే కేసు యిరు పక్షాలు రాజీపడి పరిష్కారం

కావడంతో గాంధీజీకి యిక అక్కడ వుండవలసిన అగత్యం లేక పోయింది తిరుగు ప్రయాణానికి ఆయన సన్నద్ధులయ్యారు. అయితే యీ లోగా తన క్లెయింటు అబ్దుల్లా ఏర్పాటు చేసిన వీడ్కోలు సభకు ఆయన హాజరుగావడం- అక్కడ ఒక వార్తా పత్రికలో భారతీయుల వోటింగ్ హక్కును రద్దుపరచే బిల్లు నొక దానిని దక్షిణాఫ్రికా ప్రభుత్వం ప్రవేశపెట్ట సంకల్పించిందన్న వార్త గాంధీజీ చదవడం- తటస్థించింది. అంతే, వెంటనే ఆయన ప్రయాణం మానుకొని, ఈ సమస్య గురించి పోరాటం సాగించాలని నిర్ణయించుకున్నారు. తుదకు వీడ్కోలు సమావేశం కార్యాచరణ సంఘంగా రూపొందింది.

## మూడు పౌన్ల సుంకం విధింపు చట్టం

ఇతర భారతీయులకన్నా, కంట్రాక్టు పద్ధతిలో దక్షిణాఫ్రికాకు తీసికొని రాబడిన భారతీయ కూలీజనం పరిస్థితి మరింత అధ్వాన్నమైంది. వీరిని పెద్ద పెద్ద చెరకు, తేయాకు, కాఫీ కంపెనీలలో పనిచేయించేందుకు భారతదేశం నుండి దక్షిణాఫ్రికాకు తీసుకొని వచ్చారు. ఒప్పందం ప్రకారం వీరు ఐదేళ్ళ



తర్వాత స్వేచ్ఛగా తమ కిష్టమైన వృత్తి నెన్నుకొని అక్కడే స్థిరపడి పోయేందుకు అవకాశం వుంది గడువు తీరిన పిమ్మట చాలామంది, వ్యాపారంలో ప్రవేశించారు వ్యవసాయ, పారిశ్రామిక రంగాల్లో వీరు యూరోపియన్ వ్యాపారస్థులతో సైతం పోటీచేసే స్తోమత సంపాదించారు.

ఈ పరిస్థితిని భరించలేక ప్రభుత్వం 3 పౌన్ల సుంకం విధింపు చట్టం తెచ్చింది. దీని ప్రకారం యిదివరలో కంట్రాక్టు పద్ధతి క్రింద దక్షిణాఫ్రికాకు వచ్చి, గడువు పూర్తి అయిన పిమ్మట అక్కడే స్థిరనివాస మేర్పరచుకొన్న భారతీయ కుటుంబాలలో ప్రతి ఒక సభ్యుడూ, అక్కడే నిలిచిపోయినందుకు గాను, మూడు పౌన్ల చొప్పున ప్రభుత్వానికి సుంకం చెల్లించవలసి వుంటుంది.

## రిజిస్ట్రేషన్ ఆర్డినెన్సు (బ్లాక్ ఆక్టు)

1906 లో దాదాపు యిదే సమయంలో ట్రాన్సువాల్ ప్రభుత్వం "ఏషియాటిక్ రిజిస్ట్రేషన్ ఆర్డినెన్సును" అమలులోనికి తెచ్చింది. భారతీయులందరూ, స్త్రీ పురుషులనే భేదం లేకుండా ప్రతి ఒక్కరూ తమ పేరు రిజిష్టరు చేయించుకొని తమ వ్రేలి ముద్రయి కలిగిన సర్టిఫికేట్లను తాము వెళ్ళిన చోటకల్లా వెంట బెట్టుకొని వెళ్ళాలనే బాధ్యతను భారతీయుల నెత్తిన రుద్దింది యీ ఆర్డినెన్సు ఈ నిబంధన మీరి నడుచుకొనే వారికి జరిమానా, జైలు శిక్ష, యింకా దేశబహిష్కరణ మున్నగు శిక్షలు విధించబడుతాయి.

ఈ అవమానాన్ని భరించలేక క్రోధోద్దీపితులైన భారతీయులు, 1906 సెప్టెంబర్ 11 న, గాంధీజీ నాయకత్వాన సమావేశమై 'బ్లాక్ ఆక్టు'కు బద్ధులం కాబోమని దేవుని పేర శపథం చేశారు.

దక్షిణాఫ్రికాలో భారతీయ సమాజానికి యిప్పుడు గాంధీజీ సంపూర్ణ నాయకత్వం వహించారు ఆప్యాయంగా అందరిచేత ఆయన 'భాయ్' అని పిలువబడ్డారు రస్కిన్ రచన "అంటూ దిస్ లాస్ట్" అనే పుస్తకం గాంధీజీని ప్రభావితుణ్ణి చేసింది కాయకష్టానికున్న గౌరవ విషయంలో గాంధీజీ అభిప్రాయాలను ఈ పుస్తకం ధృవపరిచింది. దానితో పట్టణ వాతావరణానికి దూరంగా 'ఫోనిక్సు సెటిల్‌మెంటు' నొకదానిని గాంధీజీ ఏర్పాటు చేశారు. తన అనుయాయులతో పాటు గాంధీజీ అక్కడికి తరలిపోయి, కాయకష్టంచేసి జీవన భృతి సంపాదించుకొనేవారు. వీరితోపాటు భారతీయ సమాజ వాణిగా పనిచేస్తున్న 'యిండియన్ ఒపీనియన్' అనే పత్రిక కూడా అక్కడికి తరలించబడింది.

## సత్యాగ్రహం పుట్టుక

బ్లాక్ ఆక్టు నిబంధనలను ప్రతిఘటించేందుకు భారతీయుల సంఘం తీసుకొన్న శపథం, గాంధీజీ భుజస్కంధాలపైన గురుతరమైన బాధ్యతను మోపింది అక్కడి భారతీయులకు, రిజిస్ట్రేషన్‌కు పోయేందుకు నిరాకరించమని, బ్లాక్ ఆక్టును ఉల్లంఘించమని గాంధీజీ సలహా యిచ్చారు.

గాంధీజీ, తదితర సత్యాగ్రహోద్యమ నాయకులు అరెస్టు చేయబడ్డారు. ఎప్పుడూ న్యాయవాదిగా తా నడుగుపెట్టే న్యాయస్థానంలో యిప్పుడు జీవితంలో మొట్టమొదటి సారిగా ముద్దాయి రూపంలో గాంధీజీ నిలబడ్డారు తనపైనున్న ఆరోపణల నొప్పుకున్నారు మేజస్ట్రేటు గాంధీజీకి రెండు నెలల సాధారణ జైలు శిక్ష మాత్రమే విధించారు అయితే, గాంధీజీలో కాని ఆయన అనుచరులలోగాని ఎట్టి మార్పు రాలేదు.

మున్నెన్నడూ కనీవినీయెరుగని భారత ప్రజల నిర్ణయానికి జనరల్ స్మట్స్ ప్రభుత్వం దిగ్భ్రాంతిచెందింది. శాంతికొరకు గాంధీజీతో సంప్రదింపులకు దిగడం తప్పితే జనరల్ స్మట్స్‌కు వేరే మార్గమే తోచలేదు. భారతీయులు స్వచ్ఛందంగా తమంతట తాము రిజిస్ట్రేషన్ చేయించుకొనే పక్షంలో ప్రభుత్వం ఏషియాటిక్ రిజిస్ట్రేషన్ ఆర్డినెన్సును ఉపసంహరించుకొనేటట్లు ఒప్పందం కుదిరింది. రిజిస్ట్రేషనుకు ప్రయత్నించండని భారతీయులకు గాంధీజీ సలహా యిచ్చారు. కాని జనరల్ 'స్మట్స్' మాత్రం మాట నిలబెట్టుకొనలేదు. గాంధీజీ విమర్శకులు, ఆయన ప్రభుత్వంతో లాలూచిపడి లంచం పుచ్చుకొని భారతీయ సమాజాన్ని తప్పుత్రోవ తొక్కించారని ఆరోపించసాగారు. అయితే నిజమైన సత్యాగ్రహిగా గాంధీజీ నిస్పృహచెందలేదు. కాగా సత్యాగ్రహోద్యమాన్ని పునఃప్రారంభించారు. 1908 ఆగస్టు 16 న రిజిస్ట్రేషన్ సర్టిఫికేట్లన్నీ ప్రోగుచేసి దగ్ధంచేయడం జరిగింది. భారతీయులు బహిరంగంగా ఈ విధమైన సవాలు విసరడంతో 'స్మట్స్' ప్రభుత్వానికి తలతీసివేసినంత పని అయింది. వెంటనే అపరాధులను శిక్షించేందుకు తీవ్రచర్యలను గైకొనాలని నిర్ణయించింది. ఫలితంగా అనేకమంది భారతీయులు నిర్దాక్షిణ్యంగా బలవంతంగా ఇండియాకు పంపించబడ్డారు. పెద్ద ఎత్తున అరెస్టులు జరిగాయి. గాంధీజీని నెలరోజులపాటు కటకటాల వెనుకకు పంపించారు. అరెస్టయిన సత్యాగ్రహుల కుటుంబాలు నిరాధారాలయ్యాయి. వీరికి ఆశ్రయం కల్పించేందుకై గాంధీజీ టాల్‌స్టాయ్ ఫారమ్‌ను ఏర్పాటు చేశారు.

గోపాలకృష్ణ గోఖలే గాంధీజీ కోరికపై దక్షిణాఫ్రికాకు వచ్చారు. మంత్రి మండలి సభ్యులతోనూ, తదితర అధికార వర్గంతోనూ సంప్రదించిన మీదట ఆయన గాంధీజీతో అంతాపరిష్కారమైందని ఒక సంవత్సరంలోపల గాంధీజీ ఇండియాకు తిరిగి వెళ్ళాలని అన్నారు.

ప్రభుత్వ వైఖరిలో మార్పు రాకపోతుందా అని భారతీయులు చాలాకాలం ఓర్పువహించారు. ఫలితం లేకపోగా దక్షిణాఫ్రికా ప్రభుత్వం పిడుగులాంటి ప్రకటన జారీచేసింది. క్రైస్తవ పద్ధతిలో జరిగిన వివాహాలు తప్ప, యితరంగా జరిగిన వివాహాలు చట్టసమ్మతంకావని, యిదివరలో భారతీయులు జరుపుకొన్న వివాహాలు రద్దుపరచడం జరిగిందని ప్రభుత్వం ప్రకటించింది.

గాంధీజీ కొత్త తంత్రాంగాన్ని ఆలోచించసాగారు. ఫోనిక్స్ ఆశ్రమం నుండి కస్తూర్బాతోసహా 16 మంది మహిళలు బయలుదేరి అక్రమంగా నేటాల్‌లో ప్రవేశించి మూడు పౌన్ల చట్టం భారంతో మూలుగుతున్న భారతీయ కూలీలు పనిచేసే న్యూకేజిల్ బొగ్గుగనులవైపు ముందుకు నడిచారు సమ్మె చేయవలసిందని పనివాళ్ళకు సలహా ఇచ్చారు. వెంటనే పని మానేసి వారు సమ్మె చేయడానికి ప్రారంభించారు. గనులలో పని స్తంభించిపోయింది. 2037 మంది పురుషులు, 127 మంది స్త్రీలు, 57 మంది పిల్లలతోసహా ఈ శాంతిసేన న్యూకాజిల్ నుండి ట్రాన్స్‌వాల్‌లో ప్రవేశించింది. గాంధీజీని తదితర నాయకులను అరెస్టు చేశారు. ఆయనకు జైలు శిక్ష విధించారు. అమానుష నేరాలకు ఖైదీ చేయబడ్డ నేరస్థులను వుంచే ఏకాంత కారాగృహంలో గాంధీజీని నిర్బంధించారు. భారతీయ కూలీ జనాన్ని వత్తిడిచేసి నికృష్ట పరిస్థితుల క్రింద గనులలో పనిచేసేందుకు తిరిగి పంపించారు. వారిది బానిస కన్నా అధ్వాన్నపు బ్రతుకయింది.

శాంతియోధులపట్ల అమానుషమైన యీ ప్రవర్తన ప్రపంచ ప్రజా హృదయాలను ఉద్రూతలూగించింది. ప్రపంచం అభిప్రాయాల ముందు 'స్మట్స్' తలవంచే పరిస్థితి ఏర్పడింది. 1914 లో ఇండియన్ రిలీఫ్ చట్టం ఆమోదించబడి దాదాపు అన్ని కఠిన చర్యలు ఉపసంహరించబడ్డాయి. మూడుపౌన్ల సుంకం విధింపుచట్టం కూడా రద్దుకావించబడింది. నేటాల్‌లో భారతీయులకివ్వబడిన డొమిసెల్ సర్టిఫికేట్లు దక్షిణాఫ్రికా యూనియన్ ప్రవేశ విషయంలో చెల్లుబడి అయ్యేటట్లు గుర్తించడం జరిగింది. భారతీయులిప్పుడు తమ ధర్మశాస్త్రానుసారం పెళ్ళిళ్ళు యధేచ్ఛగా నిర్వహించుకోవచ్చు. దీనితో భారతీయులు నెమ్మదిగా ఊపిరి పీల్చుకోసాగారు. కర్తవ్యపాలన ముగియడంతో మరింత బృహత్తరమైన కార్యభారం తనకై ఎదురౌగా నిరీక్షిస్తున్న తరుణంలో భారత దేశానికి 1914 జూలై 18న గాంధీజీ తిరుగు ప్రయాణం కట్టారు.



"బహిఃశ్శక్తుల సహాయం కోరని ప్రజానాయకుడు, కుతంత్రాంగంతో కాక, అందరినీ ఆకట్టుకొనగలిగిన వ్యక్తిత్వంతో ప్రకాశించే రాజకీయ వేత్త, విజ్ఞాన వినమ్రతా భావాలతో విలసిల్లి తన ప్రజల అభ్యున్నతికి దీక్షా, సంకల్ప శక్తులనే సాధనాలతో విజయం సాధించే అహింసా వీరుడు - ఐరోపాలో పాశవికతను ఒక సామాన్య మానవునిగా ఎదుర్కొన్న ధీశాలి, ఆ విధంగా గాంధీజీ అన్ని కాలాల్లోనూ మేధావిగా ప్రకాశించారు. ఇటువంటి మహత్తరమైన వ్యక్తి రక్త మాంసాలు కలిగిన మానవునిగా ఈ భూతలంపై ఒకప్పుడు సంచరించారంటే భావితరాలవారు నమ్మకపోవచ్చు."

-ఆల్బర్ట్ ఐన్‌స్టీన్



# మహా విప్లవవాది

—చెస్టర్ బౌల్స్—

ఏదో ఒక విధంగా వ్యక్తిగత జీవితాలపై గాంధీజీ ప్రభావం ప్రసరించని వ్యక్తులు యీ ప్రపంచంలో చాలా కొద్ది మంది మాత్రమే ఉంటారని చెప్పుతుంటారు. మనం నివసిస్తున్న యీ విప్లవ యుగంలోని ప్రభావాలను స్పష్టంగా అర్థం చేసుకొని వాటిని మనస్ఫూర్తిగా ఆహ్వానించిన యిటువంటి ప్రజానాయకుడు మరొకడు లేక పోవడమే దానికి కారణంగా భావించవచ్చు

"ప్రపంచంలో నేడు సంభవించిన యీ ప్రళయం వినాశనానికి హేతువు విచ్ఛిన్నకరమైన యీ శక్తి చాలా హానిని కలిగిస్తుంది. అయితే యీ ప్రళయంలో కూడా కొన్ని సుగుణాలు ఉన్నాయి ఇది సంస్కరణలను కోరుతున్నది న్యాయం, సమానతలు రాజ్యం చేయాలని ఆశిస్తున్నది" అని ఆయన అన్నారు

మన యీ శకంలో రాజకీయ జగత్తుపై ఆధిపత్యం వహించిన లెనిన్, ముసోలిన్, హిట్లరు, స్టాలి , మావో వంటి విప్లవవాదులందరిలో మహాత్మాగాంధీ మాత్రమే వినాశ హేతువులేని సంస్కరణలను ప్రతిపాదించారు ఆయన సమకాలీన విప్లవవాదులు విచ్ఛిన్నకర ధోరణులను రేకెత్తిస్తున్న సందర్భంలో ఆయన మానవునిలో-ముఖ్యంగా బడుగుస్థితిలో ఉన్న మానవునిలో అంతర్గతంగా నిక్షిప్తమై ఉన్న సహజ వ్యక్తిత్వాన్ని సైతం ఆయన ఆకళింపు జేసుకున్నారు. అదే క్రమమైన రాజకీయ, సాంఘిక అభివృద్ధికి కీలకమనుకున్నారు.

"విశ్వజనీనమైన సత్యాలు" గా గాంధీజీ నుడివినట్లు ఆయనలోని మూడు ప్రత్యేక ఉద్యమాల అంశాలు నేటి మన సమకాలీన చరిత్రను రూపొందించడంలోను, వాస్తవిక జీవనం వైపు మానవుని మరలించడంలోను దోహదకారులయ్యాయి

ఈ సామాన్య భారతీయ న్యాయవాది దాదాపు 50 సంవత్సరాల పాటు అన్ని దేశాలు, అన్ని జాతులు, అన్ని వర్గాలలోని బడుగు ప్రజల నిమిత్తం ధ్వజమెత్తిన వ్యక్తి యే శాస్త్రజ్ఞుడుగానీ, రాజకీయ వేత్తగానీ, విద్యావేత్తగానీ యీ మూడు అంశాలలోని యే ఒక్క దానిలోనూ కృషి చేయలేదు

ఈ మూడు అంశాలలో మొదటిది సామ్రాజ్య వ్యతిరేకోద్యమం, రెండవది మానవ వ్యక్తిత్వ పరిరక్షణ, మూడవది శాంతి స్థాపనోద్యమం.

రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత గాంధీజీ ప్రభావం ఫలితంగా మున్నెన్నడూ లేని విధంగా సామ్రాజ్య వ్యతిరేకోద్యమం కొనసాగి ఆసియా, ఆఫ్రికాలలోని కోట్లాది మంది ప్రజలకు విదేశ పాలన నుండి విముక్తి లభించింది



లెనిన్ కన్నా ఆర్నెల్లు ముందుగాను, సన్‌యట్‌సెన్ జన్మించిన రెండు సంవత్సరాల తర్వాతను జన్మించిన గాంధీజీ అనేక విషయాలలో వారిని మించిపోయారు

లెనిన్ కూడ న్యాయవాదియే అయితే జార్ ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించి అనేక సంవత్సరాల పాటు జైల్లో ఆయన గడిపారు. ముగ్గురూ ప్రారంభదశలో ఎక్కువగా విదేశాలలో ఉండి తమ తమ మార్గాలలో పనిచేశారు. పారిశ్రామిక విప్లవంతో జనించిన విప్లవ శక్తులకు తమకు తోచిన రీతిలో దోహదం చేశారు

రష్యాలో లెనిన్ 1905 లో సాయుధ విప్లవాన్ని, చైనాలో సన్‌యట్‌సెన్ రహస్యోద్యమాన్ని ప్రోత్సహించగా, గాంధీజీ, జాతి అహంకారంగల దక్షిణాఫ్రికాలో "సత్యాన్వేషణ" ఉద్యమాన్ని నిర్వహించారు

20 వ శతాబ్దంలోని మొదటి దశాబ్దంలో భారతదేశంలోను, దక్షిణాఫ్రికాలోను లక్షలాది మంది భారతీయులు ఘోరదారిద్ర్యానికి, వ్యక్తిగత అవమానాలకు గురికావడం చూచి ఉడికెత్తిపోయిన విప్లవ వాదులు సహజంగానే, దౌర్జన్యమార్గాలను అనుసరిస్తారు. అయితే గాంధీజీ నుకివిసట్లు సత్యాగ్రహంతో ఉద్భవించిన శక్తిని ఆయన ఆయుధంగా ఉపయోగించారు

బడుగు ప్రజలలో రగిలిన అసంతృప్తి జ్వాల పెడత్రోవ పడకుండా ప్రతి వ్యక్తిలో వ్యక్తిత్వాన్ని ఆత్మగౌరవాన్ని రేకెత్తించారు తత్ఫలితంగా వ్యక్తిలో సహనం ఏర్పడడమేగాక ఆత్మసంయమనం, ధీశక్తి పెంపొందింది శత్రువులను నాశనం చేయడంగాక వారితో ప్రేమతో, గౌరవంతో వ్యవహరించే విధంగా తన సహచరులను ఆయన తీర్చి దిద్దారు.

ఒకే ఒక తరంలో మున్నెన్నడు లేని విధంగా ప్రపంచంలో రాచరికాల స్థానే స్వతంత్ర రాజ్యాలు వెలిసినాయి అయినా యీ పోరాటం యింకా అంతంకాలేదు. మోహన్‌దాస్ కరమ్ చంద్ గాంధీ నాయకత్వంలో నడచిన భారత స్వాతంత్ర్య ఉద్యమం ఫలితంగానే సామ్రాజ్యవాదులు, పరాధీన ప్రజలు తమ చర్యలను, ఆలోచనలను పునః నిర్ణయించుకోవాల్సి వచ్చిందని మరో వేయి సంవత్సరాల ఖ్యాతి చరిత్ర నివేదిస్తుంది

సామ్రాజ్యాధికారానికి వ్యతిరేకంగా ప్రప్రథమ గా జరిగిన భారతీయ ఉద్యమాన్ని కోపోద్రేకులైన తీవ్రవాదుల నాయకత్వంలో దౌర్జన్య మార్గాలలో నిర్వహించబడిన పక్షంలో గత పది సంవత్సరాల చరిత్ర విధ్వంస పూరితమై మరోవిధంగా ఉండేది. ఈ విధంగా ఆసియా ఆఫ్రికాలలో నిస్పృహతో అణిగిఉన్న ప్రజలు, సామ్రాజ్యవాదులను వీరావేశంతో విధ్వంసంచేసి రక్తపుటేరులు ప్రవహింప జేసి ఉండేవారు

అయితే అటువంటి సంక్లిష్ట పరిస్థితులలోనే గాంధీజీ అహింసాయుత ఉద్యమాన్ని ప్రబోధించి, శాంతిమార్గాన్ని అవలంబింప చేశారు తత్ఫలితంగానే భారతదేశంలో పరిపాలనా మార్పిడి ప్రశాంతంగా జరిగి మాజీ పాలకులు, మాజీపాలితుల మధ్య సుహృద్భావ పూరితమైన స్నేహ సంబంధాలు ఏర్పడి రాజకీయంగా సుస్థిరమైన ప్రజాస్వామ్య జాతి అవతరించ గలిగింది. ఆసియా ఆఫ్రికా యితర దేశాలు, ఆయన చూపిన మార్గాన్ని అనుసరించిన ఫలితంగానే వాటికి స్వాతంత్ర్యం లభించింది

మత విద్వేషాలతోను, మత దురభిమానంతోను విచ్ఛిన్నమైన భారతదేశం, స్వాతంత్ర్యాన్ని ఆత్మగౌరవాన్ని సాధించలేదని గాంధీజీ స్పష్టంగా గమనిచారు హరిజనులకు సమాన అవకాశాలు సమాన గౌరవం లభింపచేయాలి, అన్ని కులాలు, మతాలు, వర్గాలలో సాంఘిక దృక్పథం ప్రేరణకు ఆయన చేసిన కృషి ఫలితంగానే నేడు భారతదేశ ప్రజాస్వామ్యం పటిష్ఠంగా ఉండగలిగింది

సమాన అవకాశాలు, మానవ హక్కుల విషయంలో ఆయన నిర్వహించిన పాత్రకు యీ దేశం గాంధీజీకి ఎంతగానో ఋణపడి ఉంది.

అమెరికాలో దాదాపు కోటిన్నరమంది నీగ్రోలు డా॥ మార్టిన్ లూథర్ కింగ్ నాయకత్వంలో ప్రథమ తరగతి పౌరసత్వానికి పోరాటం సాగించారు దానికితోడు రాజ్యాంగ బద్ధంగా ఓటు హక్కు, సంపూర్ణ విద్య, సమాన ఉద్యోగావకాశాలు, ప్రజావసతి ప్రదేశాలలో సమానమైన మర్యాద యివ్వాలని కూడా వారు కోరుతున్నారు. వారు గాంధీతత్వాన్నీ, గాంధీమార్గాన్నీ అనుసరిస్తూ క్రమంగా తమ కోర్కెలను సాధిస్తున్నారు.

గాంధీజీ ఒకసారి యిలా అన్నారు. "నీగ్రోల ద్వారానే స్వచ్ఛమైన అహింసా సందేశం ప్రపంచానికి లభిస్తుంది " అయితే అమెరికాలో అటువంటి అభివృద్ధి రావడం అసంభవం, అవాస్తవిక మని దశాబ్దం క్రితమే అవగతమైంది

తమ అనుచరులలో ఆత్మవిశ్వాసాన్నీ, ఆత్మగౌరవాన్నీ కల్పించి అవసరమైన శక్తిని పెంపొందించడానికి డా॥మార్టిన్ లూథర్ కింగ్ గాంధీజీ మార్గమైన"స్వీయాభివృద్ధి' కార్యక్రమాన్ని అనుసరించారు

అరవై సంవత్సరాల క్రితం దక్షిణాఫ్రికాలో గాంధీజీ తన సహచరులను యిలా హెచ్చరించారు. "మనపై శ్వేత జాతీయులకు గల ఫిర్యాదులను ముందు పరిశీలిద్దాము ' జాతి విభేదాల పాటింపుకు శ్వేతజాతీయులు చెప్పుతున్న కారణాలు ఎంతవరకు న్యాయమైనవో పరిశీలిద్దాము."

"ఆ తర్వాత మన పౌరహక్కులకు పోరాడుతూనే, మనం అడిగిన సంస్కరణలను వారు ప్రవేశ పెట్టడానికిముందుగానే యీ బీదరికంలోనే మనయింటిని మనం సరిదిద్దుకుందాము, మన యిబ్బందులన్నిటికీ శ్వేతజాతీయులను ఆరోపించ లేము "

అదేవిధంగా మార్టిన్ లూథర్ కింగ్, అమెరికా అంతటా తన నీగ్రోసహచరులకు యీ విధంగా ప్రబోధించారు : "జాతి విచక్షణా విధానానికి శ్వేత జాతీయులు చెప్పుతున్న కారణాలు పరిశీలిద్దాము, మనకు మనం యేమైనా చేయ గలుగుతామేమో పరిశీలిద్దాము "

గాంధీ వలె ఆయన కూడ తమ శక్తితోను ఆచరణతోను తరతరాలనుండి అనుసరించబడుతున్న యీ విచక్షణ విషవలయాన్ని ఛేదించడానికి ముందుకు రావాలని పిలుపునిచ్చారు

అమెరికాలో అనుసరించ బడుతున్న గాంధీ తత్వమైన శాసనోల్లంఘన ఉద్యమ ప్రభావం యితర విధాలుగా కూడ ఎన్నో విజయాలను సాధించి పెట్టింది

విశ్వ శాంతి, ప్రపంచంలో పరస్పర సుహృద్భావం విషయంలో కూడ గాంధీజీయే మార్గదర్శకులైనారు.

వివిధ దేశాలమధ్య శాంతి స్థాపన కృషి బహు పురాతనమైనదే అయినా ఆయన మార్గావలంబన ఫలితంగా యీ విషయంలో కొంత వరకైనా ఫలితాన్ని సాధించగలిగామని చెప్పవచ్చు.

రెండవ ప్రపంచ యుద్ధం జరగడానికి ముందు గాంధీజీ యిలా వ్రాశారు "ఆయుధ నిర్మాణానికి యీ విధంగా పోటీలు

కొనసాగితే చరిత్రలో మున్నెన్నడు జరగని విధంగా మారణ హోమం జరుగుతుంది. విజయం సాధించిన జాతికూడ మృత ప్రాయంగా మిగుల్తుంది"

గాంధీజీ ఊహించిన యుద్ధం రానే వచ్చింది 4 కోట్ల మంది స్త్రీ పురుషులను, బాల బాలికలను అది పొట్టన పెట్టుకుంది. అణ్వాయుధాలు యిలాగే పెంపొందితే ముమ్ముందు అది పదింతల మంది ప్రాణాలు బలిగొనవచ్చు

ఈ సందర్భంలో గాంధీజీ యిచ్చిన సందేశం ప్రత్యేకంగా గమనార్హమైనదని నేను భావిస్తున్నాను గాంధీజీ, సహనం, సౌభ్రాతృత్వం అనే నినాదాలను యిచ్చి యిరవైయవ శతాబ్దపు రాజకీయ విధానాలలో వాటిని యిమిడ్చి వాటికొక విశిష్టతనీ, అర్థాన్నీ కల్పించారు

1820 లో కేంబ్రిడ్జిలోని హార్వర్డ్ గ్రంథాలయంలో అమెరికన్ యువ రచయిత హెన్రీడేవిడ్ థోరే, ఉపనిషత్తుల ఆంగ్లేయ అనువాదాలు పఠించి అందులో నడిపిన మానవ వ్యక్తిత్వం, నిరంతర కృషిని గూర్చిన సారాన్ని గ్రహించి, క్రమంగా రాజకీయ, సాంఘిక రంగాలలో అనుసరించాల్సిన అహింసా సిద్ధాంతాలను ఆయన రూపొందించారు.

1860 లో న్యాయరహితమైన చట్టాలను వ్యతిరేకిస్తూ జైలుకు వెళ్ళారు "శాసనోల్లంఘన" అనే కొత్త ఉద్యమానికి రూపకల్పన చేస్తూ కరపత్రాన్ని ప్రచురించారు సందర్భవశాత్తు. యీ కరపత్రం రష్యాలోని టాల్‌స్టాయ్ చేతుల్లోకి వెళ్ళింది. ఆయన దాని ప్రతిని దక్షిణాఫ్రికాలోని గాంధీజీకి పంపారు

థోరే సిద్ధాంతం, టాల్‌స్టాయ్ రచనలు, తన 'సత్యాన్వేషణ" అనుభవాల ఫలితంగా గాంధీజీ అహింసా పద్ధతులను అమలులోకి తెచ్చి అంతిమంగా భారతదేశానికి, యితర దేశాలకు స్వాతంత్ర్యం లభింపజేశారు 60 సంవత్సరాల తర్వాత ఆయన సిద్ధాంతాలు, విధానాలు అమెరికాకు వ్యాపించాయి

విశాల ప్రపంచంలోని కోటాను కోట్ల మంది పౌరులు, తమ స్వాతంత్ర్యాన్నీ, విశ్వాసాన్నీ, వ్యక్తి గౌరవాన్నీ గూర్చి తమ భావాలను బహిర్గతం చేసుకునే శాంతియుత విధానాలను గాంధీజీ ప్రవచించారు మానవ కోటి అటువంటి సరైన మార్గాన పయనిస్తున్నారనీ, మన సమస్యలు సులభతరం అవుతాయనీ నేను భావిస్తున్నాను.

## జైత్రయాత్ర

హోరని ప్రవహించే వైతరిణి
మార్గం తొలగి చీలిపోయింది
ఆకాశాన్నుంచి రాలిన పూవులు
నవ్వుకున్నాయి భరతం నర్తించాయి.

అప్పుడే మూడనుమూసిన గోమాత
పాలతో పాదాలు అభిషేకించింది
సముద్రగర్భంలోని జ్ఞానగీతి
అవతరించింది ఆనందంతో

ఏకోదరుల రక్తస్పర్శకు
సిద్ధిస్తుంది మానవత్వం

వ్యాకులిత హృదంతరాళంలో
నవరాగమాలిక అల్లుకుంటాయి

అబ్దాలు దాటుకొస్తున్న సంస్కారం
అడుగు వెనక్కు వేసినదొక క్షణం
యుగాంతర స్వరూపాన్ని చూచి
పదేళ్ళు ముందుకి పరుగెత్తాయి.

అన్నా! చేయీ చేయీ కలిపి
చెట్టాలు వేసుకుందాం
సేతువుకి హిమాచలానికి కలిపి
పెళ్ళిచేద్దాం వైభవంగా

—పన్యాల

(బాపూజీ బెంగాలులో పదయాత్ర సాగించిన వేళ)

# కస్తూర్బా

ఆర్. ఆర్. దివాకర్



ఆధునిక భారత మహిళాలోకం చరిత్రలో కస్తూర్బా పేరు చిర స్మరణీయమైనది

బాల్యంలో గాంధీజీ, కస్తూర్బాలు పోర్‌బందర్‌లో యిరుగు పొరుగువారు తోటి పిల్లలతో కలసి వారు ఆడుకునేవారు. వారికి పన్నెండవ యేట 1881 వ సంవత్సరంలో వివాహం జరిగింది. వారి దాంపత్య ప్రాయం 62 సంవత్సరాలు. ఈ దీర్ఘకాలంలో కస్తూర్బా, గాంధీజీకి సహచరురాలుగానూ, అనుచరురాలుగానూ, శిష్యురాలుగానూ సంచరించింది ఆయనతో కలిసి బాధలు అనుభవించింది నాయకత్వం వహించింది సత్యాగ్రహ పాఠాలను తాను కస్తూర్బానుంచి అభ్యసించినట్లు ప్రకటించి గాంధీజీ ఆమెకు జోహార్లర్పించారు.

శ్రీరామచంద్రుని నాటి పౌరాణిక యుగం నుంచీ, సోక్రటీస్ నాటి చారిత్రిక కాలంనుంచీ, నేటి పికాసో కాలంవరకు కూడా మహాపురుషులకు, మేధావులకు సహధర్మచారిణులుగా మసలగడం పడతులకు ఒక అసిధారా వ్రతమే అయింది కాని వారు ఎన్ని యిడుములనైననూ అనుభవించారు ఎన్ని పరీక్షలనైననూ ఎదుర్కొన్నారు

మగువ మాతృమూర్తి కస్తూర్బాను గురించి సంక్షిప్తంగా వ్రాయడం సులభసాధ్యం కాదు సమంజసంకూడా కాదు ఆమె సీత, సావిత్రి, అరుంధతి లేక యశోధర వంటిదని కానీ, లేదా రామకృష్ణ పరమహంస అర్ధాంగి వంటిదని కానీ ఒక్కమాటలో ఆమెను గురించి చెప్పజాలము చరిత్ర పునరావృత్తం కావచ్చు కాని వ్యక్తుల విషయంలో యిది వర్తించదు కస్తూర్బా అనేక విధాల అద్వితీయమైన వ్యక్తి.

మన పురాణాలలో ప్రసిద్ధికెక్కిన సీత, దమయంతి, కుంతి, ద్రౌపది మొదలైన సాధ్వీమణులను గురించికానీ, నేటి కాలంలో ఖ్యాతిగాంచిన శారదామణి, సరోజిని మొదలైన విదుషీమణులను గురించి కానీ మనం ఆలోచించినప్పుడు మూర్తీభవించిన ఆదర్శమహిళలుగానే వారినివీక్షిస్తాము కాని వారుఅట్టి అనుపమ స్థితికి చేరుకోవడానికిగల కారణాలను గురించి మనకు అంతగా తెలియదు

గాంధీజీ విషయంలోకానీ, కస్తూర్బా విషయంలోకానీ పరిస్థితి యిదికాదు. గాంధీజీ ఆత్మకథ వల్లనైతేనేమి, గాంధీజీ-కస్తూర్బాలు అనేక దశాబ్దాలపాటు ప్రజల మధ్య సామూహ్య జీవితం గడపడం వల్లనైతేనేమి, ఆధునిక పత్రికారచన వల్లనైతేనేమి, కలిసి మెలిసి ఆడుకున్న పిల్లలుగా, ప్రేమికులుగా, గృహస్థులుగా, సాంఘిక కార్యకర్తలుగా, జననీ జనకులుగా, నాయకులుగా, కడకు చరిత్రలోనే అసమానులైన మహావ్యక్తులుగా పరస్పరం వారి అనుభవాలు, అనుభూతులను గురించి తెలుసుకునే భాగ్యం మనకు కలిగింది. వారు ఎక్కువగా పరస్పర ప్రభావం ద్వారా తమను తీర్చి దిద్దుకున్నట్లు గోచరిస్తుంది వారు స్వయంకృషితో సాఫల్యం పొందారు. తాము లక్ష్యంగా పెట్టుకొన్న ఆదర్శాల కొరకు ధైర్యంగా నిలబడ్డారు పరాయి పాలన నుంచి భారత దేశానికి విమోచనం కలిగించడం ఉన్నతమైన ఆశయం కాగా, భారత దేశంలో తరతరాలుగా వుంటున్న కుల, మత, సాంఘిక దురాచారాలనూ, దారిద్ర్యాన్ని, అజ్ఞానాన్నీ నిర్మూలించడం అంతకంటే ముఖ్యమైనది. భారతదేశాన్ని సూకటి వ్రేళ్ళతో కదలించి అభ్యుదయకరమైన నూతన పథంవైపుకు మళ్ళించడానికి వారు ఉద్యమించారు.

గాంధీజీ, కస్తూర్బాల జీవిత సంఘటనలను కొన్నింటిని పరిశీలించినట్లయితే, దక్షిణాఫ్రికాలోనూ భారత దేశంలోనూ ఈ దంపతులు పెక్కుపర్యాయాలు క్లిష్టమైన, తీవ్రమైన పరిస్థితులకు లోనయినట్లు వెల్లడవుతుంది ఆధునిక వైవాహిక-ముఖ్యంగా పాశ్చాత్య వైవాహిక జీవిత ప్రమాణాల దృష్ట్యా ఈ సందర్భాలలో ప్రతి ఒక్కటీ ఆ దంపతులను విడాకుల కొరకు న్యాయస్థానానికి రప్పించగలిగినదే కాని వారి దాంపత్యం చిరస్థాయిగా నిలిచింది ప్రతిసారీ వారు విజేత, పరాజితులుగా కాక, ఆట మాత్రంలో తమ జయాపజయాలతో నిమిత్తం లేకుండా నిష్కల్మష హృదయాలతో కరచాలనం చేసే యిద్దరు క్రీడా యోధుల వలె వ్యవహరించారు

## ఆత్మ విమర్శ

తొలిదశలో తన దాంపత్య జీవితాన్ని గురించి గాంధీజీ ఆత్మ విమర్శ చేసుకున్నారు. నిర్భయంగా, నిష్కర్షగా యిలా

ఆత్మసంశోధన చేసుకొన గలిగిన వ్యక్తి గాంధీజీ ఒక్కరే దీని ద్వారా ఆయన తమ స్థాయిని పెంపొందించుకున్నారు

గాంధీ దక్షిణాఫ్రికాలో తమ జీవిత విధానాన్నంతటినీ 'యూరపియన్ల' పద్ధతిలో సాగించాలనుకున్నారు అందుకు తమ కుటుంబాన్ని నిర్బంధించారు భర్తృఛాయా సదృశురాలూ, విధేయురాలూ అయిన హైందవ అర్ధాంగిగా కస్తూర్బా, పెనిమిటి అభీష్టాన్ని మన్నించ వలసివచ్చింది. అంతులేని సహనం ప్రదర్శించడం, దేనికీ కలవరపడక పోవడం, అంతరాత్మకు విరుద్ధంకాని పనిని ఆచరించడం– కస్తూర్బా యొక్క ఈ స్వభావాలు గాంధీజీలో పరివర్తన కలిగించాయి ఆయనకు సత్యాగ్రహపు ప్రాథమిక పాఠాలు బోధించాయి ఈ విషయమే తరువాత ఆయన స్వయంగా చెప్పుకున్నారు.

## కఠిన పరీక్ష

దక్షిణాఫ్రికాలో అస్పృశ్యుడైన అతిథి ఉపయోగించిన పాత్రను శుభ్రం చేయడమన్నది కఠోరమైన పరీక్ష. కాని సంస్కర్త అయిన తన భర్త ఆజ్ఞను కస్తూర్బా శిరసావహించింది. అయితే ఆ సందర్భంలో ఆమె అశ్రువులు రాల్చకుండా మాత్రం నిగ్రహం వహించలేకపోయింది. తన మాటను జవదాట నందుకు కస్తూర్బాను అభినందించవలసిందిపోయి ఆమె కన్నీరు కార్చినందుకు ఆయన ఆమెను శిక్షించారు. వీధిలోనికి గెంటివేయదలచారు కూడా. కాని ఆమె సంయమనం వహించి ఎట్టి బహిరంగ సంఘటనా జరుగకుండా నివారించింది. ఫలితంగా ఆయనకు, నిజానికి ఉభయులకు, మేలుజరిగింది.

## అపూర్వ దంపతులు

అరవై సంవత్సరాలకు పైగా సహజీవనం నెరపిన ఈ అపూర్వ దంపతుల జీవితంలో ఎప్పుడూ ఏ ఒక్కరో మాత్రమే ఆధిక్యం వహించలేదు. ఇచ్చి పుచ్చుకునే వైఖరిని వారు ప్రదర్శించారు. గాంధీజీ కూడా కొన్ని పర్యాయాలు కస్తూర్బాకు కష్టం కలిగించకుండా వుండేందుకే తానే బాధలు అనుభవించారు ఒకసారి కస్తూర్బాకు సుస్తీ చేసినప్పుడు పూర్తిగా చప్పిడి ఆహారం తీసుకొనమని ఆమెను గాంధీ కోరారు అయితే అది ఆమెకు యిష్టంలేదు. కాని గాంధీజీ అందుకు పట్టుబట్టారు. అప్పుడు ఆమె ఆవేశంతో, "మీరు ఎప్పుడైనా అలా చేస్తారా ?" అన్నది. దానికి సమాధానంగా ఆయన "ఈ రోజు నుంచే, ఈ క్షణం నుంచే నేనూ ఆ ఆహారం తీసుకుంటాను" అన్నారు.

ఇటువంటి అనుభవాలతో వారు ఆదర్శ దంపతులుగానే గాక ప్రజాసేవకులుగా, సాంఘిక కార్యకర్తలుగా, నాయకులుగా తమను తాము తీర్చిదిద్దుకున్నారు దక్షిణాఫ్రికాలో వుండగా గాంధీజీ దంపతులు బ్రహ్మచర్యం అవలంబించదలచినప్పుడు పరిస్థితులు



పరాకాష్ఠనందుకున్నవి ఈ వ్రతాన్ని ఆచరించడం ఆయనకు కష్టసాధ్యమని ఆమెకు తెలుసు. కుటుంబం పెరుగుదల దృష్ట్యానూ, హక్కులకై పోరాడడంలో ఎదుర్కొనవలసివచ్చే కఠిన పరీక్షలకు సిద్ధంకావలసిన అవసరం దృష్ట్యానూ ఆమెఅందుకు అంగీకరించింది.

వైవాహిక జీవితాన్ని గురించి ఈ రోజుల్లో ఎన్నోఅభిప్రాయాలువుంటున్నాయి. లైంగికమైన తృప్తి ముఖ్యమైన ఒకఅంశమే ననడంలో సంశయంలేదు. అయితే పవిత్రమైన దాంపత్య జీవితానికి కేవలం ఈ విధమైన సంబంధాన్ని ఆలంబన చేయడం జీవిత మాధుర్యాన్నీ, అనురాగాన్నీ, ఆత్మీయతనూ కోల్పోవడమే అవుతుంది.

విద్యా విహీనురాలు, అమాయకురాలు అయిన బాలికగా వైవాహిక జీవితపు ప్రాంగణంలోనికి అడుగు పెట్టినా, కస్తూర్బా ఆదర్శ గృహిణిగా, దేశభక్తురాలుగా గణుతికెక్కారు. భారత మహిళా లోకంలో చిరస్మరణీయురాలుగా కీర్తి పొందారు గాఢమైన పతిభక్తి, అచంచలమైన విశ్వాసం, సేవాతత్పరత కస్తూర్బాలో మూర్తీభవించిన ఈ గుణభూషణాలే ఆమె బహుకొద్ది మందిలో ఒకరుగా భాసిల్లడానికి కారణాలు. 

# అమృతమూర్తి బాపూజీ

— కందూభాయ్ దేశాయ్



గడచిన కొన్ని శతాబ్దాల కాలంలో ఉద్భవించిన మహోన్నతులైన భారతమాత పుత్రులలో మహాత్మాగాంధీ ఒకరు. దక్షిణాఫ్రికా ప్రభుత్వంమీద విజయవంతంగా సత్యాగ్రహోద్యమాలను నడిపించి భారత దేశానికి తిరిగి వచ్చిన తదాదిగా మన దేశరాజకీయ రంగంలో అద్వితీయమైన వ్యక్తిగా ప్రముఖ పాత్ర వహించారు అప్పటికి మనం అతి వినమ్రులం, శాంత స్వభావులం. అట్టితరుణంలో ఆంగ్లేయులతో సత్యాహింసలనే ఆయుధాలతో పోరాటం సాగించేందుకై గాంధీజీ మట్టిలోంచి మహావీరులను సృష్టించారు. అనేక సత్యాగ్రహోద్యమాలను నడిపి, విజయాలు సాధించి ఎట్టకేలకు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నాం ఇందుకుగాను మనకృతజ్ఞతా సూచనగా గాంధీజీని 'జాతిపితగా' పిలుచుకున్నాం. ఆయన మనప్రజలవలెనే అతి సామాన్యునిగా జీవించారు. మనతో మనకు అర్థమయ్యే భాషలోనే మాట్లాడారు. పరమోన్నతములైన ఆశయాల సాధనకే ఆయన పరిశ్రమించారు. చివరకు ఆ లక్ష్యసాధనలోనే పరమపదించారు. చీకటిలోగూడా వెలుగును చూడగల కాంతిమయ హృదయం ఆయనది.

ఆధ్యాత్మిక వాదాన్ని భౌతిక వాదంతో మేళవించి ప్రపంచానికి ఒక అపూర్వ భావసంపదను, ఆలోచనా ధోరణిని అందించిన గొప్ప తాత్వికవేత్త గాంధీజీ. ప్రపంచం యీ ధోరణిని అనుసరిస్తే ప్రపంచశాంతి మన ప్రాంగణంలోనే వచ్చినిలుస్తుంది. గాంధీజీవంటి విప్లవ వాదిని బహుశా మనం ఎప్పుడూ చూసివుండం. రాజకీయ విప్లవాన్ని మాత్రమేకాదు ఆయన తెచ్చినది, సాంఘిక విప్లవాన్ని కూడా తీసుకొచ్చారు. సమాజంలో అడుగుపొర జీవితాలను గడుపుతున్న హరిజనుల అభ్యున్నతికీ, మహిళల అభ్యుదయానికీ నిరంతరంగా పరిశ్రమించారు ఆర్థిక, ఉపాధి సమస్యల పట్ల మనకుగల దృక్పథంలో గాంధీజీ విప్లవాత్మకమైన మార్పుల్ని తీసుకొచ్చారు. మన ఆహారపు అలవాట్లనూ, వస్త్రధారణనూ మార్చివేశారు మన విద్యావిధానంలోనే ప్రాథమిక మార్పులను అనేకమైన వాటిని చేశారు. తను పలికినది అక్షరాలా ఆచరణలో పెట్టిచూపించిన అచ్చమైన కర్మయోగి ఆయన. ప్రతిఒక్కరి అభ్యుదయాన్నీ కాంక్షించే వీరి సర్వోదయ సిద్ధాంతాన్ని మించి గొప్ప సమతావాదం మరోటిలేదు. అహింసా విధానానికీ, సత్యానికీ అంకితమైపోయిన వ్యక్తి ఆయన. సత్యమే పరమాత్మ అనీ, పరమాత్మే సత్యమనీ గాంధీజీ విశ్వసించారు. పరమాత్మను కనుగొనడమే వీరి జీవనలక్ష్యం. పరమాత్మను నిజంగా మనం కనుగొనాలంటే దరిద్ర నారాయణుల సేవజేయాలి అన్నారు గాంధీజీ. హృదయమంతా ప్రేమనిండిన అమృత మూర్తి. గుండెనిండా ధైర్యాన్ని నింపుకున్న సాహసమూర్తి. పిరికితనాన్ని తనలోనుంచి తరిమివేయగలిగిన ధీరుడు. సమైక్యతలోనూ, సమానత్వంలోనూ అపారమైన విశ్వాసంగల వ్యక్తి. ఎవరిపనులను వారు చేసుకొనడంలో చిన్నతనం ఏమీ లేదు అన్నారు గాంధీజీ. కుల మత వర్గ సమైక్యతను కాంక్షించారాయన. ఆయన అపారమైన, అగణితమైన ఆలోచనా సంపదను మనకు యిచ్చిపోయారు. ఆయనను తమ కళ్ళతో చూసుకొనే భాగ్యానికి నోచుకోని మనయువతరం వారు వారి సిద్ధాంతాలనూ, ఆలోచనా మార్గాలనూ అధ్యయనం చేసి సన్నిహిత పరిచయం కలిగించుకోవడం ఎంతయినా అవసరం. మనకు ఆయన చేసిన సేవకుగాను, ఆయనకు మనం ఎంతైనా ఋణపడివున్నాం. ఆయనపట్ల మన కృతజ్ఞతలనూ, గౌరవాన్నీ, అభిమానాన్నీ తెలుపుకోవలసిన బాధ్యత మనమీద వున్నది. వారి సిద్ధాంతాలను, బోధలను అనుసరించేందుకు నేడు మనం ప్రతిన పూనుదాం.





భారతదేశానికీ, ప్రపంచానికీ గాంధీజీ ఒక నిరంతర జ్యోతి ఆ జ్యోతి లోకాలన్నింటినీ వెలిగించి కల కాలం ప్రకాశిస్తూ తరతరాల మానవాళికి మార్గదర్శకంగా నిలుస్తుంది

# ఆరిపోని అహింసాజ్యోతి

— కాసు బ్రహ్మానంద రెడ్డి

గాంధీజీ ప్రపంచ రాజకీయాలలోనే ఒక అపూర్వ వ్యక్తి "భరతావని కాక మరోదేశం, హిందూమతం కాక మరోమతం గాంధీ వంటి మహనీయుణ్ణి ప్రసాదించి వుండేవి కావు" ఆయన ఉపదేశకుడు, ప్రవక్త, మహర్షి, రాజనీతిజ్ఞుడు, కర్షకుడు, పారిశ్రామికుడు భారతదేశం దాస్యాంధకారంలో మ్రగ్గుతూ, దిక్కు తెలియనిస్థితిలో వున్నప్పుడు తన ప్రజలకు విమోచనం కలిగించడానికి గాంధీజీ పూనుకున్నారు. ఆ మహనీయుడు తన లక్ష్యాన్ని తన జీవితకాలంలోనే సాధించాడు కారణజన్ముడైన యీ అహింసా ప్రవక్త తన జీవిత లక్ష్యాన్ని సాధించుకున్న తరువాత హింసకు బలి గావడం ఒక విచిత్రం చరిత్రలో యిట్టి సంఘటనలు అనివార్యమని ఆయన హత్యోదంతం మరోసారి వెల్లడించింది.

## ప్రజల పునర్వికాసం

గాంధీజీ జీవితానికీ, భారతదేశ చరిత్రలోని గాంధీ శకానికీ మధ్య గిరిగీయడం దుర్లభం. ఇవి రెండూ అవిభాజ్యమైనవి అభేదమైనవి. ఆయన అద్వితీయమైన, అపూర్వమైన, అసమానమైన సుదీర్ఘ జాతీయ సమరంలో దేశానికి సారధ్యం వహించారు. ఆ మహోద్యమం దానికదే సాటి ఆయన కార్యకలాపాలు రాజకీయాలకు మాత్రమే పరిమితం కాలేదు. సాంఘిక, ఆర్థిక, నైతిక, సంబంధమైన సమస్యలు కూడా ఆయన దృష్టిని ఆకర్షించాయి. ఆయన సమయోచితమైన ప్రజ్ఞ ప్రదర్శించారు. ఒక గొప్ప జాతి పునర్వికాసానికై ఆయన పాటుపడ్డారు. కార్యసాధనలో కృతకృత్యులయ్యారు మన జాతీయ జీవితంలో నేటికీ ఆయన ప్రభావం కన్పిస్తుండడమే దీనికి తార్కాణం.

బానిసత్వం అనుభవిస్తున్న తనజాతి ఆశలకూ, ఆశయాలకూ నచ్చిన నాయకుడు గాంధీజీ ఆయన వారికి ఒక కొత్త ఆశ కల్పించారు; శక్తి నిచ్చారు; కొత్తగా ఆత్మ విశ్వాసం కలిగించారు. ఆయన మట్టి ముద్దలనుండి మహావ్యక్తులను సృష్టించారు. జాతి నంతటినీ సమీకరించి, ప్రపంచమంతటిలోకీ శక్తిమంతమైన పాలకులకు వ్యతిరేకంగా అహింసా మార్గంలో విప్లవం నడిపారు అనేక సందర్భాలలో దేశం రక్తపాతాలు కాకుండా తప్పించి రాజకీయ పోరాటం తన వైశిష్ట్యాన్ని కోల్పోకుండా కాపాడారు. "భారతదేశం హింసా విధానాన్ని ఆమోదిస్తే అది నాకు ఒక పరీక్ష వంటిది అహింసా మతం ద్వారా భారతదేశానికి సేవ చేయడానికే నా జీవితం అంకితమైంది," అని ఒక సందర్భంలో ఆయన ప్రకటించారు

## ఆత్మశక్తి ఆధిక్యత

దక్షిణాఫ్రికాలో ఉద్భవించి భారతదేశంలో పరిపూర్ణత పొందిన "సత్యాగ్రహ" విధానం నేటికీ గాంధీజీ ప్రసాదించిన ఒక మహాయుధం. "అహింసా వ్రతం మునులకు, ఋషులకు మాత్రమే ఉద్దేశించబడలేదు సామాన్య వ్యక్తులకు కూడా యిది వర్తిస్తుంది. అత్యున్నతమైన శాసనాన్ని శిరసావహించడంలో, అంటే ఆత్మశక్తికి తల ఒగ్గడంలోనే మానవుని ఘనత వుంది" ఈ ఆత్మశక్తియే గాంధీజీ యొక్క అద్వితీయమైన శక్తులకు ఆలంబన ఆయన దృఢ విశ్వాసాలు, నమ్మకాలనుంచి ఈ శక్తులు ఉద్భవించినవి.

## సర్వమానవప్రేమ

గాంధీజీ మతాన్ని విశ్వసిస్తారు. అంటే దేవుడంటే సత్యమనీ, సత్యమంటేనే దేవుడనీ ఆయన నమ్మకం. ఆ రెండింటి మధ్య తేడాలేదని ఆయన విశ్వాసం.

"సత్యాన్ని మించిన దేవుడు వేరే లేడు. సత్యాన్ని ముందు అందుకోగలగాలి". రాజకీయ జీవితంలోనేకాక తన నిత్యజీవితంలో కూడా సత్యాహింసల ప్రాముఖ్యాన్ని పట్టుదలగా ప్రచారంచేసేవారు. "అహింస అంటే విశ్వప్రేమ అదే పరమోత్కృష్టమైన న్యాయ శాసనం, దానిద్వారానే మానవాళి నాశనం కాకుండా రక్షింపబడుతుంది". అన్నారు గాంధీజీ. ఈ సందేశామృతాన్ని గ్రోలి జీవించినవారు శతాబ్దాల మన చరిత్రలో అనేకులు వుండవచ్చును. కాని సమాజాన్ని పునర్వ్యవస్థీకరించి వర్తమాన ప్రపంచానికి ప్రసాదించేందుకు గాను తన తోటి ప్రజలకు విశ్వమానవ ప్రేమ సందేశాన్ని భగవంతుని సందేశంగా వినిపించగల ధైర్యం, శక్తి వున్నవారు మాత్రం అరుదు. ఈ దృష్ట్యా పరిశీలించినపుడు గాంధీజీ వ్యక్తిత్వం అమోఘమైనది. ఆయన నిజంగా ప్రపంచానికే ప్రవక్త. ప్రపంచం వేదనామయమై వున్నంతవరకు ఆయన సందేశం నిత్యనూతనమై వుంటూనే వుంటుంది.

## త్రివిధ కార్యక్రమం

ఇంచుమించు ఒకేసారి ఆయన అనేక వైపుల్లో పోరాటం సాగించ వలసి వచ్చింది. ఆయన నిర్మాణాత్మక కార్యక్రమం త్రివిధములైనది. ఖాదీ కార్యక్రమంద్వారా ఆర్థికరంగానికి సంబంధించినది. అస్పృశ్యతా నివారణ కార్యక్రమం ద్వారా సాంఘికరంగానికి సంబంధించినది. మద్యపాన నిర్మూలనా కార్యక్రమంద్వారా నైతికరంగానికి సంబంధించినది. మొదటి దానిని సాధించగలిగిన తర్వాత రెండవదానికి అంకితమయ్యారు గాంధీజీ. భారతదేశంలో దారిద్ర్యం, బాధలదృష్ట్యా మద్యపానం అనేది సాంఘికంగా దుర్గుణం. అందుకే ఆయన గట్టిగా మద్యపాన నిషేధానికి పూనుకున్నారు. ఎంత తీవ్రంగా ఆయన పూనుకున్నారంటే యీనాటికీ మనం ఆయన సందేశాన్ని గౌరవంతో మన్నిస్తున్నాం.

## నేటి భారతదేశం

భారతదేశం స్వాతంత్ర్యం పొందినంత మాత్రం చేతనే గాంధీజీ కన్నకలలు నిజంకాలేదు. కేవలం రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినంత మాత్రంచేత జాతి ఆశలు, ఆశయాలూ తీరిపోవు. జాతి జీవనం తిరిగి ప్రాణం పోసుకోవడానికి రాజకీయ స్వాతంత్ర్యం విస్తృతమైన అవకాశాన్ని మాత్రమే యిస్తుంది. "దేశనిర్మాణ కృషిలో ప్రముఖ పాత్ర వహించే బీద ప్రజానీకానికి యీ దేశం తమదేనన్న భావం కలిగేవిధంగా భారతదేశాన్ని రూపొందించాలి. భారతదేశంలో ప్రజలమధ్య పైతరగతి క్రిందతరగతి అనేభేదం వుండకూడదు. అన్ని కులాలు, అన్ని మతాలు సుహృద్భావంతో మెలగాలి. ఆవిధమైన భారతదేశం ఆవిర్భవించేందుకై నేను కృషి చేయాల్సివుంది".

ఈ నాటి భారతదేశం గాంధీజీ కన్నకలలకు వాస్తవ రూప కల్పన కాదు. ఆయన లక్ష్యాలకు సన్నిహితంగా యీ దేశాన్ని పునర్నిర్మించేందుకు తప్పనిసరిగా యధోచితంగా మనమంతా కృషి చేయాలి.

## వెలలేని రత్న మాణిక్యాలు

గాంధీజీ సాహితీ ప్రపంచానికి సమర్పించిన రచనలు వాటికవే సాటి. అవి వెలలేని రత్న మాణిక్యాలు. తన వ్యక్తిత్వాన్ని అనవరతము మనసులో వుంచుకుని చరిత్రను పర్యావలోకిస్తూ ఆయన రచనలు చేశారు. సత్యాగ్రహిగా, రాజకీయవేత్తగా, బోధకుడుగా, సంస్కర్తగా, పాత్రికేయునిగా ఆయన వ్రాసిన రచనలు అసంఖ్యాకములు. అతి స్పష్టమైన, నిరాడంబరమైన రచనలు ఆయనవి. ఆయన రాజకీయ వ్యాఖ్యానాలు విపుల విషయ దర్పణాలు. అంతకన్న చక్కగా, సూటిగా, సున్నితంగా చెప్పడానికి వీలులేనంత గొప్ప రచనలవి గాంధీజీ మత విశ్వాసాలు పురాతన విజ్ఞాన వార్థిలో తడిసి, వేదభూముల పవిత్ర వాయువులను పీల్చి పునీతమై అందరి గౌరవాన్ని మన్ననమూ అందుకుంటున్నాయి. హృదయం లేని వలస సామ్రాజ్యవాదుల మీదికి ఆయన గురిపెట్టి వదలిన రాజకీయ ఉద్యమ బాణాలు చాలా కరుకైనవి, పదునైనవి. వర్తమాన రాజకీయ సిద్ధాంతావిర్భావానికి గాంధీజీ రచనలు దర్పణాలై నిలిచి, వర్తమాన భారతీయ సాహిత్యంలో సముచిత గౌరవాన్ని అందుకుంటాయి.

నిజమైన సత్యాగ్రహి తను నమ్మిన సిద్ధాంతాలకై ప్రాణత్యాగానికి కూడా వెనుదీయడు జీవించినప్పుడూ, మరణ సమయంలో కూడా గాంధీజీ అచ్చమైన సత్యాగ్రాహిగానే నిరూపించుకున్నారు. కాలవలయాన్ని ఛేదించుకుని భవిష్యద్దర్శనం చేయగల మహా మహూ అందరికోసం ఆయనే శిక్ష అనుభవించారు. భారతదేశానికీ, ప్రపంచానికీ గాంధీజీ ఒక నిరంతర జ్యోతి. ఆ జ్యోతి లోకాలనన్నిటినీ వెలిగించి కల కాలం ప్రకాశిస్తూ తర తరాల మానవాళికి మార్గదర్శకంగా నిలుస్తుంది.



# నీరాజనం

స్వతంత్ర మానవులు వున్నంతకాలమూ; స్వతంత్రాన్నీ, న్యాయాన్నీ, ధర్మాన్నీ ప్రేమించేవారు వున్నంతకాలమూ మహాత్మా గాంధీ పేరు స్మరించబడుతుంది. మానవజాతిలో, మహాత్మా గాంధీవంటి మహా పురుషులు చాలా అరుదుగా జన్మిస్తారు. ఇటువంటి వారికి భావి సంతతివారుకూడా ఋణ పడి వుంటారు. గాంధీ ఒక్క భారతదేశ సేవేకాదు, ప్రపంచ సేవకూడా చేశారు. ఆయన భారతదేశానికి గర్వకారణం.

'మానవాళి సేవకై సర్వస్వాన్నీ త్యజించడానికి, ప్రాణ త్యాగానికికూడా సిద్ధమైన మానవుడే పరిపూర్ణమైన ప్రేమను ప్రదర్శించగలుగుతాడు' అన్న సిద్ధాంతం ఆచరణకు అంకితు డయ్యా డాయన.

మానవోత్తములకు మరణం వుండదు. వారి సేవలు సజీవంగా వుంటాయి. మహాత్మాగాంధీ ఈనాడు మన మధ్యన లేకపోయినప్పటికీ ఆయన సేవలు మనందరికీ చిరస్మరణీయాలు.

—హెయిలీ సెలాసీ
ఇథోపియా చక్రవర్తి

అన్ని మతాల బోధలలో అంతర్లీనంగావుండే అహింసా తత్త్వాన్ని చాటిన మేటి ప్రవక్తగా గాంధీజీ కొనియాడబడడం సముచితమైన విషయం. నే నవలంబించే బౌద్ధమతంలో అహింసాతత్వం ఒక భాగం. స్వదేశ జీవిత కాలపరిధుల నధిగమించి అన్ని ప్రాంతాలలోనూ, అన్ని వేళలలోనూ ఆరాధ్యమైనదిగా గాంధీ తత్వం నాకు కనుపిస్తుంది. ఆయన సిద్ధాంతాలు విశ్వజనీనాలు, సర్వకాలానుచరణీయాలు. వాటికి దేశ కాల పాత్రాలు లేవు. శాంతిమార్గంలో మార్పు తీసుకొని వచ్చేందుకు అహింసా రూపకమైన ఒత్తిడి సత్ఫలితాలిస్తుందన్నే ఆయన నమ్మకం. ఆయన జీవిత కాలంలో మాదిరే ఈరోజుల్లో కూడా ప్రపంచంలో సత్యసిద్ధమని వర్తమానం చాటుతుంది.

—ఊథాంట్

అహింసా సిద్ధాంతానికి అంటిపెట్టుకొని, దాని ద్వారానే లక్ష్యసిద్ధి సాధించాలన్న గాంధీజీ నమ్మకమే యిరు వర్గాల అంగీకారంతో భారత దేశానికి స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టింది. ఇందులో ఎవ్వరికీ గెలుపోటముల ప్రసక్తి లేదు. బ్రిటన్‌కూడా సంతోషంగా పరిష్కారానికి అంగీకరించి, కామన్ వెల్తు దేశాల కృషిలో నూతన భాగస్వామిగా భారతదేశానికి స్వాగతం పల్కింది.

—హెరాల్డు విల్సన్

ప్రపంచాభిప్రాయాన్నే తమ బుద్ధి బలంతో మార్చగల అరుదైన ప్రతిభా సంపన్నుల కోవకు చెందినవారు గాంధీజీ. ఆయన సాధించిన విజయాలపట్ల, దుర్భేద్య మేధాసత్వ సంపన్న మైన ఆయన నడవడికపట్ల గౌరవభావాన్ని ప్రకటించడం ద్వారా నాగరకలోకం తన్ను తాను గౌరవించుకొంటుంది. మానవాళి హృదయ తంత్రులను రమణీయంగా మీటి, జీవిత కాలంలోనే వారిలో ప్రగాఢ చైతన్యాన్ని కలిగించగల గాంధీజీ శక్తి, ఏ కొద్దిమందికో వుంటుంది. తమ జీవిత కాలానంతరంకూడా గాంధీజీవలె మానవులను ప్రభావితం చేయగల అపూర్వశక్తి యింకా బహుకొద్దిమందికే వుంటుంది. హింసాపూరిత ప్రపంచానికి ఆయన, అహింసా తత్వాన్ని చాటారు. సాంకేతిక పరిజ్ఞానంతో ఐహిక ఫలసిద్ధికి ప్రాకు లాడే ప్రజానీకానికి ధైర్యంగా ఆధ్యాత్మిక శక్తి ప్రభావాన్ని ప్రబోధించారు. రాజకీయ కుతంత్రాలతోను, ప్రాపంచిక సూక్ష్మగ్రాహ్యతతోనూ పోటీలు పడుతున్న రాజకీయ నాయ కుల మధ్య అతి సామాన్యుడుగా నిరాడంబర జీవితాన్ని, నీతి నిజాయితీల విలువలను ధైర్యంగా ప్రకటించకలిగారు.

—వలేరియన్ కార్డినల్ గ్రేషియస్

గాంధీజీ దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు 'ఇండియన్ ఒపీనియన్'కు సంపాదకత్వం వహించారు. భారత దేశంలో 'యంగ్ ఇండియా' 'హరిజన్' పత్రికలు ఆయన సంపాద కత్వంలో వెలువడ్డాయి. కాబట్టి గాంధీజీని దేశంలోని గొప్ప జర్నలిస్టుల సరసన చేర్చడానికి ఆయనకు అర్హతవుంది. ఆయన కేవలం సంపాదకుడు మాత్రమేకాదు. ఈ వార పత్రికలకు ముఖ్య రచయిత ఆయన. 'యంగ్ ఇండియా' 'హరిజన్' పత్రికలు తరచు పూర్తిగా ఆయన రచనలతోనే వెలువడు తుండేవి.

గాంధీజీ ప్రామాణికమైన రచనలు చేస్తుండేవారు. దక్షిణాఫ్రికాలోనూ భారతదేశంలోనూ అవి విప్లవాత్మకమైన ప్రభావం వేశాయి. ఆయన పదాలను పొదుపుగా తూచి తూచి వాడుతుండేవారు. ఆయనశైలి సరళమైనది. ఆయన వ్రాసిన దాదాపు ప్రతి పదానికీ ఆయన ఆలోచన, ఉద్వేగం ఆలంబనగా వుండేది.

గాంధీజీకి, ఆర్థిక రంగంలోవలెనే జర్నలిజం మీదకూడా విప్లవాత్మకమైన అభిప్రాయాలు, అదేసమయంలో తద్భిన్నమైన అభిప్రాయాలు సైతం వుండేవి. ఆధునిక జర్నలిజాన్ని ఆయన అభిమానించలేదు. వార్తా పత్రికలను, మేగజైన్లను ప్రకటనలపై ఆధారపడి నడపడాన్ని ఆయన వ్యతిరేకించారు.

జర్నలిజాన్ని ఒక వృత్తిగా చేపట్టడాన్ని కూడా గాంధీజీ వ్యతిరేకించారు. "వార్తా పత్రికను జీవనం సాగించడానికి ఒక ఆధారంగా" ఉపయోగించుకోవడం మంచిదికాదు. ప్రజా సంక్షేమానికి ఉద్దేశించబడిన వాటిని జీవనోపాధి కొరకు వినియోగించుకోవడంవల్ల వాటి లక్ష్యమే దెబ్బతింటుంది. వార్తా పత్రికలను లాభాలు గడించడానికి సాధనగా పరిగణించి నప్పుడు తీవ్ర దుష్ప్రవర్తనలకు దారితీసే అవకాశం వుంటుంది. ఇది భారీఎత్తున జరుగుతున్నదని, జర్నలిజంలో అనుభవం వున్న వారికి నిరూపించనవసరం లేదు—అని గాంధీజీ వ్రాశారు.

—కె. సంతానం



1916 సం లో గాంధీజీ నెల్లూరులో జరిగిన మద్రాసు రాష్ట్రీయ రాజకీయ మహాసభలో పాల్గొనడానికి విచ్చేసినప్పటి చిత్రం

కూర్చున్నవారు (ఎడమనుంచి) రైట్ ఆనరబుల్ వి. ఎస్. శ్రీనివాస శాస్త్రి, బాపూజీ, శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి, శ్రీ ఎస్ శ్రీనివాసయ్యంగార్
(నిల్చున్నవారు) శ్రీ సి వెంకటరంగం నాయుడు, శ్రీ జి. ఎ. నటేశం, శ్రీ కె. ఎ. వీరరాఘవాచార్యులు

# గాంధీమహాత్ముని ప్రేమను చూరగొన్న

# కొందరు ఆంధ్ర ప్రముఖులు

— కోదాటి నారాయణరావు

గాంధీజీ, మహాత్ముడు కాకపూర్వమే, భారత రాజకీయరంగంలో అడుగు పెట్టక పూర్వమే ఆయన సాహచర్య భాగ్యం ఆంధ్రులకు లభించింది దక్షిణాఫ్రికాలో ఆయనతో కలసి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నవారిలో అనేక మంది ఆంధ్రులున్నారు. అయితే వారంతా ఒక దాక్షిణాత్యులుగానే పరిగణింపబడ్డారు కనుక వారు గాంధీగారి ఆత్మకథలో ఆంధ్రులుగా పేర్కొనబడలేదు. కాని మహాత్ముడు తాను తమిళంతో బాటు తెలుగు కూడ దక్షిణాఫ్రికాలో నేర్చుకున్నానని చెప్పాడు ఈ మధ్య సుమారు నాలుగు సంవత్సరాల క్రిందట రైలులో ప్రయాణం చేస్తుంటే తూర్పుగోదావరి జిల్లా కోరుకొండ వాస్తవ్యులొకాయన కాకతాళీయంగా కలిశారు. గాంధీజీతో దక్షిణాఫ్రికాలో కలిసి పనిచేసిన వారిలో ఆయన ఒకరట. అప్పటి అనుభవాలలో కొన్ని ఆయన చెప్పారు. దక్షిణాఫ్రికాలో గాంధీ గారున్న 19 వ శతాబ్దం చివర భాగం నుండి 1918 జనవరి 30 వ తేదీ వరకు గాంధీజీకి

ఆంధ్రులతో ఎడతెగని సంబంధం వుంది. ఆయన ప్రేమకు, ఆదరాభిమానాలకు పాత్రులైన కొందరు ఆంధ్రప్రముఖులను స్థాలీ పులాకంగా యీ నాడు మనం స్మరిద్దాం

దక్షిణాఫ్రికా నుండి భారత దేశానికి వచ్చిన తరువాత గాంధీజీకి పరిచయమై, సన్నిహితుడై, ఆయన ప్రేమను ఎంతగానో చూరగొన్న మొదటి ఆంధ్రప్రముఖుడు స్వర్గీయ దిగుమర్తి హనుమంతరావుగారు గాంధీజీకి ఆయన యెడలగల ఆదరాభిమానాలు అపారమైనవి హనుమంతరావుగారి అకాలమరణానికి సంతాపాన్ని తెల్పుతూ He was a Man among the men. అని ఆయన ప్రశంసించారు. గాంధీజీ సబర్మతీ సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించిన తర్వాత హనుమంతరావుగారు నెల్లూరు జిల్లాలో పినాకినీ సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించారు. సబర్మతి తరువాత భారతదేశంలో గాంధేయ పద్ధతుల్లో స్థాపించిన మొదటి ఆశ్రమం పినాకినియే కావచ్చనుకుంటాను. యీ ఆశ్రమంలో హనుమంతరావుగారు గాంధీజీ సూచించిన ఆశ్రమదీక్షలన్నిటిని తూ.చా తప్పకుండా ఆచరించి సత్యాన్వేషణ సాధనాన్ని ఆరంభించారు. సబర్మతి ఆశ్రమంకంటె కూడ పినాకిని ఆశ్రమంలో నియమపాలన కఠినతరంగా వుండేదంటారు హనుమంతరావుగారి అకాల మరణానికి ఆయన కఠోర దీక్షయే కారణమని కొందరు చెప్తారు. దిగుమర్తి హనుమంతరావుగారు జీవించి వుంటే గాంధీగారికి అత్యంత అంతరంగికులైన భారత ప్రముఖులలో ఒకరై వుండే వారనటంలో సందేహం లేదు. హనుమంతరావుగారి జీవిత విశేషాలుగాని, పినాకినీ సత్యాగ్రహాశ్రమ చరిత్రగాని యీనాడు సమగ్రంగా లభించటం లేదు హనుమంతరావుగారి ధర్మపత్ని శ్రీమతి బుచ్చి కృష్ణమ్మగారు, సోదరులు రామస్వామిగారు మొదలైన వారి సహకారంతో, హనుమంతరావుగారి జీవితచరిత్రను తయారు చేయించి ఆంధ్రులకు ఆయనను గూర్చి తెలియపర్చడం చాల ముఖ్యం అనుకుంటాను

గాంధీమహాత్ముని ప్రశంసలను ఎక్కువగా చూరగొన్న వారిలో ముఖ్యులు స్వర్గీయ కోపల్లె హనుమంతరావుగారు గాంధీ యుగానికి పూర్వమే వందేమాతరం ఉద్యమం నుండి స్ఫూర్తిని పొంది ఆంధ్ర జాతీయ కళాశాలను స్థాపించారు స్వర్గీయ హనుమంతరావుగారు. ఆయన జీవితకాలంలో యీ విద్యాలయం ఎంతోకట్టు బాటుగాను, ఆదర్శ ప్రాయంగాను నడిచింది. గాంధీగారికి యీ కళాశాలంటే చాలప్రీతి. హనుమంతరావు గారంటే ఎంతో గౌరవం. 1929 లో ఆంధ్రదేశ పర్యటన చేస్తూ బందరు వచ్చినపుడు యీ విషయాన్ని గాంధీగారు ప్రస్తావించారు. ఆంధ్ర జాతీయ కళాశాల స్థాపనకు, శ్రీ హనుమంతరావుగారు ఎంతో శ్రమపడి ఆర్థికంగా యితరులపై ఆధారపడవలసిన అవసరం లేకుండా వనరులను సమకూర్చారు ఎంతోదూరం ఆలోచించి విద్యార్థులలో గల వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసేలా వారు పథక రచన చేసారు ఆయన తరువాత దురదృష్ట వశాత్తు ఆ కళాశాల చరిత్ర, అనుకున్న రీతిగా నడవలేదు ఆంధ్ర జాతీయ కళాశాల హనుమంతరావు గారి జీవితచరిత్ర ఆంధ్రులకులభిస్తే యువతరానికి ఎంతో స్ఫూర్తిని కలిగించగలదు.

గాంధీమహాత్ముని కత్యంత గౌరవ విశ్వాస పాత్రులైన ఆంధ్రులలో శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య గారగ్రగణ్యులు. వెంకటప్పయ్య గారికి గాంధీగారంటే అపరిమితమైన భక్తి గాంధీగారికి వెంకటప్పయ్య గారంటే అపరిమితమైన గౌరవం, విశ్వాసం కూడాను వెంకటప్పయ్యగారి మాట గాంధీగారికి పరమ ప్రామాణికం. ఆయన సహన శీలమూ, ఋజువర్తనా, ఋషిజీవితంతో పాటు ఆయన వయోవృద్ధత్వం కూడ గాంధీగారి గౌరవానికి ఒక కారణమని చెప్పవచ్చు. వెంకటప్పయ్యగారు గాంధీగారికన్నా వయస్సులో కొద్దిగా పెద్దవారు అందుకని వెంకటప్పయ్యగారి పట్ల గాంధీగారు వినమ్రతతో వ్యవహరించేవారు వెంకటప్పయ్యగారు గాంధీగారి ఆజ్ఞను, రామాజ్ఞను హనుమంతుడు పాలించినట్లు పాలించేవారు. గాంధీగారు సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించక పూర్వమే గుంటూరు జిల్లాలో పెద్దఎత్తున ఎంతో విజయవంతంగా మూడు శాసనోల్లంఘనోద్యమాలు జరిగినవి. మొదటిది ఆంధ్ర రత్న శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు నిర్వహించిన చీరాల-పేరాల మున్సిపాలిటీ బహిష్కరణోద్యమం. ఈ వుద్యమంలో చీరాల ప్రజలు మున్సిపాలిటీ నిర్మాణానికి ప్రతికూలంగా తాము కట్టుకున్న యిళ్ళను, వాకిళ్ళను వదిలివేసి ఊరి వెలుపల పూరి పాకలలో అనేక కడగండ్లతో సంవత్సరంపాటు కాపురం చేశారంటే ఆ ఉద్యమం బలీయత మనకు తేటతెల్లమౌతుంది. రెండవ వుద్యమం పెదనందిపాడు ఫిర్కాలో పన్నుల నిరాకరణోద్యమం దీనిని శ్రీ పర్వతనేని వీరయ్య చౌదరిగారు ఎంతో ప్రముఖపాత్ర వహించి నిర్వహించారు. ఆ గ్రామంలో రైతులు ఐకమత్యంతో సహాయ నిరాకరణను, తూ చా తప్పకుండా అనుసరించారు. ఆనాటి కలెక్టరు రూథర్‌ఫర్డ్‌కు, గ్రామాలకు త్రోవ చూపించుటకు పశువుల కాపరికూడ నిరాకరించాడు ప్రభుత్వం ఆ గ్రామాలలో పూర్తిగా స్తంభించి పోయింది ఎన్ని బాధలు పడినా ఒక్క దౌర్జన్య కాండకూడా యీ ఫిర్కాలో జరుగకుండా యీ ఫిర్కా ప్రజలు ఉద్యమాన్ని నడుపుకున్నారు ఇక మూడవ వుద్యమం పలనాటి పుల్లరి శాసనోల్లంఘన. ఈ యుద్యమ నాయకత్వాన్ని స్వర్గీయులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ నరసింహాచార్యులుగారు చేపట్టి కట్టుదిట్టంగా జరిపారు ఈ ఉద్యమంలోనే "హనుమంతు" వీరస్వర్గాన్ని అలంకరించాడు ఇంత హింసాకాండ జరిగినా ప్రజలు రెచ్చిపోకుండా ఉద్యమాన్ని నిర్వహించారు. ఈ వుద్యమాలన్నిటికి వెంకటప్పయ్య గారిదే నాయకత్వం. గాంధీమహాత్ముని వద్దనుండి ఆపవలసిందిగా వుత్తర్వు రాగానే ముమ్మరంగా సాగుతున్న ఉద్యమాలను కూడా వెంకటప్పయ్యగారు ఆపివేశారు. ఆయన క్రమశిక్షణకిది గీటురాయి

గాంధీమహాత్ముని ధర్మకర్తృత్వ సిద్ధాంతానికి నిదర్శనంగా కనుపించిన వ్యక్తి దేశోద్ధారక నాగేశ్వరరావుగారు. ఆయన నిష్కామమైన దాతృత్వాన్ని గాంధీమహాత్ముడు ఎంతో ప్రశంసించారు. ఎవరికి బిరుదులు యివ్వని గాంధీజీ ఆయనకు విశ్వదాత అనీ బిరుదాన్ని ప్రసాదించాడు యీ బిరుదం గాంధీగారు తేలికగా యిచ్చింది కాదు, పైగా ఆయనను గురించి, ఆయన అమృతాంజనం వ్యాపారం గురించీ చాడీలు పితూరీలు గాంధీగారి వద్దకు

వచ్చాయి. గాంధీజీకూడా నాగేశ్వరరావుగారిని అనుమానించారు గాబోలు. అయినా సత్యాన్వేషి కాబట్టి సూటిగా నాగేశ్వరరావు గారిని అడిగారు. ఉన్నవిషయం నాగేశ్వరరావుగారు చెప్పారు. దానిని ఆయన అతిసూక్ష్మంగా పరిశీలించారు. ఆతర్వాతగాని నాగేశ్వర రావుగారిని ప్రశంసిస్తూ "విశ్వదాత" అని అనలేదు. ఆంధ్రులందరికి నిర్వివాదమైన వ్యక్తి నాగేశ్వరరావు గారొక్కరే కావటం గాంధీగారి ఆదరాభిమానాలకు మూలకారణం కావచ్చు. ఆంధ్రుల అనైక్యత, బహునాయకత్వం, గాంధీగారి మనస్సును చివరివరకు కలత పెట్టేవట.

బాపూజీ ప్రేమను చూరగొన్న ఆంధ్రయువతి స్వర్గీయ మాగంటి అన్నపూర్ణాదేవి. ఆమె పాశ్చాత్య దేశాలకు వెళ్ళి చదువు కొనవలెనను వుద్దేశ్యంతో స్వర్గీయ శ్రీమతి సరోజినీనాయుడుతో కొంతకాలముండి పాశ్చాత్య ఆచారాలను గురించి నేర్చుకున్నది. అటువంటి సమయంలో గాంధీమహాత్ముని శంఖారావం విని అవన్నీ మానుకొని దేశసేవలో మునిగి పోయింది. ప్రథమ దశలోనే ఆమె తనకుగల యావత్తునగలను గాంధీగారికి నిలువుదోపిడీ యిచ్చింది. అమూల్యమైన తన దుస్తులను అన్నిటిని కాల్చివేసి ఖద్దరు ధారణ ఆరంభించింది. అంతేకాక అమెరికాలో చదువు ముగించుకొని యింటికి వస్తున్న తన భర్త బాపినీడు గారికి స్వాగతం యివ్వడానికి బొంబాయికి వెళ్ళి ఆయనకు ఖద్దరు వస్త్రాలను యిచ్చి ఆయనను కట్టుకోమని చెప్పి, ఆయన వద్దనున్న విదేశ వస్త్రాలను సముద్రంలో పారవేయించింది. త్యాగమూర్తియైన శ్రీమతి అన్నపూర్ణాదేవి యీ విధంగా గాంధీమహాత్మునికి పుత్రిక అయ్యింది. ఆమె అకాల మరణానికి గాంధీజీ పుత్రికా వియోగ అనుభూతిని పొందారట. ఆమె త్యాగశీలతకు ఆంధ్రులు గర్వించాలి.

డా॥ పట్టాభి సీతారామయ్యగారికీ, గాంధీమహాత్మునికీగల సాన్నిహిత్యం అందరికి తెలిసిందే. గాంధీమహాత్ముని మెప్పు పొందడం చాలకష్టం. అట్టి మహాత్ముడే పట్టాభిగార్ని తనకు భాష్యకారుడని పేర్కొన్నారు. పట్టాభిగారి మేధాసంపద, ప్రణాళికా నిర్మాణంతోపాటు ఆయన నిరాడంబర జీవనం, మిత వ్యయ పద్ధతి, వసూలుచేసే నిధులకు సరిగా లెక్కలుంచుట గాంధీగారి కెంతో తృప్తినిచ్చేవి. పట్టాభిగారికి అహింస పట్లగల అచంచల విశ్వాసం మహాత్మునికి బాగాతెలుసు. 1938వ సం॥లో సుభాస్ చంద్రబోస్‌తో కాంగ్రెస్ అధ్యక్షపదవికి పట్టాభిగారు పోటీచేసి ఓడిపోయినపుడు ఆ ఓటమి తన ఓటమి అని గాంధీమహాత్ముడు వెల్లడించడం జగద్విదితం.

గాంధీమహాత్ముని అభిమానాన్ని చూరగొన్న ఆంధ్రులలో డా॥ బ్రహ్మజ్యోస్యుల సుబ్రహ్మణ్యంగారు ప్రముఖులు. డా॥ సుబ్రహ్మణ్యంగారు తన వైద్య వృత్తిని, పట్టణవాసాన్ని వదలి తన అనుచరులతో శీతానగరంవంటి పల్లెటూరులో సత్యాగ్రహాశ్రమాన్ని స్థాపించి గ్రామాలకెంతో సేవచేశారు. జాతీయ రాజకీయాలకు శీతానగర సత్యాగ్రహాశ్రమం తూర్పుగోదావరిజిల్లా ముఖ్య కేంద్రంగా వుండేది. ఆశ్రమంలో ప్రకటిస్తూవుండిన కాంగ్రెస్ అనే వారపత్రిక ఆంధ్రదేశంలో ఎంతో ప్రబోధాన్ని కలిగించింది. సుబ్రహ్మణ్యంగారు, వారి అనుచరులు కలిసికట్టుగా చేసిన సేవ. వారి జీవితవిధానం గాంధీగారికి ఎంతో ముచ్చట గొల్పినవి. ఆంధ్రదేశ సంచారంలో శీతానగర ఆశ్రమంలో మాత్రమే ఆయన రెండురోజులు విశ్రాంతి తీసుకున్నారు.

నిర్మాణ కార్యక్రమంద్వారా గాంధీగారి అంతర్యాన్ని చూరగొన్న మహనీయుడు స్వామి శీతారాం. పూర్వాశ్రమంలో గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు. శాస్త్రిగారంటే గాంధీగారికి ఎంతో అభిమానం. ఆయన త్యాగధనులైన ఆంధ్ర మహాపురుషులలో ఒకరు. ఇల్లును, భార్యాపిల్లలను, సర్వస్వాన్ని త్యాగంచేసి కీర్తిప్రతిష్ఠ, కాశించక స్వాతంత్ర్యోద్యమాన్ని గుంటూరు జిల్లాలో వ్యాప్తిచేశారు. ఉప్పు సత్యాగ్రహ సమరంలో స్వరాజ్యమైదానంలో ఆయన చేసిన ఉపన్యాసం యీనాటికీ విన్నవారు స్మరించుకుంటారు. అది సింహనాదమని చెప్పవచ్చు. గుంటూరు జిల్లాలోని యువ ప్రపంచం ఆ సింహనాదానికి కదలివచ్చి ఉద్యమాగ్నిలో దుమికి ఆహూతి అయ్యారు. ఆందోళన రంగంలో నిర్వహించిన పాత్రకు ఎన్నోరెట్ల శ్రద్ధ నిర్మాణ కార్యక్రమంపట్ల వహించారు. శాస్త్రిగారి నిర్మాణ కార్యదీక్షయే గాంధీమహాత్ముని ప్రేమాభిమానాల కాలవాలం అయ్యింది.

గాంధీమహాత్ముని సన్నిహితులైనవారిలో స్వర్గీయ చక్రయ్య ఒకరు. ఈయన పశ్చిమ గోదావరి జిల్లాకు చెందిన హరిజన యువకుడు. శ్రీ తల్లాప్రగడ నరసింహ శర్మగారిద్వారా యీయన గాంధీగారి ఆశ్రమానికి చేరుకున్నారు. ఈయన సుగుణ సంపత్తి గాంధీగారినెంతో ఆకర్షించింది. శ్రీ చక్రయ్య చాలా కొద్దివయస్సులోనే అకాలమృత్యువు వాతపడ్డారు. చక్రయ్య బ్రతికి వుంటే స్వతంత్ర భారత ప్రథమాధ్యక్షుణ్ణి చేసేవాణ్ణని గాంధీగారు తన సంతాపాన్ని వెల్లడిస్తూ వ్రాశారు. అట్టి చక్రయ్యగారి మరణం ఆంధ్రులందరికి తీరనినష్టం అని చెప్పవచ్చు.

గాంధీజీకి సన్నిహితులుగావుండి ఆయన ప్రేమను చూరగొన్న మరొక ఆంధ్రుడు శ్రీ ప్రభాకర్‌గారు. ఈయన అనంతపురం జిల్లాలోని ఒక పేద హరిజన కుటుంబంలోపుట్టారు. ఆంధ్రజాతీయ కళాశాల విద్యార్థిగా వుండి గాంధీమహాత్ముని సన్నిధికి చేరారు. పురుషాంతరానికి పైగా గాంధీజీ సేవాభాగ్యం లభించింది. ఈయన యీనాటికి ఆయురారోగ్యాలతో సర్వోదయ నాయకులుగా ప్రజాసేవ చేస్తున్నారు.

గాంధీమహాత్ముని ప్రేమకు పాత్రులైన కొందరు ఆంధ్రప్రముఖులను స్థాలీపులాకంగా పేర్కొన్నాను. ఇంకా అనేకులు ఆయన ప్రేమకు పాత్రులై ఉండవచ్చు. వారికి సంబంధించిన భోగట్టాను సేకరించవలసిన అవసరం వుంది. అట్లే ఆశ్రమాలు జాతీయ విద్యాలయాలు మొదలయిన వివిధ సంస్థల చరిత్రలనుకూడా సేకరించడం అవసరం. గాంధీజీ మనసును కదలించివైచిన సన్నివేశాలుకూడా అనేకం ఆంధ్రదేశంలో జరిగాయి. వాటన్నిటిని సేకరించడం ఎంతో అవసరం. గాంధీయుగంలోని ఆంధ్రదేశ చరిత్రను చక్కగా పరిశోధించి భావి తరాలవారికి అందించటం ప్రభుత్వానికీ, ప్రజాసేవకులకూ, విశ్వవిద్యాలయాలకూ కనీసధర్మం.



1933 లో గాంధీజీ ఆంధ్రలో పర్యటిస్తూ హిందూపురం విచ్చేసి నప్పటి చిత్రం

# మన రాష్ట్రంలో గాంధీజీ పర్యటన

మహాత్మాగాంధీ ఆంధ్ర రాష్ట్రాన్ని మొట్టమొదటిసారిగా 1915 వ సంవత్సరంలో సందర్శించారు. ఆ సంవత్సరం మద్రాసు ప్రొవెన్షియల్ కాన్ఫరెన్సు నెల్లూరులో జరుగగా దానికి ఆయన హాజరయ్యారు

తరువాత 1919 వ సంవత్సరంలో బాపూజీ విజయవాడను సందర్శించారు. అనిబెసెంటు కోర్కెపై రాష్ట్రంలో గ్రంథాలయోద్యమాన్ని తిలకించే నిమిత్తం ఆయన అక్కడికి వచ్చారు.

1921 వ సంవత్సరంలో మార్చి చివరి నుంచి ఏప్రిల్ 8 వ తేదీ వరకు రాజమండ్రి, విజయవాడ, అనకాపల్లి, పెద్దాపురం, కాకినాడ, బందరు, కౌతరం, నెల్లూరు, చీరాల మొదలైన ప్రదేశాలలో గాంధీజీ పర్యటించారు.

1929 వ సంవత్సరంలో గాంధీజీ ఏప్రిల్ 8 వ తేదీ నుంచి మే 16 వ తేదీ వరకు రాష్ట్రంలో విస్తృతంగా ఖాదీ పర్యటన జరిపారు. ఆ సందర్భంలో ఆయన హైదరాబాదు, బొమ్మకల్లు, జయంతిపురం, జగ్గయ్యపేట, నందిగామ, విజయవాడ, గుంటూరు, ఆరుగొలను, పటమట, బందరు, పెదనందిపాడు, భట్టిప్రోలు మొదలైన ప్రదేశాలను సందర్శించారు. తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలలోకూడా ఆయన పర్యటించారు.



మహాత్మాగాంధి 1946 లో వరంగల్లుకు విచ్చేసినప్పటి చిత్రం

గాంధీజీ 1933 వ సంవత్సరంలో రాష్ట్రంలో హరిజన పర్యటన జరిపారు. ఆ సంవత్సరం డిశంబరు 16 వ తేదీన ప్రారంభమైన ఈ పర్యటన 1934 జనవరి 2 వ తేదీన ముగిసింది. అప్పుడాయన కృష్ణా, గుంటూరు, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, నెల్లూరు, విశాఖపట్నం, చిత్తూరు, అనంతపురం కడప జిల్లాలలో పర్యటించారు.

మహాత్ముడు 1946 వ సంవత్సరంలో రాష్ట్రంలో హిందీ పర్యటన జరిపారు. ఇదే, రాష్ట్రంలో ఆయన కడసారి పర్యటన. ఈ పర్యటన జనవరి 20 వ తేదీన ప్రారంభమైంది. అప్పుడు నెల్లిమర్ల, విశాఖపట్నం, నెల్లూరు, విజయవాడలలోనూ, ఉభయ గోదావరి జిల్లాలలోనూ తెలంగాణా ప్రాంతంలోనూ పర్యటించారు.

## సాధనాల పవిత్రత

గత యాభై సంవత్సరాలకుపైగా నేను ఫలితాన్ని ఆశించకుండా ధర్మాన్ని ఆచరించడం అలవరచుకున్నాను. సాధనాలను గూర్చి వాటి పవిత్రతనుగూర్చి మాత్రమే ఆలోచించేవాడిని. పవిత్రమైనదనే విశ్వాసమే నన్ను ముందుకు నడుపుతుంది. ఆ విశ్వాసం ముందు. భయసందేహాలన్నీ పటాపంచలయ్యేవి.

మనం కేవలం నిమిత్తమాత్రులం. భగవంతుని యిష్టానుసారం ప్రవర్తించవలసినవారం. అందువల మనకు యెప్పుడు, ఏది ముందుకు వెళ్ళడానికి ఊతం యిస్తుందో, ఏది అడ్డు తగుల్తుందో తెలియదు. సాధనాలనుగూర్చిన విజ్ఞానంతో, మనం సంతృప్తిపడాలి. మన సాధనాలు పవిత్రమయినవయితే లక్ష్యాన్ని గూర్చి భయపడవలసిన పనిలేదు.

— గాంధీజీ

# గాంధీ తత్వం

దశిక సూర్యప్రకాశరావు



"నేను అవతార పురుషుడనుకాను. మహాత్ముడను కాను, ఆచార్యుడనుకాను. సామాన్య మానవుడను, దోషపూరితుడను. అల్పుడను." అని గాంధీజీ తమ జీవితకాలములో వేయి పర్యాయములు చెప్పియున్నారు. అయితే గాంధీజీ ఎవరు? వారి మహత్త్వమెందున్నది? లోకమంతయు వారిని గౌరవించుటకు గల హేతువేమి? మూర్ధాభిషిక్తులగు రాజన్యులందరు వారికి పాదాక్రాంతులగుటకు గల కారణమేమి? భారతదేశములోగల దిగ్గజముల వంటి ప్రతిభావంతులకు ఆయన శిరోమాణిక్యమయి వెలుగొందుటకు గల సత్తాయెట్టిది? ఆయన పండితులా? కోటీశ్వరులా? ఋషీశ్వరులా? రాజకీయ విశారదులా? అర్థికవేత్తలా? నిగమాగమ పురాణ విద్వాంసులా? సన్యాసాశ్రమ స్వీకారవరిష్ఠులగు జగద్గురువులా? ఆయన వీరిలో ఎవ్వరును కారు. "నేను దోషపూరితుడగు సామాన్య మానవుడ"నని పరమ సత్యమునే వచించియున్నారు. అయితే తమ ఉత్తమ సాధనచేత ఆయన గౌరవ గౌరీశంకర శిఖరము నధిష్ఠించియుండిరి. నేటికిని వారి పలుకు వేదవాక్కుగా, వారి నడక మేటిదీపముగా స్వీకరించు ఏకలవ్య శిష్యులు లోకమందంతటను గలరు. ముఖ్యముగా భారతదేశములో.

మహాత్మాజీ ఎందరెందఱను ఎట్లు ఆకర్షించియుండిరో ఒక్క ఉదాహరణము చెప్పెదను. అది 1930వ సంవత్సరము. లండను నగరములో జరుగుచున్న రౌండ్ టేబుల్ సమావేశమునకు గాంధీజీ హాజరయిరి. వారు కార్మికుల నివాసముల మధ్య బస యేర్పాటు చేసికొనిరి. అనుదినము ఉదయ సాయం సంధ్యల యందు ధారాపాతముగా వర్షము కురియుచున్నను, మంచుగడ్డలు విఱిగిపడుచున్నను వారు నిత్య ప్రార్థన జరుపుకొనుచునేయుండిరి.

ఆ తీరుననే ఒక దినమున తెల్లవారుఝామున అనగా మూడున్నర గంటలకు గాంధీజీ లేచి తమ బృందముతో కలిసి ప్రార్థన చేయుటకయి సన్నద్ధులగుచుండిరి. ఆ క్రిందటి రాత్రి 12 గంటల వఱకును రాజకీయ కార్యకలాపములలో మునిగి తేలుచుండిరి. అయినను ప్రార్థన సమయమునకు లేచి ఆ నియమమును పాటించుచుండిరి అట్టి తరుణమున గృహము వెలుపల ఒక యువతి నిలువబడియుండెను. బయట ఎంత మంచు కురియుచుండెనో చెప్పుటకు అలవికాదు. చిటపట చినుకులు పడుచునే యుండెను, ఇండ్లకప్పులు, వాకిండ్లు, మంచుగడ్డలతో నిండియుండెను. అట్టి రాత్రి సమయమున జనులెవ్వరును సంచారము చేయరు. అటువంటి భీకర సమయమున పై చెప్పబడిన యువతి తనకు దర్శనము ఇప్పించవలసినదని గాంధీజీకి ఒక చీటి పంపెను. దయాంతరంగులయిన మహాత్మాగాంధీజీ ఆమెను వెంటనే లోపలికి రప్పించుకొని 'అమ్మా! నీ వెవరవు. నీ యుదంతమేమి? ఇంతటి భయంకర రాత్రియందు వచ్చుటకు గతంబేమి?' యని యడుగ ఆమె "అయ్యా! నేను ఇటలీదేశపు రాకుమారిని. మీ దర్శనము చేసికొని కృతార్థురాలను కావలెనని యరుదెంచితిని" అనెను. ఆమె పలుకులు విని గాంధీజీ శిష్యులు పరమాశ్చర్యనిమగ్నులయిరి.—అట్టిది మహాత్మాజీ తేజస్సు. వారు నియమనిష్ఠాగరిష్ఠులు. ఇంద్రియ విజేతలు. అనుదినము ఈశ్వర సన్నిధానము కల్పించుకొని తదేకధ్యానమున నిమగ్నులగుచుండెడి భక్తావతంసులు, "నేను గాలి లేకున్నను జీవింపగలనుగాని, ప్రార్థన లేకున్న జీవింప"లేనని వారు పలుమాఱులు వక్కాణించియుండిరి.

ఒకసారి వారు ఈశ్వరుని వాక్కునుకూడ వినియుండిరి. అది 1933వ సంవత్సరము అయియుండును. ఒక రాత్రి సుమారు 12 గంటలవేళ ఒక శబ్దము వారిని తట్టి లేపెను. గాంధీజీ ఉలికిపడి లేచి కూర్చుండిరి. "ఉపవాసము చేయుము" అని ఆ శబ్దము ఆదేశించెను. "ఎన్ని దినములు" అని గాంధీజీ ప్రశ్నించిరి. "21 దినములు" అని ఆ శబ్దము మాఱుపలికెను. ఆ మఱునాడే గాంధీజీ తమ దీర్ఘోపవాసమును ప్రకటించి అమలు జరిపియుండిరి. "ఆ శబ్దము భగవంతుని వాక్కే" యని గాంధీజీ తమ పత్రికలో వ్రాసియుండిరి. "ఒకవేళ అది నా అంతరంగ స్పందనమని యనుకొందురేమో, అట్లుకాదు. ఒక మిత్రుడు మఱియొక మిత్రునితో మాట్లాడినట్లు నేను ఈశ్వరుని వాక్కులను వినియున్నా"నని మహాత్మాజీ సెలవిచ్చియుండిరి. సత్యవాక్యదీక్షా పరతంత్రులగు వారి పలుకులలో అసత్యముండునా?

## అధర్మానికి తలవొగ్గనివ్యక్తి

అప్పటి దక్షిణాఫ్రికాలోని ప్రభుత్వనాయకుడు జనరలు స్మట్సు. అతడు అసాధారణ రాజకీయవేత్త. పైగా మిలిటరీసేనాని. అట్టివాడు గాంధీజీ నడుపు సత్యాగ్రహమును హర్షించునా? ఎన్నటికిని హర్షింపడు. నేటాలునుండి ట్రాన్సువాలు పోవుటకయి భారతీయులు ప్యాసుపోర్టు తీసికొనవలెను. తెల్లజాతివారికి నిర్బంధము లేదు. భారతీయులు మూడుపౌనుల పన్నుచెల్లించుట, వ్రేళ్లముద్రలు

వేసి పేరు రిజిష్టరుచేయించుకొనుట మొదలగు ననేక కష్టము లుండెడివి. వానిని తొలగించుటకయి గాంధీజీ ఢంకా మ్రోయించి సత్యాగ్రహము నడపియుండిరి ఆ దినములలో దక్షిణాఫ్రికాలో రెండు మూడు లక్షల మంది భారతీయులుండిరి. వారిలో నవచైతన్యము గలిగినది. ఒకప్పుడు గాంధీజీ రెండు వేలమంది భారతీయులను వెంట వేసికొని ప్యాసుపోర్టులులేకుండ నేటాలునుండి ట్రాన్సువాలునకు సత్యాగ్రహము చేయుటకయి పోవుచుండిరి. పోలీసులు వారిని ఎన్నో పర్యాయములు అరెస్టుచేసి వారికి జెయిలు శిక్ష విధించిరి. స్మట్సు ఈ బక్క కోమటినన్ను ఏమిచేయగలడని ఎనిమిది సంవత్సరముల సుదీర్ఘకాలము గాంధీజీని వారి శిష్యులను పలువిధముల బాధించెను. ధర్మమునకే జయము గలుగునో, అధర్మమునకే జయముగలుగునో చూతముగాక యని గాంధీజీ సయితము ఎంతో మన స్థైర్యముతో సత్యాగ్రహము నడపుచుండెను. అకాలముననేవారు, జాన్సుబర్గు పట్టణమునకు ఇరువదిమైళ్ల దూరమున ఒక వెయ్యియకరముల పొలములో టాలుస్టాయి ఆశ్రమమును స్థాపించి నిత్యము రెండు వందల మందికి భోజనవసతులు కల్పించుచు, లోకాశ్చర్యకరముగా, ఆశ్రమ ధర్మములు నిర్వర్తించుచుండిరి. గాంధీజీ నాకు లొంగకపోవునా యని జనరలు స్మట్సు ఎదురుచూచుచుండెను కాని అంత కంతకు గాంధీ తేజస్సే ప్రబలు చుండెను. ఆ ప్రాంతమున గల తెల్ల జాతివారు సయితము గాంధీచేపట్టిన కార్యమే ధర్మకార్యమని పలు విధముల ప్రశంసించుచు వారికి సాయపడుచుండిరి. ఇంగ్లాండులోనున్న బ్రిటిషు ప్రభుత్వమువారు, తమకు తాబేదారులయిన దక్షిణాఫ్రికా దొరతనము వారిని, వారు గావించెడి దుశ్చేష్టితములకు గర్హించుచుండెడివారు. అంతట జనరలు స్మట్సు కనువిప్పుగలిగిన వాడయి 1913లో గాంధీజీ కోరిన ప్రకారము సంధిచేసికొని, భారతీయుల కష్టములను చాలవఱకు తొలగించెను. ఆ విధముగా అధికార గర్వోన్మత్తుడయిన స్మట్సు దొర, కొండ మీదనుండి క్రిందకు దిగి వచ్చి గాంధీజీ ధర్మతేజస్సును గుర్తింపగలిగెను

## మార్పు తెచ్చిన మనిషి

ఇప్పటికి సుమారు 40 సంవత్సరముల క్రిందట మన మాజీ రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ గాంధీజీ అభినందన గ్రంథమును ప్రకటించి యుండిరి. ఆ గ్రంథములో దేశదేశాల నాయకుల గాంధీ ప్రశంసలు గలవు. ఆనాటికి జనరలు స్మట్సు జీవించియే యుండెను గాంధీజీని గురించి మీ అభిప్రాయము వ్రాయుడని రాధాకృష్ణన్ గారు స్మట్సు సేనానిని కోరియుండిరి. ఆ సమయములో స్మట్సు ఒక ఉదంతమును వెల్లడించుచు ఇట్లు వ్రాసియుండెను" ప్రియమయిన రాధాకృష్ణన్‌గారు! మీరు వ్రాసిన ఉత్తరము అందుకొంటిని. నేను మీ కొక సమాచారమును తెలియబరచెదను. మొదట్లో గాంధీజీ అనగా సామాన్యమానవుడనుకొంటిని. ఆయన, ప్రభుత్వము మీద తిరుగు బాటుచేసినపుడు, రాజ ధర్మము ప్రకారము నే నాయనను శిక్షించితిని. జెయిలులో పడ వేసితిని. ఆయనకు నానాయాతనలు కలుగజేసితిని. ఆ కాలములో ఆయన చెప్పులు కుట్టుట నేర్చుకొనిరి. జెయిలు నుండి విడుదల కాగానే, తాముస్వయముగా కుట్టిన ఒక జత చెప్పులు తీసుకొని తిన్నగా మా బంగళాకు వచ్చి, ఆ చెప్పులను నాకు కానుకగా సమర్పించిరి. నే నిప్పుడు ప్రమాణవాక్కుగా చెప్పుచున్నాను. వినుడు. I am unfit to get into the shoes of Gandhiji. గాంధీజీ నిలబడినచోటున నిలబడుటకు నాకు అధికారములేదు అట్టిది గాంధీజీ అపూర్వతేజస్సు"

## భారతీయ సంస్కృతి

కబీరు సంప్రదాయము వలెను, నానకు సంప్రదాయము వలెను నాకొక సంప్రదాయము లేదు. నే నేమియు నూతన ధర్మమును ప్రతిపాదించుట లేదు. నేను ఆచార్యపురుషుడనుగాను. నేను సనాతన ధర్మానుష్ఠాన పరుడను వేద ప్రతిపాదిత ధర్మమే నా ధర్మము; అని గాంధీజీ మాటి మాటికి చెప్పుచుండేవారు. నిజమున కంతే. గాంధీతత్త్వ మనగా క్రొత్తదేమియుకాదు. ఉపనిషద్ధర్మమే గాంధీతత్త్వము భారతీయ సంస్కృతియే గాంధీజీ జీవితము, భగవద్గీతకొక భాష్యము. మాకేదయినను సందేశము ఇమ్మని, ఎవ రయినను అడిగినప్పుడు నా జీవితమే సందేశమని గాంధీజీవచించు చుండిరి. నిజమునకు అంతే.

గాంధీజీ జీవితము గీతాసారమే. ఆత్మసాక్షాత్కార ప్రతిపాదనయే గీతాసారమని వారు పదే పదే చెప్పుచుండిరి. ఏబది సంవత్సరముల సుదీర్ఘకాలము ఉదయ సాయం సంధ్యలందు వారివలె అంత నిష్ఠతో, అంత ధ్యాన పూర్వకముగ, అంత శ్రద్ధాభక్తులతో గీతాపారాయణముచేసెడి వారున్నారాయను సందేహము గలుగకమానదు. మాతృస్తన్యమెట్లో వారికి గీతాపారాయణమట్లు. నాకు విపత్తులు కలిగినప్పుడును, సందేహ మనస్కుడనైనప్పుడును, నేను గీతామాతయొడిలో తలదాచుకొని ఆశ్వాసమునుపొందుచుందునని గాంధీజీ చెప్పుచుండెడివారు. భగవద్గీతయందు మూడు విషయములు ప్రతిపాద్యములు. 1. కర్మయోగము 2 ఇంద్రియ విజయము 3 భగవదాశ్రయము. కర్మయోగమందే జ్ఞానయోగము, భక్తియోగము, రాజ యోగము సమ్మిశ్రితములయియున్నవి. జగద్గురువులయిన ఆదిశంకరుల జీవితమ్ము మొదలు రామానుజులు, అరవిందయోగి, రమణమహర్షి, గాంధీజీ జీవితములలో ఈ సత్యమే గాన వచ్చుచుండును. గాంధీజీ కర్మయోగి, వారొనరించిన కర్మములు అపూర్వములు, అసాధారణములు, ఆశ్చర్యకరములు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహము చంపారన్, వీరంగాం. స్వరాజ్య సంగ్రామము ఇవన్నియు వారి అపూర్వ కార్య దక్షతకు ప్రమాణములు. ఆ కార్యములన్నియు వారు కర్మయోగులని ఋజువుచేయుచున్నవి. అడుగడుగునను బ్రహ్మసాక్షాత్కారముపొందుటం బట్టి వారు జ్ఞానయోగులనదగుదురు. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనుశ్లోకార్థమే వారి జీవితసాధన యగుటవల్ల భక్తియోగులనంబరగుదురు. నేటికిని వారి జీవితమునే, వారి బోధనల్నే, వారితత్త్వమునే మార్గదర్శకములుగానుంచుకొని ఎందరో మహానుభావులు తమ జీవితములను దిద్దుకొనుచు చరితార్థులగుచున్నారు. భావితరముల వారును అట్లే ఉండగలరు.



# గాంధీజీ జీవితం నుండి కొన్ని ఘట్టాలు

## పదకొండు నియమాలు

స్సేట్ జమన్‌లాల్ బజాజ్ కుటుంబానికీ, బాపూజీకి ఎడతెగని సంబంధం ఉంది. ఆ కుటుంబంవారు వర్ధాలో ఉంటారు. జమన్‌లాల్ బజాజ్ భార్య శ్రీమతి జానకీదేవి. ఈ పుణ్యదంపతులు సేవాగ్రాం ఆశ్రమాన్ని దేవాలయం వలె పరిగణించేవారు. వారికి ఇరువురు కుమారులు, ఇరువురు కుమార్తెలు. పెద్దకుమారుడు కమల్‌నయన్ బజాజ్. రెండవ కుమారుడు రామకృష్ణ బజాజ్. పెద్దకుమార్తె పేరు మదాలస. ఈమె శ్రీ శ్రీమన్నారాయణగారి భార్య. రెండవ కుమార్తె పేరు ఓం.

సేవాగ్రాం చుట్టుపట్ల గ్రామాలు జమీందారీలోనివి. ఆశ్రమ ప్రాంతంకూడా అందులోనే ఉంది. ఈ జమీందారీలో జమన్‌లాల్ బజాజ్ భాగస్తుడు. ఆశ్రమ ప్రాంతం ఈయన భాగం లోనిదే. జమన్‌లాల్ బజాజ్ కుటుంబం బాపూజీకి అత్యంత సన్నిహితంగా ఉండే భాగ్యానికి నోచుకున్నది. ఆశ్రమంలో జరిగే సర్వ కార్య కలాపాలకూ ఈకుటుంబం అండదండ లుండేవి. బాపూజీ ఆశీర్వాదం పొందకుండా ఈ కుటుంబంలోనివారు ఏపనీ చేసేవారు కారేమో.

జమన్‌లాల్ బజాజ్ పెద్దకుమారుడైన కమల్ నయన్ బజాజ్‌కు బాపూజీ దగ్గర చాలా చనవుండేది. అప్పుడతడు యువకుడు. ఒకసారి సింహళానికి చదువుకోసం వెళ్తూ, బాపూజీ ఆశీర్వాదంకోసం వచ్చాడు. ఆరోజు బాపూజీ మౌనదినం. అందుచేత కాగితం మీద వ్రాసియిచ్చారు. అవే ఈ పదకొండు నియమాలు!

1. తక్కువ మాట్లాడాలి.

2. ఎవరేమి చెప్పినా వినాలి. కాని, ఏది మంచిదో అదే చేయాలి.

3. ప్రతినిముషం లెక్క కట్టాలి, ఏక్షణంలో చెయ్యవలసిన పని ఆ క్షణంలో చెయ్యాలి.

4. పేదవానివలె నిరాడంబరంగా ఉండాలి.

5. పైస పైసకు లెక్క వ్రాయాలి.

6. అభ్యాసం ధ్యానపూర్వకంగా చెయ్యాలి.

7. ఇదే విధంగా కసరత్ చెయ్యాలి.

8. మితాహారిగా ఉండాలి.

9. డైరీ వ్రాయాలి.

10. బుద్ధినైశిత్యం కంటె హృదయ బలం కోట్లరెట్లు విలువ కలది కావున దానిని వికాసవంతం చెయ్యాలి అందు కొరకు గీత, తులసీ రామాయణ పారాయణం అవసరం.

11. నీవు వార్ధాని కొకసారి నిన్ను గురించి నివేదిక వ్రాసి పంపితే నీకు భద్రమవుతుంది.

వర్ధమానులైన యువకులందరికీ అనువర్తించే ఈ శాశ్వత నియమాలు ఆనాటి బాపూజీ మౌనం నుండి బహిర్గతమైనవి.

## సుప్రభాతం

కొంతకాలంపాటు గాంధీజీ కుటీరాన్ని ప్రభాకర్‌జీ శుభ్రపరుస్తూ ఉండేవారు. తెల్లవారుజామున ప్రార్థనానంతరం ప్రతి రోజు ఆయన ఈ పని చేస్తుండేవారు. కుటీరం వూడ్చటం, గోడలూ సామానూ తుడవటం, వస్తువులూ పుస్తకాలూ సర్దటం, గాంధీజీ కూర్చొనే పరుపు, అతిథులు కూర్చునే చాపలు దులిపి పరచడం మొదలైనవి ఈ పనిలో ఇమిడి ఉన్నవి.

గాంధీజీ కూర్చునేచోట కుడివైపు ఒక చిన్న కొయ్య అలమారా ఉంది. దానిలో పుస్తకాలుంటాయి. దానిమీద మూడు కోతి బొమ్మ లుంటాయి. నీతివాక్యాలు వ్రాసి ఉన్న అట్టలు కుడివైపు గోడకు ఒకటి, ఎడమవైపు గోడకు ఒకటి వ్రేలాడుతుంటాయి. ఎదురుగా ఉన్న గోడమీద ఏసుక్రీస్తు పటం వ్రేలాడుతుంటుంది ఇవి కూడా ప్రభాకర్‌జీ రోజూ తుడుస్తూ ఉంటారు. ఐతే ఈ కోతి బొమ్మలేమిటో ఆయనకు అర్థం కాలేదు. రోజూ అవి తుడిచేటప్పుడు ఇవి అక్కడ ఎందుకున్నాయి అనే సందేహం వస్తూనే ఉండేది. క్రమంగా ఈ సందేహం మనసంతా ఆవరించి, అదేమిటో తెలిసికోవాలని ఒకనాడు నిశ్చయించు కొన్నారు.

కుటీరం శుభ్రపరచటం ఉదయం ఐదున్నర గంటలకు పూర్తవుతుంది. గాంధీజీ కాలకృత్యాలు తీర్చుకొని, ఐదు ముప్పావులోగా వచ్చి కూర్చుంటారు. ఆనాడు మామూలుగా వచ్చి కూర్చోగానే ప్రభాకర్‌జీ తన సందేహాన్ని వెలిబుచ్చారు. "ఈ కోతి బొమ్మలు ఇక్కడెందుకున్నాయి" ? అని ప్రశ్నించారు.

గాంధీజీ నవ్వుతూ ఇలా అన్నారు: "ఆరు నెలలనుండి నీవు కుటీరం శుభ్రపరుస్తున్నావు. ఇంతకాలం నీ వీ ప్రశ్న అడగక పోవటం ఆశ్చర్యంగానే ఉంది. ఇప్పటికైనా అడిగావు మంచిది కూర్చో. ఇవి మామూలు కోతిబొమ్మలుకావు. ఇవి నాగురువులు. అందుకే వీనిని ఎదుట పెట్టుకొన్నాను. చైనాదేశపు

భక్తులొకరు వీనిని నాకు ఇచ్చారు. వీని అర్థం నీకు తెలియదన్నావు కదూ? అది చూడు. చేతులతో చెవులు మూసుకొని ఉన్నది. చెడు మాటలు వినను అని దానిభావం. రెండవ బొమ్మచూడు. చేతులతో కళ్ళు మూసుకొన్నది. చెడు విషయాలు చూడను అని దాని తాత్పర్యం. ఆ బొమ్మ చూడు. చేతులతో నోరు మూసుకొన్నది. చెడుమాటలు మాట్లాడను అని అర్థం. తెలిసిందా?"

"ఇక ఈ ఇరువైపుల గోడలకు తగిలించి ఉన్న నీతి వాక్యాలు చదువు" అంటూ వాక్యాలు చదివారు. ఆ రెండు వాక్యాలు, ఇవి:

"నీది ధర్మపక్షమైనప్పుడు తాలిమి దాల్చుటచే నష్టముండదు. కాని, అధర్మపక్షమైనప్పుడు మాత్రము తాలిమి గోల్పోవుటచే లాభముండదు."

(ధర్మవాదికి లేదు తాల్మిచే నష్టి
తాల్మి వీడిన లేదధర్మునకు లబ్ధి)

"అసత్య మాడుటలో అనేకవిధాలు. అసత్యం వంచనాబుద్ధిలో ఉంటుందేకాని, మాటలోఏమున్నది? ఒకప్పుడుమౌనముచే, ద్వ్యర్థిభాషణచే, ఒకానొక యక్షరముపై ఒత్తుచే, ఆడిన వాక్యానికన్యార్థమునిచ్చే ఒకానొక కనుగిలుపుచే అసత్యమాడవచ్చు. వాగ్రూపమైన అసత్యముకంటే ఇవి నీచములు."

గాంధీజీ, తన ఎదుటగోడకు వ్రేలాడుతున్న పటం వైపుచేయి చూపుతూ ఇంకా ఇలా అన్నారు. "ఈ గదిలో పటాలుండటం నాకిష్టంలేదు. ఐనా ఒకే ఒక పటం నాఎదుట ఉన్నది. అది యేసుక్రీస్తు పటం. ఆపటం నాకు చాలా ప్రియమైనదని తెలుసుకొని రాజకుమారి అమృతకౌర్ నా అనుమతితో అక్కడ పెట్టింది".

దాదాపు అరగంటసేపు గాంధీజీ ఈ సంగతులు చెప్పారు. దూరం నుండి కోళ్ళ మలికూతలు వినిపించాయి. సంశయాలు తీరిన ఆశ్రమవాసి, మాతృ గర్భంనుండి వెలువడిన శిశువువలే, కుటీరగుమ్మంనుండి ప్రభాతపు అరుణ కాంతులలోనికి వచ్చాడు.

## ఇది నాకోసం

రోజూ గాంధీకి పలుమూలలనుండి చాలా జాబులు వస్తుంటాయి. వాటిని ముందు మహదేవ్ దేశాయ్ చూచి గాంధీజీకి ఇవ్వవలసినవి ఉంటే ఇస్తారు. తక్కిన జాబుల సారాంశం ఆయనకు నివేదించి, ఏమి సమాధానం వ్రాయాలో తెలిసికొని, ఆ ప్రకారం తానే వ్రాస్తారు. ఎప్పుడైనా ఆలస్యమైతే కావచ్చుగాని, గాంధీజీకి వచ్చిన ప్రతి జాబుకు సమాధానం వెళ్ళి తీరుతుంది.

వచ్చే జాబులలో ఒక వైపే వ్రాసిన కాగితాలుంటే వాటిని దాస్తారు. కవర్లను కూడా ఖచ్చితంగా చింపి విప్పిపెట్టారు. హరిజన్‌కు వ్యాసాలు వ్రాయటానికీ, ఉత్తరాలు వ్రాయటానికీ, ఏవైన చిన్న చిన్న విషయాలు వ్రాయడానికి గాంధీజీ ఈ కాగితాలు ఉపయోగిస్తారు.

ఒకనాడు పూనా నుండి పన్నెండు అరటావుల జాబొకటి వచ్చింది. తెలుపంటూ కనిపించకుండా ఆ కాగితాల కిరువైపులా వ్రాసి వుంది. ఆ జాబు సారాంశమేమంటే – పూనా సమీపంలో మా స్వాముల వారు వేంచేసి వున్నారు. మీరు వచ్చి, వారిని అర్చించి ఆశీర్వాదం పొంది, వారి ఆజ్ఞ ప్రకారం వర్తించవలసింది. ఇలా యని యెడల మీకు మహోపద్రవం కలుగుతుంది –అని

ఈ జాబు చూపుతూ "ఎవడో వెర్రివాడు వ్రాశాడు. ఇందులో విశేషమేమిలేదు. చిత్తుకాగితాల బుట్టలో వేయడానికి తప్ప మరెందుకూపనికిరాదు" అని మహదేవ్ దేశాయ్ చెప్పారు.

బాపూజీ నవ్వుతూ "విశేష మేమీ లేదా?" అని ప్రశ్నిస్తూ ఆ జాబును అందుకొన్నారు. ఒకసారి కాగితాలటూ ఇటూ తిరగవేసి ఆ కాగితాలకు పెట్టివున్న గుండుసూది తీసి చూపుతూ ఇదిగో "ఇది నా కోసం" అంటూ ఆజాబును చిత్తుకాగితాల బుట్టలో వేశారు.

[ప్రభాకర్‌జీ డైరీ ఆధారంగా
శ్రీ ఊట్ల కొండయ్య వ్రాసిన గాంధీపథంనుండి]

---

అహింస, సత్యం యీ రెండింటికీ విడదీయరాని సంబంధం వున్నది. అవి రెండూ నాణానికి ఉండే బొమ్మా, బొరుసు లాంటివి. ఏది బొమ్మో, ఏది బొరుసో చెప్పడం సులభంగాదు. కాని అహింస సాధనా మార్గమనీ సత్యం లక్ష్యమనీ చెప్పుకోవచ్చు. సాధనా మార్గం ఎప్పుడూ మనకు అందుబాటులో ఉండాలి. అందువల్ల అహింస మన పరమధ్యేయం కావాలి. సాధనా మార్గం గూర్చి మనం శ్రద్ధతీసుకున్నప్పుడు ఆలస్యంగానైనా సరే మనం లక్ష్యాన్ని సాధించి తీరుతాము.

—గాంధీజీ

# గాంధీ శతజయంతి ఉత్సవాల రాష్ట్ర సంఘం

## కార్యక్రమాల వివరణ

1966 లో, గాంధీ శతజయంతి ఉత్సవాల రాష్ట్ర కార్య వర్గాన్ని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేసింది. రాష్ట్రగవర్నరు అధ్యక్షులుగాను, ముఖ్యమంత్రి చైర్మెన్ గాను వ్యవహరిస్తారు.

ఈ కాలంలో రాష్ట్ర కార్యవర్గం ఆరుసార్లు సమావేశ మయింది. దిగువ తెల్పిన ఐదు ఉపసంఘాలను ఏర్పాటు చేశారు.

1. సామూహిక సంబంధాలు, జాతీయసమైక్యతా ఉపసంఘం.
   శ్రీ ప్రభాకర్ జీ ............చైర్మన్.
   శ్రీ డి. ఎల్. ఆనందరావు . . .. .... కార్యదర్శి
2. ప్రాథమిక సౌకర్యాల ఉపసంఘం.
   శ్రీ పి. తిమ్మారెడ్డి.... .. ....చైర్మెన్
   శ్రీ ఆర్. కె. రావు... ........కార్యదర్శి
3. సాంఘిక కార్యక్రమాల ఉపసంఘం.
   శ్రీ సాధు సుబ్రమణ్యం.... . . ..చైర్మెన్
   శ్రీ ఆచార్య భానూ .. ... కార్యదర్శి
4. ఆర్థిక కార్యక్రమాల ఉపసంఘం.
   డా॥ జి. యస్. మేల్కొటే .......... చైర్మెన్
   శ్రీ కె. వైద్యనాథన్...... ....కార్యదర్శి
5. స్త్రీలు, పిల్లల సంక్షేమ ఉపసంఘం.
   డా॥ శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ ....చైర్మెన్
   శ్రీమతి విద్యాదేవి ఓంప్రకాశ్ ........కార్యదర్శి

ఐదు ఉపసంఘాలను ఏర్పాటుచేసిన తర్వాత వాటికార్య నిర్వహణకు ఒక్కొక్క ఉపసంఘానికి రూ. 2000ల చొప్పున మొత్తం రూ. 10000లు ప్రభుత్వం మంజూరు చేసింది.

ఉప సంఘాల వర్గీకరణను అనుసరించి కార్యక్రమాలను రూపొందించడం జరిగింది.

## (1) సామూహిక సంబంధాలు, జాతీయసమైక్యతా ఉపసంఘం :

అమోరితిలోని సంత్ తుక్డోజీ మహారాజ్ ఆశ్రమంలో నిర్వహించబడిన అఖిలభారత సామూహిక గాయకుల శిక్షణ నిమిత్తం ఆంధ్రప్రదేశ్ నుండి పదిమంది ప్రసిద్ధ గాయకులను పంపారు. అయితే ఆరుగురు అభ్యర్థులు మాత్రమే యీ శిక్షణలో పాల్గొన్నారు. గాంధీ సూత్రాలను ప్రచారం చేయాలనే ఉత్సాహంతో వారు తిరిగివచ్చారు. సామూహిక గాయకుల నిమిత్తం శిబిరాన్ని నిర్వహించాలని యీ సంఘం ఉద్దేశిస్తున్నది. గ్రామసేవకులు, ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారక నిధికి చెందిన తత్వప్రచారకులు 20 వేల బ్యాడ్జీలను పంచారు.

దక్షిణ భారత హిందీప్రచారసభ వారు, ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు "గాంధీప్రబోధ్" అను పరీక్షలను నిర్వహిస్తున్నారు. వారు తెలుగు, ఉర్దు, హిందీభాషలలో పుస్తకాలను ప్రచురించారు. విజయవాడలోని గాంధీహిల్ సంఘంవారు నవయువకులకు, విద్యార్థులకు గాంధీజీని గూర్చి తెల్పే కార్యక్రమాన్ని అమలుజరిపారు. దీనికి కేంద్రప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖ ఆర్థికసహాయం అందజేసింది.

ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ పర్యటన వివరాల సేకరణ కార్యాలయం, ఆంధ్రప్రదేశ్ గాంధీస్మారక నిధివారు "ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ" అనే చిత్ర ప్రదర్శనను ఏర్పాటు చేశారు. ఈ ప్రదర్శనలో 40 ఫోటోగ్రాపులను ప్రదర్శించారు.

బొంబాయి, ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి సంస్థలు సంయుక్తంగా బాలల నిమిత్తం గాంధీజీ బొమ్మల పుస్తకాన్ని ప్రచురించారు.

జాతీయ సమైక్యతకు గట్టిపునాదులు వేయడానికి అవసరమైన కృషిచేయబడుతున్నది. హైదరాబాదు నగరంలో మత సామరస్యతను నెలకొల్పడానికి శాంతి యాత్రలు నిర్వహించబడినాయి. సర్వశ్రీ కె. ఎం. మున్షీ, గజేంద్రగాడ్కర్ వంటి ప్రముఖులతోను, యితర విశ్వవిద్యాలయ సంస్థలతోను సన్నిహిత సంబంధాలను కొనసాగిస్తున్నారు.

## (2) ప్రాథమిక సౌకర్యాల ఉపసంఘం:

ఈ ఉపసంఘం అధ్యక్షులు శ్రీ పి. తిమ్మారెడ్డి, చిత్తూరు జిల్లాలో సమావేశాన్ని ఏర్పాటు చేశారు. గ్రామాలలో మంచినీటి సౌకర్యాన్ని కల్పించడానికి జిల్లా పరిషత్తు పంచాయతీ సమితులు అత్యంత శ్రద్ధవహిస్తున్నాయి గ్రామీణ ప్రాంతాలలో త్వరితంగా మంచినీటి సౌకర్యం. విస్తరింపజేయడానికి పంచాయతీరాజ్ ఛీఫ్ ఇంజనీరుకూడ శ్రద్ధ వహిస్తున్నారు.

మంచి నీటి కొరతగల ప్రాంతాలలో 00 మంచి నీటి బావులను ఏర్పాటు చేసే కార్యక్రమాన్ని కృష్ణాజిల్లా ప్రముఖులు. డా॥ కె. ఎల్. రావుగారి మార్గదర్శకత్వంలో అమలుజరుపుతున్నారు. ఉపరాష్ట్రపతి శ్రీ వి వి.గిరి యీ కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేశారు. ఇంతవరకు ఆరుబావులను నిర్మించారు.

## (3) ఆర్థిక ఉప సంఘం :

(1) గ్రామదానం, (2) గ్రామాలలో ఖాదీవ్యాప్తి (3) శాంతి సేన—అనే త్రివిధ కార్యక్రమాలను యీ ఉపసంఘం అమలుజరుపుతున్నది.

ఈ కార్యక్రమాన్ని వివరిస్తూ శ్రీ మనోమోహన్ చౌదరి వ్రాసిన 'ప్రజలకు స్వాతంత్ర్యం' అనే పుస్తకాన్ని అనువదింప జేసి యీ సంఘం ప్రచురించింది. ఆంధ్రప్రదేశ్ సర్వోదయ మండలి, గ్రామదానం అనే కరపత్రాన్ని ప్రచురించింది. ఖాదీ కార్యకర్తల నిమిత్తం రాష్ట్రస్థాయిలో సమావేశాన్ని ఏర్పాటు చేయడానికి యీ ఉపసంఘం ఆలోచిస్తున్నది.

1968 జూన్‌లో మహబూబ్‌నగర్ జిల్లాలో నిర్మాణ కార్యకర్తల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. కనీసం జిల్లాలో ఒక గ్రామంలోనైనా నిర్మాణ కార్యక్రమాలన్నిటినీ అమలుజరపడంలో తమశక్తిని కేంద్రీకరించి ఆదర్శవంతమైన గ్రామ స్వరాజ్యాన్ని ఏర్పాటు చేయాలని యీ సమావేశంలో నిర్ణయించారు.

1968 మేలో చిత్తూరుజిల్లా తిరుపతిలో గాంధీశాంతి కేంద్రంవారు శాంతి సేన శిబిరాన్ని నిర్వహించారు. శ్రీ అనంత శయనం అయ్యంగార్ నేతృత్వంలో 15 మంది కార్యకర్తలు యీ శిబిరంలో శిక్షణపొందారు. రాష్ట్రస్థాయిలో శాంతి సేన సమావేశాన్ని ఏర్పాటుచేసే కార్యక్రమం పరిశీలనలో ఉంది.

## (4) సాంఘిక కార్యక్రమాల ఉప సంఘం :

క్రొత్త ఢిల్లీలోని గాంధీశతజయంతి ఉత్సవాల కేంద్ర సాంఘిక కార్యక్రమాల ఉపసంఘం ఆర్థిక సహాయంతోను, ఆంధ్రప్రదేశ్ గాంధీస్మారకనిధి, ఆంధ్రప్రదేశ్ హరిజన సేవక సంఘం సహకారంతోను విశాఖపట్నంలో భంగిముక్తి శిబిరం ఏర్పాటు చేయబడింది. శ్రీ.టి. ప్రకాశరాయుడు నేతృత్వంలో 50 మంది కార్యకర్తలు యీ శిబిరంలో పాల్గొన్నారు.

ఈ శిబిరం నిర్వహణ సందర్భంగా శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య అధ్యక్షతన అంటరానితనం నిర్మూలన సమావేశం ఏర్పాటు చేయబడింది. శ్రీ వి. బి. రాజు యీ సమావేశాన్ని ప్రారంభించారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం ఉపాధ్యాయులు, మునిసిపల్ కౌన్సిల్ ఛైర్మన్ సమావేశానికి హాజరు అయ్యారు. సమావేశం ముగింపులో సామూహికవిందు ఏర్పాటు చేశారు.

ప్రభుత్వంలో, ప్రజాసంస్థలలో పంపిణీ నిమిత్తం సమావేశంలో ఆమోదించిన తీర్మానాలను కరపత్రాలుగా ప్రచురించారు.

మెదక్ జిల్లా పొన్నాలలో గాంధీస్మారకనిధి కేంద్రం, ఆంధ్రప్రదేశ్ విభాగాలు, గ్రామీణ పారిశుద్ధ్యం, ఆరోగ్యం విషయాలలో కార్యకర్తలకు శిక్షణ యివ్వడానికి సఫాయ్ విద్యాలయాన్ని నిర్వహించారు. 20 మంది విద్యార్థులకు శిక్షణయివ్వడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ గాంధీస్మారకనిధి కార్యకర్తలు, విద్యార్థులు, సిద్ధిపేట, పరిసరగ్రామాలలో పాకీ పనిలేని 50 రకాల మరుగుదొడ్లను నిర్మించారు.

వివిధరకాల మరుగుదొడ్ల నిర్మాణంవల్ల కలిగేలాభాలను వివరిస్తూ ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారకనిధి కరపత్రాలను ప్రచురించింది. తొమ్మిదిరకాల ఫోల్డర్లను పంపిణీచేశారు. పాతమరుగు దొడ్లు ఉండే గృహాలస్థితి, అభివృద్ధికరమైన కొత్తమరుగుదొడ్లు ఉండే గృహాల పరిస్థితిని వివరిస్తూ ఐదువేల పోస్టర్లను ప్రచురించారు. జిల్లాపరిషత్తులు, పంచాయతీ సమితులు, యితర సంస్థలకు వాటిని పంపిణీచేస్తారు. ఆంధ్రప్రదేశ్ గాంధీ స్మారక నిధి, విశాఖ పట్నంలో డా॥ ఎం. వి. కృష్ణారావు నేతృత్వంలో భంగీముక్తి ప్రయోగాత్మక పథకాన్ని నిర్వహించింది.

పట్టణాలు, గ్రామాలలో ఆధునిక మరుగు దొడ్లను ప్రాచుర్యంలోకి తేవడానికి ఆంధ్ర ప్రదేశ్ గాంధీ స్మారకనిధి వారు భంగీముక్తి ప్రత్యేక కార్యక్రమాన్ని చేపట్టారు. రాష్ట్రస్థాయిలో సంస్థను ఏర్పాటు చేశారు. మొదటి చర్యగా ఆంధ్ర ప్రదేశ్ గాంధీ స్మారకనిధి వారి గ్రామ సేవా కేంద్రం, పరిసర గ్రామాలలో ఆధునిక మరుగు దొడ్లను నిర్మిస్తున్నది.

## వయోజన విద్య

ఆంధ్ర ప్రదేశ్ గాంధీ స్మారకనిధి వారు వయోజనుల నిమిత్తం పుస్తకాలను ప్రచురించే కార్యక్రమాన్ని చేపట్టింది. కీ. శే. శ్రీహరి సర్వోత్తమరావుగారి సవరించబడిన పుస్తకాన్ని ప్రచురించారు. శ్రీహరి ఆదిశేషు నేతృత్వంలో 25 పుస్తకాలను తయారుచేస్తున్నారు.

డా॥ ఎం. వి. కృష్ణారావు నేతృత్వంక్రింద విశాఖపట్టణంలో పైలెట్ ప్రాజెక్టును ప్రారంభించాలనే ప్రతిపాదనను ఆంధ్ర ప్రదేశ్ గాంధీ స్మారకనిధివారు పరిశీలిస్తున్నారు.

## మద్య నిషేధం

మద్రాసులో, 1968 ఏప్రిల్ 12, 13, 14 తేదీలలో జరిగిన అఖిల భారత మద్య నిషేధ మహాసభలలో ఆంధ్ర ప్రదేశ్ నుండి అనేక మంది ప్రతినిధులుగా పాల్గొన్నారు. ఇతర సోదర సంస్థల సహకారంతో మద్య నిషేధం నిమిత్తం ప్రజాభిప్రాయాన్ని సమీకరించడానికి మద్య నిషేధ మండలి కృషిచేస్తున్నది.

## మత సామరస్యం

ఆంధ్ర ప్రదేశ్ సర్వోదయ మండలి వారు యితర సంస్థల సహకారంతో హైదరాబాదులో వివిధ మతాల మధ్య సామరస్యసాధనకు కృషి చేస్తున్నారు. హైదరాబాదు నగరంలో శాంతి యాత్రలు, సమావేశాలు నిర్వహించారు.

## (5) స్త్రీ, శిశు సంక్షేమ ఉప సంఘం :

ఆంధ్ర మహిళా సభ ఆవరణలో ఏప్రిల్ 10 నుండి 17వ తేదీ వరకు రాష్ట్రస్థాయిన జిల్లా ఆర్గనైజర్ల సమావేశం జరిగింది. జిల్లా ఆర్గనైజర్లతోసహా 50 మంది స్త్రీ కార్యకర్తలు యీ శిబిరంలో పాల్గొన్నారు. వ్యవసాయ మంత్రి, ప్రాథమిక సౌకర్యాల ఉపసంఘం అధ్యక్షులూ అయిన శ్రీ పి. తిమ్మారెడ్డి యీ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. శ్రీమతి కె. రామ సుబ్బమ్మ, శ్రీమతి డి. లక్ష్మీబాయమ్మ వంటి ప్రముఖులు గాంధీ తత్వాన్ని గూర్చి గాంధీజీ ఆశించిన నూతన సంఘాన్ని గూర్చి వివరించారు. జస్టిస్ గోపాల్‌రావు ఎక్బోటే, డా॥ సి. డి. దేశ్‌ముఖ్, డా॥ ఓంప్రకాశ్ గుప్త వంటి విద్యావేత్తలు కార్యకర్తల నుద్దేశించి ప్రసంగించారు. కొన్ని కాలనీలలో యింటింటికి వెళ్ళి సాహిత్యం, బాడ్జీలు, ఫోటోగ్రాఫులు పంపిణీ చేయడం వంటి కార్యక్రమాలను శిబిరంలో పాల్గొన్న కార్యకర్తలు నిర్వహించారు.

హైదరాబాదు నగరానికి 15 మైళ్ళలో ఉన్న ఘటికేశ్వర్‌లోకూడ యిటువంటి శిబిరాన్ని నిర్వహించారు. కార్యకర్తలు రామ్‌ధున్ పాడుతూ వూరంతా తిరిగారు. చాలామంది ప్రజలను యిది ఎంతగానో ఆకర్షించింది. సాయంత్రం వారు ఇంటింటికీ వెళ్ళి గాంధీ సందేశాన్ని అందజేశారు. ఆ తర్వాత బహిరంగ సభను ఏర్పాటుచేశారు.

చిత్తూరుజిల్లా తిరుపతిలో జూన్ 8 నుండి 8 రోజులపాటు పునశ్చరణ శిబిరాన్ని ప్రథమంగా నిర్వహించారు. రాయలసీమ, నెల్లూరులకు చెందిన కార్యకర్తలు యిందులో పాల్గొన్నారు. డా॥ సి. డి. దేశ్‌ముఖ్ యీ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. శ్రీ అనంతశయనం అయ్యంగార్ అధ్యక్షత వహించారు. మద్రాసురాష్ట్ర గాంధీ శతజయంతి ఉత్సవ స్త్రీ, శిశు సంక్షేమ ఉపసంఘం అధ్యక్షురాలు శ్రీమతి సరోజినీ వరదప్పన్, ప్రత్యేక ఆహ్వానంపై యీ శిబిరానికి హాజరు అయ్యారు. మద్రాసు రాష్ట్రంలో జరుగుతున్న కార్యక్రమాలనుగూర్చి ఆమె వివరించారు.

గాంధీ సాహిత్యానికి సంబంధించిన ప్రదర్శనను ఏర్పాటు చేశారు. శిబిరాలను నిర్వహించడంలోగల వివిధ విధానాలను గూర్చి; జిల్లా, బ్లాకు, గ్రామస్థాయిలో జరిగే శిబిరాలనుగూర్చి చర్చించారు.

ఇంటింటికి వెళ్ళి ప్రచారం చేయడంలో ప్రత్యక్షశిక్షణను నిర్వహించారు. గాంధీ శాంతి కేంద్రాల తత్వ ప్రచారక్ శ్రీ ఎం. సుబ్రమణ్యరాజు యీ శిక్షణను నిర్వహించారు. కార్యకర్తలు 9 వ తేదీన ఏర్పేడు గ్రామాన్ని దర్శించారు. అక్కడి మళయాళస్వామి ఆశ్రమంవారు ఎంతో ఆదరణతో చూచారు. స్వామీజీ గాంధీ శతజయంతి ఉత్సవకార్యక్రమాలను ఆసక్తితో ఆలకించి యీ కార్యక్రమాన్ని చేపట్టడానికి అంగీకరించారు.

ఈ కార్యకర్తలు, కాళహస్తిలో బి. డి. ఒ. ను కలిసి, ఉత్సవ కార్యక్రమ వివరాలను తెలిపారు. శిబిర నిర్వహణలో జిల్లా కలెక్టరు, దేవస్థానంవారు ఎంతగానో తోడ్పడ్డారు. రాష్ట్ర కార్య నిర్వాహక వర్గం జూన్ నెలలో సమావేశమై రాష్ట్ర స్థాయిలో సెమినారును నిర్వహించాలని తీర్మానించింది.

---

## మా గాంధి

కొల్లాయి గట్టితేనేమీ మాగాంధి
కోమటై పుట్టితేనేమీ ?

వెన్నపూసా మనసు
కన్నతల్లి ప్రేమ
పండంటి మోముపై
బ్రహ్మ తేజస్సు

బోసి నోర్విప్పితే
ముత్యాల తొలకరే
చిరునవ్వు నవ్వితే
వరహాల వర్షమే

చకచక నడిచేను
జగతి కంపించేను
పలుకు పలికితేను
బ్రహ్మ వాక్కేను



— బసవరాజు అప్పారావు

## మట్టిలోనుంచి పుట్టిన మాణిక్యం:

# లాల్ బహదుర్ శాస్త్రి

మహర్షి గాంధీ మన దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించారు. తత్త్వవేత్త రాధాకృష్ణన్ లౌకిక రిపబ్లిక్‌కు ఆధిపత్యం వహించారు. ఐశ్వర్యవంతుడుగా జన్మించి గొప్ప ప్రజాస్వామ్యవాదిగా రూపొందిన జవహర్లాల్ నెహ్రూ సంక్షేమ రాజ్యాన్ని స్థాపించడానికి పదిహేడు సంవత్సరాలపాటు తీవ్రంగా పాటుబడ్డారు. "పవిత్రులైనవారు, సాత్వికులు పృథ్వికి వారసులు" అన్న బైబిలు సూక్తిలోని సత్యాన్ని నిరూపించినవారు లాల్ బహదుర్.

బీద పాఠశాల ఉపాధ్యాయుని పుత్రునిగా జన్మించిన లాల్ బహదుర్ సంవత్సరంనర ప్రాయంలోనే తండ్రిని కోల్పోయారు. బాలుడుగా ఆయన, ఫుట్‌బాల్ కానీ, హాకి స్టిక్ కానీ కొనుక్కోవాలన్న మురిపాన్ని తీర్చుకోలేకపోయారు. వాటికి బదులుగా తయారు చేసుకున్న ఆట వస్తువులతోనే సంతృప్తి జెందవలసివచ్చిందాయనకు. గంగా నదిని దాటటానికై పడవవానికి చెల్లించడానికి డబ్బులేక నది ఈది ఆవలి ఒడ్డుకు చేరుకొనవలసి వచ్చింది. కళాశాల విద్యార్థిగా ఆయన బైసికిలుకూడా సమకూర్చుకోలేకపోయారు. ఒకప్పుడు నెలకు రెండున్నర రూపాయల స్వల్ప మొత్తంతోనే ఆయన కాలక్షేపము చేయవలసి వచ్చింది. ఒకసారి చికిత్స చేయించడానికి డబ్బులేకపోవడంవల్ల పుత్రికా వియోగశోకాన్నికూడా పొందవలసివచ్చింది. లాల్ బహదుర్ దారిద్రంలో పుట్టి దారిద్ర్యంలోనే పెరిగారు. ఆయన మంత్రి, ప్రధాన మంత్రి అయిన తరువాతకూడా డబ్బు నిలువ చేయలేదు. ఆస్తి సంపాదించలేదు. అంతటి నిష్కాపట్యుడు, నిజాయితీ పరుడాయన.

లాల్ బహదుర్, 1921 వ సంవత్సరంలో సహాయ నిరాకరణోద్యమంలో ప్రవేశించారు. అప్పుడాయన బెనారస్‌లోని హరిశ్చంద్ర హైస్కూలులో చదువుతుండేవారు.

1927 లో ఆయనకు లలితాదేవితో వరకట్నం లేకుండా వివాహం జరిగింది.

లాలా లజపత్‌రాయ్ స్థాపించిన సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యుడుగా లాల్ బహదుర్ తన జీవితాన్ని నిస్వార్థ ప్రజాసేవకు అంకితం చేశారు. ఆయన దేశస్థుల హక్కులకై పోరాడుతూ ఏడు పర్యాయాలు మొత్తం తొమ్మిది సంవత్సరాల పాటు కారాగారవాసం చేశారు.

లాల్ బహదుర్ హృదయం సున్నిత సుమముకన్న కోమలమైనది. అయితే అవసరమైనప్పుడు అది వజ్రానికంటే కఠినమైనదిగా మారుతుండేది.

దేశంలో కాంగ్రెసు మంత్రిమండలులు ఏర్పడినప్పుడు, లాల్ బహదుర్, యు పి. ముఖ్యమంత్రి గోవింద వల్లభ్ పంత్‌కు పార్లమెంటరీ సెక్రటరీగా నియుక్తులయ్యారు. తరువాత మంత్రి అయ్యారు.

ఆయన మంచి కార్యదక్షుడు. సాధారణ ఎన్నికలలో కాంగ్రెసు విజయానికి ఆయన కారకులు.

1952 లో లాల్ బహదుర్ కేంద్ర ప్రభుత్వంలో రైల్వే, రవాణా శాఖల మంత్రిగా నియమించబడినారు. ఆయన రైళ్లలో మొదటి తరగతిని రద్దు చేయించారు. మూడవ తరగతి ప్రయాణీకుల కొరకు సీలింగ్ పంఖాలను, పడక సౌకర్యాలను కల్పించారు. 1956 లో అరియలూరులో రైలు ప్రమాదం సంభవించినప్పుడు తమ మంత్రి పదవికి రాజీనామా చేశారు. 1957 లో లోక్‌సభకు ఎన్నికై రవాణా, కమ్యూనికేషన్ల మంత్రిగా తిరిగి కేంద్ర ప్రభుత్వంలో ప్రవేశించారు. విశాఖపట్నం నౌకా నిర్మాణ కేంద్రం ప్రారంభించబడింది ఆయన హయాములోనే.

పండిత్ పంత్ నిర్యాణానంతరం లాల్ బహదూర్ హోం మంత్రి అయ్యారు. అస్సాంలో చెలరేగిన భాషా సంఘటనలను, పంజాబులో సాగిన అకాలీ ఆందోళనను



73-6

హోం మంత్రిగా ఆయన చతురతతో నివారించారు. హిందీయేతర రాష్ట్రాల వారికి-ముఖ్యంగా దక్షిణాది వారికి సంతృప్తి కలిగించిన అధికార భాషా చట్టం రావడానికి ఆయన కారకుడు. భారత-నేపాల్ దేశాలమధ్య సుహృద్భావ సంబంధాలను పునరుద్ధరించడానికి ఆయన దోహదం చేశారు.

1963 లో కామరాజ్ పథకాన్ననుసరించి లాల్ బహదుర్ మంత్రి మండలి నుంచి వైదొలిగారు. ఆ మరుసటి సంవత్సరం ప్రారంభంలో నెహ్రూ ఆరోగ్యం క్షీణించింది. అప్పుడు భువనేశ్వర్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభలో, ప్రజాస్వామ్యానికీ, సోషలిజానికీ సంబంధించిన ముఖ్యమైన తీర్మానాన్ని లాల్ బహదుర్ ప్రవేశ పెట్టవలసి వచ్చింది. నెహ్రూ అస్వస్థులు కావడంవల్ల ఆయనకు కార్యభారంలో తోడ్పడేందుకు లాల్ బహదుర్‌ను తిరిగి మంత్రిమండలిలో నియమించారు.

శ్రీనగర్‌లోని హజ్రత్‌బల్ మసీదు నుంచి మహమ్మద్ ప్రవక్త పవిత్రకేశాన్ని ఎవరోదొంగిలించడంవల్ల కాశ్మీర్‌లో ఏర్పడిన ఉద్రిక్తపరిస్థితిని ఆయన మంత్రిఅయిన వెంటనే నివారించవలసి వచ్చింది. పవిత్ర కేశం లభించింది. లాల్ బహదూర్ శ్రీ నగర్ వెళ్లి ఆ పవిత్ర కేశాన్ని ప్రజలు దర్శించుకోవడానికి ఏర్పాట్లు చేశారు. అక్కడి నాయకులతో సమాలోచనలు జరిపారు. రాష్ట్ర ప్రజల అభిమానాన్ని చూరగొన్నారు.

1964 మేలో నెహ్రూజీ నిర్యాణానంతరం లాల్ బహదూర్ దేశ రథ సారథ్యంవహించారు.

ప్రజలు మోస్తున్న దారిద్ర్య భారాన్ని తొలిగించడానికి ప్రధాన మంత్రిగా లాల్‌బహదూర్ మొదట ఉపక్రమించ దలచారు కాని దురదృష్టవశాత్తు మన ప్రాదేశిక సమగ్రతకు పాకిస్తాన్ నుంచి ప్రమాదం వాటిల్లింది. జీవనాధారంకంటే మనుగడ ప్రధానం. సాత్వికమైన ప్రాణి మృగరాజువలె విజృంభించగలదని నిరూపించుకున్నారు. వామనుడు త్రివిక్రముడిగా ఎదిగాడు. దురాక్రమణ అంతమొందింది. శాస్త్రీజీ శాంతికాముకుడు. గౌరవప్రదమైన పద్ధతిలో సంప్రదింపులు జరిపి శాంతిని సంస్థాపించడానికి సుముఖుడు. తాష్కెంట్ ప్రకటనను ఆయన, ఇదికేవలం న్యాయశాస్త్ర సంబంధమైన పత్రంకాదు. ఒక విధంగా ఇది రాజకీయ పత్రంకంటే కూడా ప్రధానమైనది- అనిపేర్కొన్నారు ఆయన మర్త్య జీవితపు శివార్లనుదాటి శాశ్వత లోకానికి చేరుకొన్నారు.

నానక్ నన్హేహై అహోజైనే నన్హేదూబ్

జొర్‌టాల్ సూఖ్ జాయెంగి దూబ్‌ఖూబ్ కీఖూబ్

నానక్ యొక్క ఈ గానమే లాల్‌బహదుర్ జీవిత ధ్యేయం.

లాల్‌బహదుర్ శాస్త్రి సార్థక నామధేయుడు. ఆయన తత్త్వశాస్త్రంలో శాస్త్రి- అనగా (పట్టభద్రుడు) ఆయన లాల్- అనగా ప్రియతముడు. ఆయన బహదుర్-అనగా వీరుడు.

—వై. ఆంజనేయులు

## కరువు నివారణకు సహాయక చర్యగా రూ. 15 కోట్లు కేటాయింపు

రాష్ట్రంలోని కరువు పరిస్థితులను ఎదుర్కోవడానికిగాను సహాయక చర్యల నిమిత్తం 1969 ఫిబ్రవరి మాసాంతానికి-అంటే రానున్న అయిదు నెలలకు రూ. 15 కోట్లను రాష్ట్ర మంత్రి మండలి కేటాయించింది. చిన్నసీటి వనరుల ప్రాజెక్టులకు, భూసార పరిరక్షణ పథకాలకు అధిక ప్రాధాన్యతను యివ్వడం జరుగుతుంది. అంతేగాక రాష్ట్రంలో 10,000 చవుక ధరల దుకాణాలను నెలకొల్పాలని కూడా ప్రభుత్వం నిశ్చయించింది. బావులను మరింతగా లోతు చేయించుకోవడానికి యింకా ఎక్కువగా ఆపత్కాల తక్కావీ ఋణాలను మంజూరు చేయడం జరుగుతుంది.

అనుకోని కరువువల్ల యీ ఏడాది 15.2 లక్షల టన్నుల ఆహార ధాన్యాల తరుగు ఏర్పడవచ్చని ప్రభుత్వం భావిస్తున్నట్టు రెవెన్యూ పౌర సరఫరాల మంత్రి శ్రీ వి. బి రాజు పేర్కొన్నారు. ఇతర ఆహార ధాన్యాలతోపాటు ఒక లక్ష టన్నుల ముతక బియ్యాన్ని కూడా సరఫరా చేయవలసిందిగా కేంద్రాన్ని రాష్ట్ర ప్రభుత్వం కోరుతుందన్నారు.

సీరియల్

# తిరస్కృతి

—వాసిరెడ్డి సీతాదేవి

### జరిగిన కథ

సత్యం, సూర్యం అన్నదమ్ములు, సరళ, వాళ్ళతోపాటే పెరుగుతోంది. సత్యం అంటే సరళకు యిష్టం. ఎప్పుడూ అతని తోనే ఆడుకునేది. చిన్నవాడైన సూర్యానికి అది నచ్చలేదు. ఉడుకు మోత్తనం వచ్చింది. ఓసారి సరళ గుజ్జనగూటిని సూర్యం తొక్కేసి ఆమెను రోడ్డుమీదకి తోశాడు. ఎదురుగా లారీ వస్తోంది. సత్యం చూశాడు. ఆమెను రక్షించే ప్రయత్నంలో తనే లారీకింద పడ్డాడు. చెయ్యి విరిగింది. ఓసారి పొలానికి వెళ్ళినప్పుడు తనకు దగ్గరగా వున్న నాగుబామును పాలేరు రంగన్న చంపడంచూసి బాధపడ్డాడు

రంగన్న మాధవయ్యతో ఆనాడు పొలంలో జరిగిన సంగతంతా చెప్పాడు. శాంతమ్మ విని గుండెలు బాదుకుంది. మాధవయ్య గుప్పుగుప్పున చుట్టపొగవదిలాడు. ఆనాటి నుంచి స్కూలు వదలగానే ఇంటికి రావాలని మాధవయ్య శాసించాడు. సత్యం తల వంచుకొని లోపలకు వెళ్ళిపోయాడు. ఆ రాత్రంతా సత్యానికి సరిగా నిద్ర పట్టలేదు. ఏదో అశాంతి వెంటబడి తరమసాగింది, మృగము వెంటబడిన వేటగానిలాగ.

మరునాడు సత్యం స్కూల్లో పాఠాలు జరుగుతున్నప్పుడు తెల్లకాగితం మీద బొమ్మలు గీచుకుంటూ కూర్చున్నాడు. అది గమనించిన మాష్టరు గబగబా సత్యం దగ్గరకు వచ్చి చూశాడు సత్యం చేస్తున్నపని చూడగానే అంతకుముందు కలిగిన కోపం నీళ్ళలో వేసిన ఉప్పుగడ్డలా కరిగిపోయింది. సత్యం నాట్యం చేస్తున్న పాము యొక్క వివిధ భంగిమల్ని గీచాడు. చివర గీస్తున్నది దెబ్బతగిలి కిందపడినపామును. టప్పున రాలిన కన్నీటి బొట్లు కాగితం మీద ముత్యాల్లా నిలచివున్నాయి మాష్టరు ఆశ్చర్యంగా చూస్తూండి పోయాడు.

"సత్యం!" అన్నాడు ఆదరణా, గౌరవం ఉట్టిపడే స్వరంతో.

సత్యం ఉలిక్కిపడి లేచి నిల్చున్నాడు. అపరాధిలా తల వంచుకున్నాడు. మాష్టరు కాగితాలను చేతుల్లోకి తీసుకొని చూడ సాగాడు. నాగరాజు వివిధ నృత్యభంగిమల్ని చిత్రించాడు. ఎంతో సజీవంగా వున్న ఆ చిత్రాలను చూసి ఆశ్చర్య పోయాడు. చివరి బొమ్మలో మృత్యువులోని స్తబ్ధత స్పష్టంగా ప్రతిబింబిస్తుంది. అంతవరకూ నిలిచి వున్న కన్నీటి బొట్లు కారి కాగితాన్ని తడిపాయి, కాగితం పైకి ఎత్తటంవల్ల.

"క్షమించండి సార్! ఇంకెప్పుడూ క్లాసు సమయంలో ఇలాచెయ్యను." అన్నాడు సత్యం.

"నాతోరా!" అంటూ మాష్టరు క్లాసు బయటకు నడిచాడు. ఆ వెనకే బిక్కుబిక్కు మంటూ బయటకు నడిచాడు సత్యం. క్లాసు పిల్లలంతా ఇవ్వాళ కేశవరావు చేతిలో సత్యానికి పూజ జరుగుతుందనుకున్నారు కేశవరావు స్టాఫ్ రూములోకి వెళ్ళి సోఫాలో కూర్చున్నాడు. ఎదురుగా తలవంచుకొని నిల్చున్న సత్యాన్ని ఓక్షణం పరిశీలనగా చూసి "కూర్చో సత్యం!" అన్నాడు. ఆ కంఠంలోని ఆదరణకు సత్యం ముఖంలో విస్మయం, సంతోషం ముప్పిరి గొనగా తలపైకెత్తి చూశాడు.

"కూర్చో పరవా లేదు." అంటూ చెయ్యి పట్టుకొని సోఫా మీద తన పక్కనే కూర్చో పెట్టుకున్నాడు. "ఇంతకాలం నువ్వు తెలివైన వాడివనీ, బుద్ధిమంతుడివనే తెలుసు కాని నీలోని కళా హృదయాన్ని తెలుసుకోలేదు." అన్నాడు కేశవరావు. ఆ ప్రశంసా వాక్యాలకు సత్యం సిగ్గుపడ్డాడు.

"నువ్వు చాలా పెద్ద కళాకారుడివి కాగలవు. కాని కొన్ని బేసిక్ ప్రిన్సిపల్స్ నువ్వు నేర్చుకోవాలి. నాకో మిత్రుడు వున్నాడు. అతను ఆంధ్రదేశంలో పేరుగల చిత్రకారుడు సెలవల్లో నిన్ను అతని దగ్గరకు పంపిస్తాను." అన్నాడు కేశవరావు.

సత్యం కృతజ్ఞతగా మాష్టరు ముఖంలోకి చూశాడు. "వాటర్ కలర్స్‌లో ఏమైనా వేశావా?" అన్నాడు.

"వేశానండీ!" అన్నాడు.

"నాకు ఒకసారి చూపించు."

"అలాగే సార్!" అన్నాడు సత్యం ఉత్సాహంగా.

"ఇక క్లాసులోకి వెళ్ళు. ఒక విషయం చెబుతాను బాధ పడకు, అలాక్లాసులో బొమ్మలు వేసుకుంటూకూర్చోకు." అన్నాడు.

"అలాగే సార్!" అంటూ క్లాసులోకి వెళ్ళాడు ఉత్సాహంగా. విప్పారిన ముఖంతో క్లాసులోకి వస్తున్న సత్యాన్ని చూసి పిల్లలు ఆశ్చర్యపోయారు. స్కూలు వదలగానే బయటకు వచ్చి సత్యం సరళకోసం చూస్తూ నిల్చున్నాడు. సరళ దూరంగా సత్యం కోసమే నిల్చొని వుంది. వెనకనుంచి ఒక కుర్రాడు, సత్యం క్లాసుమేటు, సరళ జడపట్టుకొని గుంజి ఏమీ ఎరగనట్లే

గబగబా ముందుకు వెళ్ళిపోయాడు "వెధవాయ్! ఉండు మాబావను రానియ్ నీ పని పట్టిస్తాను" అంటూ గట్టిగానే అరిచింది సరళ.

"ఎవరూ ఆ కుంటి వాడా నా పని పట్టేది! హీ! హీ!" అంటూ పళ్లు చూపించాడు. మరుక్షణంలో చెంప చెళ్ళుమంది. సత్యం ఎదురుగా కనిపించాడు. ఏం జరిగిందో అర్థంచేసుకోవటానికి వాడికి ఓ క్షణం పట్టింది. అర్థంకాగానే సత్యం మీదకు లంఘించాడు సత్యం తమాయించుకోలేకపోయాడు. కింద పడ్డాడు. పైన పడిన వాడితో ఒక్క చేత్తోనే పెనుగు లాడుతున్నాడు సత్యం జుట్టు రెండు చేతుల్తో పట్టుకొని వాడు తలను నేలకు వేసి కొట్టాడు. నేలలో నుంచి పదునుగా పైకి వున్న ఓ కంకర రాయికి తల తగిలి చిట్లింది. రక్తం చిమ్మింది.

దూరంగా నిల్చుని తమాషా చూస్తున్న సూర్యాన్ని "చిన్న బావా! త్వరగారా! చూడు పెదబావను వాడు ఎలా కొడుతున్నాడో!" ఆత్రంగా కేకలు పెట్టింది. సూర్యం గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళి పోయాడు.

రక్తం కళ్ళబడగానే ఆ కుర్రాడు సత్యాన్ని వదిలి పారి పోయాడు. అప్పటికే కొందరు కుర్రాళ్లు చుట్టూ చేరారు. గొడవ విని ఒక మాస్టరు పరుగెత్తుకొచ్చాడు రక్తం కారుతున్న సత్యాన్ని లోపలకు తీసుకెళ్ళి కడిగి స్పిరిట్ వేసి పంపించాడు.

"చూడు సత్యం! నువ్వు అవిటివాడివి. ఆ కొంటె వెధవల జోలికి పోకు." అన్నాడు.

సత్యం మనస్సు చివుక్కుమంది గబగబా బయటకు వచ్చేశాడు.

సూర్యం వచ్చి మాధవయ్యతో సంగతి చెప్పాడు. అసలు విషయం దాచిపెట్టి ముందు సత్యమే ఆ కుర్రాణ్ణి అనవసరంగా కొట్టి రెచ్చ గొట్టాడనీ, సత్యానికి తల పగిలి రక్తం వస్తుందనీ చెప్పాడు. మాధవయ్యకు బాధ కలిగింది. ఆ బాధ కోపంగా మారింది. సత్యం కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

అర్ధగంట ఆలస్యంగా, సరళతో పాటు అన్యమనస్కంగా లోపలకు వచ్చిన సత్యాన్ని చూశాడు మాధవయ్య. షర్టునిండా రక్తపు మరకలు పడ్డాయి.

"ఏంరా! కుంటి వెధవ్వు! ఒకమూల పడి వుండక అందరితో తగాదాలు తెచ్చుకొని ఎందుకు తన్నులు తింటావు?" కరుకుగా అన్నాడు.

తండ్రి మాటలు సత్యం మనస్సుకు కంకరరాళ్లలా తగిలాయి. దెబ్బతిన్న జంతువులా చూశాడు తండ్రి ముఖంలోకి.

"ఏమిటలా గుడ్లప్పగించి చూస్తావు? ప్రతివాళ్ల చేతా తిట్లూ, తన్నులూ తినటానికి సిగ్గులేదూ?"

"ఎందుకండీ వాడ్ని కోప్పడతారు" అంది భార్య.

"నువ్వు గారాబం చేసే వాణ్ణి చెడగొట్టుతున్నావు అవిటి తనానికి తోడు వాడికి పెడబుద్ధులు కూడ వస్తే, ఇక మన అదృష్టం అడగక్కర లేదు."

"చాల్లెండి! ఏమిటా మాటలు? మీకు మతిపోయిందిలా వుంది. అసలేవాడి మనస్సు మెత్తన వాడి మొఖం చూడండి. ఎంత ఇదయి పోతున్నాడో!" అంది శాంతమ్మ మందలింపుగా.

మాధవయ్య సత్యంముఖం కేసి చూశాడు. గబ గబ పైపంచ భుజం మీద వేసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

అంతవరకు దిగ్భ్రాంతురాలై నిలబడిపోయిన సరళ సూర్యం కళ్ల సంతృప్తిగా మెరవటం చూసింది. సూర్యం మీద ఎక్కడలేని కోపం వచ్చింది. ముఖం తిప్పేసుకుంది. నాకు రెండు చతులున్నాయి చూడండి అన్నట్టు చప్పట్లు కొడుతూ, చేతుల్ని గాలిలోకి విసురుతూ వీధిలోకి పరుగెత్తాడు సూర్యం

చైతన్యరహితంగా నిలబడిపోయి వున్న సత్యాన్ని బుజ్జగిస్తూ అంది తల్లి. "నువ్వు బాధపడకు బాబూ! ఆ మనిషి తీరే అంత! నీకు దెబ్బతగిలిందనే బాధతో మీ నాన్న నిన్ను కోప్పడ్డారు. మనస్సు కష్టపెట్టుకోకు! లోపలకు పద. కాళ్ళూ చేతులూ కడుక్కొని ఆ బట్టలు మార్చుకో. ఇప్పుడే నీకు కాఫీ పెట్టి ఇస్తాను." అంటూ శాంతమ్మ లోపలకు వెళ్ళిపోయింది.

సత్యం ఇంకా అలాగే నిలబడ్డాడు. సరళ "బావా"! అంది ఆర్ద్ర కంఠంతో.

సత్యం ఎంతో కాలంగా అలసిపోయి వున్న వాడిలా చిన్నగా లోపలకు వెళ్ళాడు. మంచం మీద అడ్డంగా పడిపోయాడు.

నాన్న కూడా తనను కుంటివాడనీ, అవిటివాడనీ, హేళనగా మాట్లాడేడు! తను కావాలని ఆ అవిటి తనాన్ని తెచ్చిపెట్టు కున్నాడా? అవిటితనం అపరాధమా? సిగ్గుపడాల్సిన లోపమా? తను ఒక మూల పడివుండాల్సినవాడా? పదిమందిలో అభిమానంతో తిరిగే అర్హత తనకు లేదా? ఆ మాష్టారు కూడా అదే అన్నాడు!

అంతలో శాంతమ్మ వేడికాఫీ తీసుకొచ్చి సత్యం చేత తాగించింది. యాంత్రికంగా తాగేశాడు. లేచి బట్టలు మార్చు కున్నాడు. సరళ దిగులుగా సత్యం గదిలోకీ, బయటకూ తిరుగుతూవుంది. సత్యం ఆమెను గమనించీ పలకరించక పోవడం సరళకు దిగులుగా అనిపించింది.

(సశేషం)

# ఆంధ్రప్రదేశ్‌లో కరువు నివారణ చర్యలు

సి. ఫి. హెచ్. రావు

ప్రభుత్వశాఖలూ, పంచాయతీరాజ్యసంస్థలూ, స్వచ్ఛందసంస్థలూ, వివిధ రాజకీయ పార్టీల సభ్యులూ తమ తమ శక్తి సామర్థ్యాల నంతటినీ సమీకరించి పరిస్థితిని ఎదుర్కోవలసినంత తీవ్రంగా ఆంధ్రప్రదేశ్‌లో అనావృష్టి ఏర్పడింది. రాష్ట్రమంతటా ఈ పరిస్థితి నెలకొనివుంది కొన్ని జిల్లాలలో పరిస్థితి మరీ తీవ్రంగా వుంది. అనావృష్టి వల్ల పంటలు దెబ్బతిన్న కారణంగా వచ్చే నష్టం రూ 360 కోట్లు మొదలు రూ. 400 కోట్ల వరకూ; భూమి శిస్తు, అమ్మకం పన్ను, యితర పన్నుల ద్వారా లభించే ఆదాయం తగ్గడం మూలంగా వచ్చే నష్టం సుమారు రూ. 60 కోట్ల వరకూ వుంటుందనీ. వివిధ ప్రాంతాలలో సహాయ కార్యక్రమాల కొరకు రూ 46 కోట్ల వరకు ఖర్చు పెట్టవలసి వుంటుందనీ రాష్ట్ర ప్రభుత్వం అంచనా వేసింది వర్షాభావం వల్ల రాష్ట్రంలోని పదకొండు జిల్లాలలో కనీసం 20 లక్షల మంది ప్రజలకు దెబ్బ తగిలినట్లు కేంద్ర ప్రభుత్వం అంచనా శ్రీకాకుళం, అనంతపురం జిల్లాలకు తీవ్రమైన దెబ్బతగలగా మిగిలిన జిల్లాలలో ఈ పరిస్థితిలో స్వల్ప వ్యత్యాసాలు వున్నాయి.

రాష్ట్రంలో ఏర్పడిన తీవ్ర అనావృష్టి పరిస్థితులను గురించి కేంద్రానికి వివరించే నిమిత్తం ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, రెవెన్యూ మంత్రి శ్రీ వి బి రాజు ఢిల్లీ వెళ్ళారు. రెండు విషయాలలో వారు కేంద్రం ఆమోదం పొందారు రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో పర్యటించి, తక్షణం గైకొనవలసిన సహాయక చర్యలకు అవసరమైన కేంద్ర ప్రభుత్వ సహాయాన్నిగురించి తెలియజేయడానికై కేంద్ర ప్రభుత్వ అధికార్లతో కూడిన మరొక బృందాన్ని భారత ప్రభుత్వం పంపిస్తుంది. (ఈ వ్యాసం ప్రచురించబడే నాటికి ఈ బృందం రాష్ట్రంలో తన పర్యటనను పూర్తి చేసుకొని వుంటుంది)—ఇది మొదటిది. వర్తమాన సంవత్సరంలో సహాయక కార్యక్రమాలమీద ఖర్చు పరిమితిని రూ 5 5 కోట్ల నుంచి రూ 7.08 కోట్లకు హెచ్చించాలని రాష్ట్రం అభ్యర్థిస్తున్నది కేంద్ర ప్రభుత్వ బృందం పరిశీలించి, సిఫార్సు చేయవలసిన ప్రధాన అంశం యిది. సేద్యపునీటి సరఫరా కొరకూ, మంచినీటి సరఫరా నిమిత్తమూ బావులు త్రవ్వేందుకు తక్షణమే 18 రిగ్గులను లభింపజేయడానికి కేంద్ర ఆహార వ్యవసాయ మంత్రిత్వశాఖ హామీ ఇచ్చింది—ఇది రెండవది రాష్ట్రమంత్రులు వివిధ జిల్లాలలో పర్యటిస్తూ పరిస్థితులను స్వయంగా తెలుసుకుంటున్నారు. సహాయక చర్యలకు అయ్యే ఖర్చుకు సంబంధించి, జిల్లాలవారీగా తయారు చేస్తున్న అంచనాలు హేతుబద్ధమైనవిగా వుండగలవని ఆశించబడుతున్నది. రెవెన్యూ బోర్డు సభ్యులవంటి సీనియర్ అధికార్లు పర్యటిస్తూ ఈ అంచనాలను ప్రాథమికంగా పరిశీలిస్తుండడం ముదావహం

## నీటి ఎద్దడి

అనావృష్టి వల్ల రాష్ట్రంలో పంటలకూ, ఉద్యోగ పరిస్థితికీ తీవ్రమైన దెబ్బ తగలడంతోపాటుగా వివిధ ప్రాంతాలలో మంచినీటికి కూడా బాగా ఎద్దడి ఏర్పడింది. గ్రామ ప్రాంతాలలో ముఖ్యంగా అనావృష్టికి గురైన ప్రదేశాలలో మంచినీటి సదుపాయాలు తక్షణమే కల్పించవలసివుంది. గ్రామ ప్రజలకు ఈ ప్రాథమిక సదుపాయం కల్పించడానికి తగు చర్యలు తీసుకోవడంలో గతంలో ఉద్యోగులూ, ప్రణాళికా యంత్రాంగమూ విఫలులైనట్లు ఇది సూచిస్తున్నది. కొన్ని సార్లు మనం యిటువంటి ముఖ్యమైన అత్యవసరమైన కార్యక్రమాలను సైతం ఉపేక్షించడం, లేక వాయిదా వేయడం జరుగుతుంటుంది. ఈ సమస్యలను ఎదుర్కొంటున్న వారికి తమ అవసరాలను గురించి తెలియపరచడానికై మార్గాలు లేకపోవడమే దీనికి కారణం ఈ సమస్యలు ప్రత్యేకమైన సందర్భాలలో చాలా క్లిష్టమైనవిగా, అత్యవసరమైనవిగా పరిణమిస్తాయి. గ్రామ ప్రాంతాలలో మంచినీటి సరఫరా సమస్య విషయంలో ఇదే జరిగింది. ఇది ప్రాథమిక అవసరమైనప్పటికీ, మనం లోగడ రెండు సంవత్సరాలు అనావృష్టిని ఎదుర్కొనవలసి వచ్చినప్పటికీ ఈ అంశానికి ప్రాధాన్యం యివ్వలేదు. ఈ యేడాది ఈ సమస్యను తీవ్రంగా ఎదుర్కొనవలసి రావడంతో దీని పరిష్కారానికి సత్వర చర్యలు తీసుకొనవలసి వస్తున్నది.

## ఆహారధాన్యాల పంపిణీ

దుర్భిక్ష ప్రాంతాలలోని ప్రజలకు అత్యవసర ఆహారధాన్యాలను సరఫరా చేసేసమస్య కూడా ప్రధానమైనదే ముఖ్యమంత్రి, రెవెన్యూ మంత్రి ఢిల్లీ సందర్శించిన ఫలితంగా, రాష్ట్రానికి జొన్నలూ, మైదానూ సరఫరా చేయడానికి కేంద్రం హామీ యిచ్చింది. రాష్ట్రంలో దాదాపు 1 50 000 టన్నుల బియ్యం నిలువలు వున్నాయి ఈ నిలువలను అనావృష్టికి గురిఅయిన ప్రదేశాలకు మాత్రమే కాకుండా, ఆహార ధాన్యాల ధరలు పెరుగుతున్న పట్టణ ప్రదేశాలకూ, రేషనింగు అమలులోవున్న ప్రాంతాలకు కూడా లభింపజేయవలసి వుంటుంది రాష్ట్రానికి కేటాయించబడిన జొన్న, మైదా నిలువలను శీఘ్రంగా తెప్పించుకోవడం జరుగుతున్నది. గ్రామ ప్రాంతాలలో వీటిని పంపిణీ చేయడం కొరకు సరిఅయిన ఏర్పాట్లు చేయడం చాలా అవసరం. రెండు సంవత్స

రాలపాటు అనావృష్టి ఏర్పడి పంటలు దెబ్బతిన్న తరువాత ఒక యేడాది పరిస్థితి బాగుండడంతో సంతృప్తి భావం ఏర్పడింది. తత్ఫలితంగా, గ్రామ ప్రాంతాలలోని చౌకదుకాణాలను మూసి వేయడం, లేక ఆ యంత్రాంగాన్ని వినియోగించుకోక పోవడం జరిగింది. అయితే పూర్తిగా కానీ లేక పాక్షికంగా కానీ మూసివేయ బడిన జిల్లాలలోని చౌక దుకాణాలను పునరుద్ధరిస్తున్నారు. దుర్భిక్ష ప్రాంతాలలో ఇట్టి దుకాణాలను సాధ్యమైనన్నింటిని తెరవడానికి కూడా ఉత్తర్వులు చేయబడుతున్నాయి. ఒక్క హైదరాబాదు జిల్లాలోనే 400 చౌకదుకాణాలు తెరవడానికి తలపెట్టారు ఇతర జిల్లాలలో కూడా స్థానిక పరిస్థితులనుబట్టి యిటువంటి దుకాణాలను అధిక సంఖ్యలో నెలకొల్పడానికి ప్రతిపాదించారు ఈ విధంగా తెరువబడిన దుకాణాలకు బియ్యం, జొన్న తదితర ఆహారధాన్యాలు నిరంతరాయంగా సరఫరా అయ్యేటట్లు జాగ్రత్త వహించడం, ఎవరో కొందరు వ్యక్తులు, లేక కుటుంబాలు వీటినుంచి అక్రమ లాభాలు గడించకుండా ఈ ధాన్యాలను కంట్రోలు ధరకు అమ్మేటట్లు చర్యలు తీసుకోవడం అవసరం ఇదే ప్రస్తుత సమస్య.

## అవసరచర్యలు

అనావృష్టివల్ల ఇప్పటికే తక్కువగా వున్న గ్రామీణ ప్రజల ముఖ్యంగా వ్యవసాయ కూలీల కొనుగోలు శక్తి మరింత పడిపోయింది. వర్షాభావం వల్ల వ్యవసాయ పనులు నిలిచి పోయిన ఫలితంగా వారు జీవనోపాధి కోల్పోయారు. ప్రత్యామ్నాయమైన ఉద్యోగ వనరులు వారికి అందుబాటులో లేవు. కాబట్టి గ్రామ ప్రాంతాలలోనే వారికి సాధ్యమైనంత వరకు పనులు కల్పించడానికి ప్రయత్నించాలి. కరువు నిరోధక సహాయక కార్యక్రమాలలో సత్వరంగా అమలు జరపాల్సిన అంశంఇది కరువు పరిస్థితులు ఏర్పడిన అనేక ప్రాంతాలలో చాలావరకు షెడ్యూలు కులాలు, యితర వెనుకబడిన కులాలకు చెందిన భూమిహీనులు, నిరుద్యోగులైన వ్యవసాయ కూలీలు ఉన్నారు. వారిని స్థానికంగా కట్టలు పోయడం, చెర్వులకు మరమ్మతులు చేయడం, రోడ్డు నిర్మాణం మరమ్మతులు, బావులు త్రవ్వడం వంటి గ్రామానికి శాశ్వత ప్రయోజనంగల పనులలో వినియోగిస్తున్నారు అమలు జరుప బడుతున్న యీ పనులను యిక ముందు కూడ అంతరాయం లేకుండా కొనసాగించాలి. గతంలో కలిగిన అనుభవాలను దృష్టిలో ఉంచుకుని భవిష్యత్తులో యిటువంటి అననుకూల కాలంలో కూడ ప్రయోజనకరంగా ఉండే విధంగా కార్యక్రమలను అమలుజరపాలి. ఈ విషమ పరిస్థితులలో సరిఅయిన పౌష్టిక ఆహారంలేని కారణంగా గానీ, ప్రజారోగ్య విషయాల అశ్రద్ధవల్లగానీ పేద ప్రజలలో అనారోగ్యం ప్రబలడం, నిరుద్యోగం కొనుగోలు శక్తి తగ్గి పోవడం సంభవించవచ్చు. ఈ ప్రాంతాలలో బీద ప్రజలకు యిదివరకే సరిఅయిన పౌష్టికాహారం లేకపోవడం మనకు తెలుసు కరువు కాటకం యీ పరిస్థితిని మరింతగా అధ్వాన్నం చేస్తున్నది. అందువల్ల పంచాయతీరాజ్ సంస్థలు, ఆరోగ్య, సాధారణ పరిపాలన శాఖల వంటి ప్రభుత్వసంస్థలపై యీ విషయంలో గురుతరమైన బాధ్యత ఉంది. తగినన్ని ఆహారధాన్యాలను సక్రమంగా పంపిణీచేయడం, బీదలైన గర్భిణీస్త్రీలకు, వృద్ధులకు,బాలబాలికలకు పాలపొడి, విటమిన్ మాత్రలు మొదలైన వాటిని నమ్మకంగల సంస్థల ద్వారా పంపిణీ చేయడం వంటి కార్యక్రమాలను చేపట్టాలి. యునిసెఫ్, కేర్ వంటి అంతర్జాతీయ సంస్థలు మందులు, పాలపొడి ఆహార ధాన్యాలను సహితం అందజేయడానికి సుముఖత ప్రకటించాయి. ఈ సహాయాన్ని సక్రమంగా ప్రయోజనకరంగా వినియోగించుకోవాలి. సరఫరా చేయబడిన పదార్థాలు బ్లాకు మార్కెటుకు చేరకుండా అధికారులు కట్టుదిట్టం చేయాలి

ఈ కాటక సంవత్సరంవల్ల మన జనాభాలోని ఎక్కువ వర్గాలు పుష్టిహీనమైన ఆహారంతో, తగు పోషణ లేని స్థితిలో ఉన్నట్లు వెల్లడి అయింది పంచాయతీరాజ్ సంస్థలు గ్రామీణ ప్రాంతాలలో పౌష్టిక ఆహార సరఫరా కార్యక్రమాన్ని ఎంతవరకు పటిష్ఠవంతగా అమలు జరుపుతున్నవో దీనివల్ల స్పష్టమవుతుంది

తక్షణ ప్రయోజనానికి సంబంధించి, భవిష్యత్తులో మార్గదర్శకమయ్యే విషయాలను గురించి అధికార వర్గాలు ప్రస్తుత కరువు పరిస్థితులనుండి కొన్ని గుణపాఠాలు నేర్చుకోవాల్సి ఉంది. మొదట–ఇటువంటి ప్రకృతి వైపరీత్యాలు సంభవించిన సందర్భంలో వాటిని ఎదుర్కోవడానికి క్రింది సాయి నుండి జిల్లా స్థాయివరకు వివిధ శాఖల మధ్య సమన్వయం ఉండాలి. జిల్లా అభివృద్ధికార్యక్రమాలను సమన్వయపరచే పునర్వ్యవస్థీకరించబడిన జిల్లా అభివృద్ధి బోర్డులు యీ సమయంలో అన్ని కార్యక్రమాలను కేంద్రీకృతంచేసి కరువు పరిస్థితులు ఎదుర్కోవాలి.

నూతన అభివృద్ధి వ్యవస్థ ప్రస్తుత పరిస్థితులను తట్టుకునే విధంగానే పనిచేస్తున్నది. తమ లక్ష్యాల సాధనకు కలెక్టర్ల నేతృత్వంలోను, మార్గదర్శకత్వంలోను అన్నివనరులను సమీకరించడం జరుగుతున్నది. అయితే వాటి ఫలితాలు కొద్దికాలం తర్వాతనే లభిస్తాయి. జిల్లా అభివృద్ధి బోర్డు పరిధిలోకి రాని అనేక రంగాలు ఉన్నాయి, వాటికి సంబంధించిన పంచాయతీరాజ్ సంస్థలు అనేక చర్యలు తీసుకోవాల్సిఉంది ఉదాహరణకు, చెర్వులు, కుంటల పునరుద్ధరణ, పొలాలకు గట్లు పోయడం, నిరుద్యోగులను సమీకరించడం వంటి కార్యక్రమాలను యీ సంస్థలు చేపట్టవచ్చు. అదేవిధంగా గ్రామస్థాయిలో చౌకదుకాణాల నిర్వహణ, అహారధాన్యాలు, యితర కొరత వస్తువుల సక్రమ పంపిణీ, ఆపత్కాల తక్కావీ ఋణాల పంపిణీ, యితర ఋణాలు, ఆర్థిక సహాయం, పంపిణీ, మంచినీటి బావుల త్రవ్వకం, పౌష్టికాహార కార్యక్రమాల అమలు వంటి విషయాలలో పంచాయతీ సంస్థలు శ్రద్ధవహించాలి.

ఇక రెండో విషయం, స్థానికవనరులు, అవసరాలను సరిగా మదింపువేసి, తదనుగుణంగా స్థానిక అభివృద్ధికి పథకాలు రూపొందించడానికి పటిష్టమైన పునాదుల ప్రాతిపదిక నేర్పరచే విధంగా సహాయక కార్యక్రమాలను అమలు జరిపినప్పుడు యీ కరువు పరిస్థితులు ఒక విధంగా మనమంచికే వచ్చినట్లుగా భావించవచ్చు. యూనిటుతో ప్రాంతీయ అభివృద్ధి ప్రాతిపదికగా ప్రణాళికను రూపొందించడం నేటి అంగీకృత సిద్ధాంతం. అంటే దిగువ సాయిలలో రూపొందించబడిన స్థానిక అభివృద్ధి కార్యక్రమా

లన్నిటినీ జిల్లా స్థాయిలో రూపొందించబడే సమీకృత ప్రణాళికలో వివరించాలి.

మూడవది, తక్షణ అవసరాలు, ప్రయోజనాల నిమిత్తం అమలు జరుపుతున్న కరువునివారణ సహాయ కార్యక్రమాలన్నిటినీ, వర్షాలు తక్కువగా ఉండే ప్రాంతాలకూ, నీటిపారుదల వనరులు తక్కువగా ఉండే ప్రాంతాలకూ శాశ్వత ప్రయోజనం కలిగే విధంగా దీర్ఘకాలిక ప్రణాళికలో భాగంగా రూపొందించాలి. అన్ని వనరులను సమీకరించి అత్యవసర పరిస్థితులను ఎదుర్కోవాలి. అయితే భవిష్యత్తులో యిటువంటి అత్యవసర పరిస్థితులు తిరిగి ఏర్పడకుండా నివారించడానికి వీలుగా యీ వనరులను ఉపయోగించుకోవాలి కరువు ప్రాంతాలలో మంచినీటి సరఫరా, శాశ్వత ప్రాతిపదికపై చిన్నతరహా నీటివనరుల అభివృద్ధి, పనిలేని వ్యవసాయ కూలీలు, వ్యవసాయేతర కూలీలకు ఉద్యోగ అవకాశాలు కల్పించడం వంటి సహాయక కార్యక్రమాల విజయం, వాటి సమన్వయంపై ఆధారపడి ఉంది.

నాలుగవది— వర్షాలు తక్కువగా ఉండి, నీటిపారుదల వనరులు తక్కువగా ఉన్న రాయలసీమ, తెలంగాణాలోని కొన్ని జిల్లాలవంటి రాష్ట్రంలోని ప్రాంతాలలో శాశ్వతంగా కరువును నివారించడానికి దీర్ఘకాలిక ప్రణాళికలను రూపొందించాలి. రాష్ట్ర నాలుగవ ప్రణాళికలో వాటికి స్థానం కల్పించాలి. రాష్ట్రాలకు కేంద్రం సహాయం గూర్చి కొన్ని నిర్దిష్ట సూత్రాలను ఏర్పరచారు. రాష్ట్రాల ప్రత్యేక అవసరాల ప్రాతిపదికపై 10 శాతం సహాయం ఉండాలనేది కూడ అందులో భాగంగా ఉంది.

ఆంధ్రప్రదేశ్‌కు లభించే యీ పది శాతం సహాయాన్ని గరిష్ఠ ప్రయోజనాలను సాధించే విధంగా నాలుగవ ప్రణాళికలో పథకాలను రూపొందించాలి.

రాష్ట్రంలోని గ్రామీణ ప్రాంతాలలో—ముఖ్యంగా తెలంగాణా, రాయలసీమ ప్రాంతాలు, సర్కార్‌లోని ఎగువ ప్రాంతాల అభివృద్ధి కార్యక్రమాలలో, "భూగర్భ జలాల అన్వేషణ" కార్యక్రమం శాశ్వతభాగంగా ఉండాలి. ఈ కార్యక్రమం అమలు నిమిత్తం లభ్యమయ్యే యంత్ర పరికరాలను, శ్రామిక శక్తిని పూర్తిగా వినియోగించుకోవాలి. వివిధ జిల్లాలలో సర్వే కార్యక్రమాన్ని అమలు జరపడానికి వీలుగా ఆంధ్రప్రదేశ్ ప్రత్యేక యూనిటు ఏర్పాటు చేయాల్సిందిగా భారత సర్వే వారిని కోరాలి

---

# అక్టోబరు 21—అజాద్ హింద్ ప్రభుత్వ రజతోత్సవం

అక్టోబర్ 21 న అజాద్ హింద్ ప్రభుత్వరజతోత్సవం నిర్వహించే సందర్భంలో, హైదరాబాద్ జూబిలీ హాలులో జన సంబంధ శాఖ ఆధ్వర్యాన ఏర్పాటు చేయబడిన సమావేశంలో పాల్గొన్న, ప్రజాసంస్థల ప్రతినిధులు, సంఘసేవాకర్తలు, సదస్యులు రజతోత్సవ ప్రాముఖ్యాన్ని గూర్చి ప్రసంగిస్తూ, యువతరాన్ని చైతన్యపూరితం చేసే నేతాజీ జీవిత గాథను బహుళ ప్రచారం కలిగించేందుకు ఈ రజతోత్సవాన్ని వైభవోపేతంగా జరిపించాలనే అభిప్రాయాలు వెలిబుచ్చారు. ఉత్సవ సంఘానికి జన సంబంధశాఖ మంత్రి శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ అధ్యక్షులుగా ఉండాలని కూడా వారు తీర్మానించారు. ఈ సంఘంలో వివిధ రాజకీయ పార్టీల ప్రతినిధులు, ట్రేడ్ యూనియన్ ప్రతినిధులు, వివిధ సంక్షేమ మండలుల ప్రతినిధులు సభ్యులుగా వుంటారని మంత్రి తెలియజేశారు.

సాహసోపేతమైన నేతాజీ జీవితంపై ప్రసంగిస్తూ, ఆ దివ్య పురుషునితో కలిసి పనిచేసే భాగ్యానికి నోచుకొన్న స్వాతంత్ర్య సమర వీరుడు శ్రీఎ. కామేశ్వరరావు భారత దేశానికి స్వాతంత్ర్య సాధించే విషయంలో ఆదిలో పునాదులు వేసింది నేతాజీయేనని వక్కాణించారు.

మేయర్ కుముదినీనాయక్ ప్రసంగిస్తూ నేతాజీ జీవితంపై పాఠశాలలలో రజతోత్సవ సందర్భంగా వక్తృత్వపోటీలు నిర్వహించబడాలనీ, రచయితలు యువకుల నుత్తేజపరచేలా ఆ నాయకుని జీవితంపై నాటక రచనలు చేయాలనీ సూచించారు.

శాసన సభలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ గౌతులచ్చన్న భారత స్వాతంత్ర్యసమరంలో నేతాజీ సుభాస్‌చంద్రబోస్ నిర్వహించిన ప్రముఖపాత్రనుగూర్చి ప్రసంగించారు. శాసన సభ్యురాలు శ్రీమతి జె. ఈశ్వరీబాయ్ ఈ ఉత్సవాలు భారీయెత్తున నిర్వహించబడాలని సూచించారు.

---



# విజయదశమి

## పండుగలూ పర్వదినాలూ

మన జాతీయ చరిత్రలోని ఉదాత్తమైన, పవిత్రమైన ఒక గాథకు స్మృతిప్రాయంగా మనం దసరా జరుపుకొంటున్నాము. తరతరాలుగా ఈ పండుగ చేసుకుంటున్నాము దీనిని జరుపుకోడానికిగల చారిత్రిక విశేషాలు సరిగా తెలియనంతటి పురాతనమైన పండుగ యిది.

శ్రీరామచంద్రుడు, రావణునిపై సాధించిన విజయ గాథకు సంబంధించినది ఈ పండుగ. రామచంద్రుడు, భారత దేశానికి వచ్చిన ఆర్యజాతికి ప్రతినిధికాగా, రావణుడు మన మాతృ భూమిలో నివసించిన ప్రాచీన జాతుల వారికి ప్రతినిధి కావచ్చు. పూర్వ వృత్తాంతం ఏమైనప్పటికీ ఈ గాథ, మన ప్రాచీన సంస్కృతీ, సంప్రదాయాలలో పెనువేసుకొని పోయింది. మన అభ్యున్నతికీ, సంక్షేమానికీ చాలా తోడ్పడింది.

దసరా పండుగకు సంబంధించిన రామ—రావణ యుద్ధాన్ని ఒక విధంగా, మంచికి చెడుకూ మధ్య నిరంతరం జరిగే సంఘర్షణగా పేర్కొనవచ్చు. చిట్టచివరకు మంచికి చెడుపై విజయం చేకూరింది మంచికి విజయం సిద్ధించిన దివసమే విజయ దశమి.

ఒక జాతిగా, భారతీయులమైన మనకు మన జాతీయ జీవనంలో సంఘటిల్లిన వృత్తాంతాలను గురించిన పరిజ్ఞానం తక్కువ. సుమారు వెయ్యి సంవత్సరాల క్రితమే విదేశాల నుంచి దండెత్తివచ్చినవారికి మనంలొంగిపోయి స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన విషయాన్ని గురించికూడా మనకు అట్టే తెలియదు. మనం జాగ్రదావస్థలోనికి వచ్చేటప్పటికి పరదేశీయులు మనను పాలిస్తున్నట్లు తెలుసుకున్నాము. పరాయి ప్రభుత్వం మనకు వరప్రసాదంవంటిదని కొంత మంది భావించు కునేటంత వరకూ మనం దిగజారాము. కాని త్వరలోనే మనం ఈ పరిస్థితిని అధిగమించాము. గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్యానికై జాతీయ పోరాటం సాగించాము.

స్వాతంత్ర్య పోరాటంలో విజయం పొందాము. ఇది మనకు ఘన విజయము. సగర్వంగా మనం విజయ దశమి జరుపుకోవచ్చు. అయితే మనం యితర శత్రువులపై కూడా గెలుపు సాధించవలసివుంది. వీరు ఉగ్ర స్వభావులు కాక పోవచ్చు. కాని వారివల్ల మన జాతీయతే బలహీనపడే అవకాశం వుంది. కాబట్టి ఈ శత్రువులు విదేశ సామ్రాజ్య వాదుల కంటే తక్కువగా ప్రమాదకరమైనవారు కారు. అజ్ఞానం, ఆకలి, దారిద్ర్యం యివే నేటి మనప్రధాన శత్రువులు.

శ్రీరామచంద్రుడు దుష్టశక్తులతో వీరోచితంగా పోరాడి విజయం పొందినట్టే మనం కూడా అంతిమ విజయం సిద్ధించే వరకూ మన ప్రగతిని అడ్డుకుంటున్న శత్రువులతో పోరాటం సల్పాలి.

—కె. ఎన్. కె.

# వెలుగులు విరజిమ్మే దీపావళి

హృదయమాలిన్యాన్ని కడిగివేసి, జాతికి జాగృతినీ. చైతన్యాన్నీ ఉద్దీపింపజేసే 'జాతీయ పర్వదినం'—దీపావళి తిరిగి వస్తున్నది.

నీలి ఆకాశంలో నిల్చి మిణుకు మిణుకుమంటూ మెరిసే నక్షత్రాల్లాగా దేశంలో యింటింటా యింటికి వెలుగులు జిమ్మే దీపాలు, మానవుని పాపాలను కడిగివేసి హృదయ నైర్మల్యాన్ని. పవిత్రతను ప్రసరింపజేస్తూ వెలుగుతూ ఉంటాయి. పెద్ద నగరాలలో, కవిభావనా స్వప్నాలు వాస్తవ రూపం దాల్చినవా అన్నట్లూ దివియే భువికి దిగివచ్చినట్లూ ఉంటుంది.

గ్రామాలలోనూ, నిరుపేదల నివాసాలలోనూ ప్రమిదలలో యీనాడు దీపాలను ఉంచుతారు. భాగ్యవంతులు, నిర్ధనులు యీ పర్వదినాన్ని సమానంగా గౌరవిస్తున్నారు.

దీపావళి పండుగను భారత దేశమంతటా ఉత్సాహంతోను, నయనానందకరంగాను జరుపుకుంటారు. నేపాల్‌నుండి నేల అంత మధ్యే కన్యాకుమారివరకు ప్రజలందరు పవిత్రతతో యీ పండుగను జరుపుతారు.

వర్షఋతువు ఆఖరు కావడంతో పంటలు యింటికి చేరుతాయి. గ్రామీణులకు వారు ఏ మతం వారైనా యేదో ఒక రకంగా యీ దీపావళిని జరుపుకుంటారు. అయితే మన దీపావళికి జాతీయ చరిత్రలోని సంఘటనలతో సంబంధం ఉంది.

దక్షిణాదిలో యీ పండుగను శ్రీకృష్ణుడు నరకాసురుని సంహరించిన నరకచతుర్దశి పర్వదిన సందర్భంగా జరుపుకుంటారు. పురాణ గాథలనుసరించి ప్రాగ్జ్యోతిషపురం పాలకుడు నరకాసురుడు, శ్రీ మహావిష్ణువు, భూదేవి వలన జన్మిస్తాడు. ఆ రాక్షసరాజు దీర్ఘకాలం కఠోరమైన తపస్సు చేసి శివుని ఆదరణకు పాత్రుడై ఆయనద్వారా అమోఘమైన వరాలు పొందుతాడు. ఆ అహం భావంతో నరకుడు ప్రపంచాన్ని నానా హింసలు పెడ్తాడు. నరకుణ్ణి సంహరించి ఆయన నిర్బంధించిన 16.000 మంది అప్సరః కన్యలకూ ఋషులు, దేవతలు మొదలగు వారికీ శ్రీకృష్ణుడు విమోచనం కలిగిస్తాడు. ఈ పండుగను గురించి మరో కథ కూడా ఉంది. విక్రమాదిత్యుడు శకవంశీయులపై విజయం సాధించడానికి చిహ్నంగా కూడ యీ పర్వదినాన్ని జరుపుతుంటారు.

స్త్రీలు, పురుషులు, బాలల హృదయాలలో అంతర్గతంగా వెల్లివిరిసిన ఆనందోత్సాహాలకు చిహ్నమే బహిర్గతంగా వెలిగించిన దీపాలు. సంతోషాలకు, సంబరాలకు ముఖ్యంగా బాల లోకంలో ఆనందాలకు యిది ప్రత్యేకమైన రోజు.

ఈ వెలుగు మానవునిలోని నిరాశానిస్పృహలను రూపుమాపి, ప్రతి యింటిలో ప్రతి మనిషిలో ఆనందాన్ని, కలిగింప జేయాలి.

—ఎస్. ఎస్. ఎ.

# మహాభారతము

[illegible] లక్ష్మణశాస్త్రి

శౌనకుడు తిరిగి ధర్మరాజుతో నిట్లనెను "ఆకాశమునందు పక్షులు, భూమియందు క్రూరజంతువులు, జలమునందు చేపలు మాంసపు ముక్కను తినునట్లే-ధనవంతుని అన్ని చోట్ల అందరును భక్షింతురు, కొందరికి ధనమే అనర్థమును కలిగించును కనుక అర్థమునందు ఆసక్తి కలవానికి శ్రేయస్సు కలుగదు. అందు వలన ధనసంపాదనోపాయములన్నియు మనస్సునందు మోహమును పెంచును. ఇట్లే దైన్యము, గర్వము, అభిమానము, భయము, ఉద్వేగము ఇవన్నియు ధనమువలన కలుగు దుఃఖములు. ధనమును సంపాదించుట యందును, రక్షించుట యందును, వ్యయముచేయుట యందును మనుష్యులు దుఃఖము ననుభవింతురు. ఒండొరులను చంపుకొనెదరు దానిని త్యాగముచేయుటకు దుఃఖపడుదురు. దానిని రక్షించుటయనది శత్రువును ఇంట దాచుకొనినట్లే అగును. అందువలన ధనమునుగూర్చి చింతించ గూడదు. మూర్ఖుడు అసంతుష్టుడుగను, జ్ఞాని సంతుష్టుడుగను నుండును. ధనాశ ఎప్పటికిని ఆరిపోదు, సంతోషమే సుఖకారణము. అందుకే జ్ఞానులు సంతోషమే ఉత్తమమని తలచెదరు. యౌవనము, సౌందర్యము, జీవితము, ఐశ్వర్యము ప్రియజనముతో కలసి యుండుట-ఇవియన్నియు అనిత్యములు. కనుక జ్ఞానులు వాటిని కోరరు. అందువలన వానిని త్యజించవలెను. అట్టిత్యాగము వలన కలిగిన దుఃఖమును ధైర్యముతో సహించవలెను. ధనవంతుడు ఉపద్రవ రహితుడుగా ఎక్కడను కనపడడు. అందువలన దైవికముగాను, న్యాయపూర్వకముగాను, తనంతటతానుగాను వచ్చిన ధనమునే ధర్మాత్ములు ప్రశంసించెదరు. ధర్మకార్యార్థమై ధనార్జనమునందు ఇచ్ఛచేయకూడదు. 'అడుసు త్రొక్కనేల, కాలు కడుగనేల' కనుక ఓ ధర్మరాజా! నీవు ఏవస్తువునుగూడ కోరుట యుక్తముకాదు. నీకు ధర్మమే కావలసియుండినచో, ధనేచ్ఛను పూర్తిగా విడువుము" అనిచెప్పెను.

ఆ మాటలువిని యుధిష్ఠిరుడిట్లనెను :— "మహాత్మా! నాభోగముల కొరకు నేను ధనమును సంపాదించ దలచుటలేదు నాకు ధనలోభములేదు. కేవలము బ్రాహ్మణులనుభరించి పోషించుటకే నేను ధనమును కోరుచున్నాను గృహస్థుడగు నావంటివాడు తనను ఆశ్రయించి తనవెంటవచ్చిన వారినిగూడ పోషించకుండ ఉండజాలడు. గృహస్థుని భోజనములో దేవతలకు, పితరులకు, మనుష్యులకు, ఈ మొదలైన ప్రాణులకన్నిటికి భాగము ఉండును. స్వయముగా వండుకొనజాలని సన్యాసులకు సిద్ధమైన అన్నమును పెట్టుట గృహస్థుని ధర్మము. తృణములు (కుశాసనము), కూర్చొనుటకుచోటు, జలము, మధురమైన మాట ఈ నాలుగు వస్తువులకు సత్పురుషుల యిండ్లలో ఎప్పుడుగూడలోపము ఉండదు రోగియైన అతిథి శయనించుటకు పరుపు, అలసిన వానికి కూర్చొనుటకు ఆసనము దప్పిగొన్నవానికి నీరు, ఆకలిగొన్నవానికి అన్నము గృహస్థుడు అవశ్యముగా నిచ్చితీరవలెను. ఇంటికి వచ్చిన అతిథిని ఆదరముతోచూచుట మనస్సునందు అతనియెడల మంచిభావము కలిగియుండుట, అతనితో మధురవచనములు పలుకుట, అతనికి స్వాగతముచెప్పి, ఉత్తమాసనముపై అతనిని కూర్చుండబెట్టుట మొదలైన సత్కారములు చేయుట గృహస్థునకు అవశ్యకర్తవ్యములైన ధర్మములు. గృహస్థుడు అగ్నిహోత్రమును, ఆబోతును, స్వవంశస్థులను, అతిథులను, అభ్యాగతులను, బంధువులను, తన స్త్రీని, పుత్రులను సేవకులను ఆదరించి సత్కరించని యెడల వారు తమ క్రోధాగ్నిచే గృహస్థుని దహించగలరు. కేవలము తనకొరకు అన్నమును వండించుకొనకూడదు. గృహస్థుడు, దేవతలు, పితరులు, అతిథులు, వీరిని ఉద్దేశించియే ఇంటిలో వంట చేయించవలెను. పశుహింస అతడు చేయకూడదు. మొదట దేవతలు, అతిథులు మొదలైన వారికి భోజనము పెట్టకుండ తాను ఎప్పుడును భుజించకూడదు. శునకములకు, పక్షులకు తొలుత అన్నమును పెట్టవలెను. ఇట్టి కర్మ "వైశ్యదేవము" అనబడు నొక గొప్ప యజ్ఞము. ఈ యాగమును గృహస్థులు ఉదయ సాయంకాలములు ప్రతి దినము తప్పక అనుష్ఠించవలెను. గృహస్థుడు, "విఘసము," "అమృతము"నైన భోజనము చేయవలెను. ఇంటిలోని వారందరును భుజించగా మిగిలిన దానిని తినుట, "విఘస"మన బడును. బలి, వైశ్యదేవము ఈ రెంటిని చేయగా మిగిలిన అన్నము 'అమృత'మనబడును. అతిథిని ప్రేమతో చూచుట, మనస్సులో అతని హితమును కోరుట, అతనితో మధురముగా సత్యము, ప్రియము, హితమునైన మాటలను పలుకుట, అతిథి వెడలిపోవునప్పుడు కొంతదూరము దాక అతనిని సాగనంపుట, అతడు ఇంటిలో ఉండునంతవరకు అతనివద్దనే ఉండి అతనిని సేవించుట, ఈ అయిదు కర్మలు "దక్షిణలు" అనబడును. ఇట్లు చేయు అతిథి సత్కారమునకు "పంచదక్షిణ యజ్ఞము" అని పేరు. మార్గశ్రమ చేత అలసి ఇంటికి వచ్చిన అపరిచితుడైన అతిథికి సంతోషపూర్వకముగా ఆదరించి భోజనము పెట్టు గృహస్థునకు మహా

పుణ్యము లభించును. కనుక ఇట్టి ప్రవర్తనము గల గృహస్థునకు ఉత్తమమైన ధర్మము లభించగలదు. మహాత్మా ఈ విషయము నందు మీ అభిప్రాయమేమి ? సెలవీయగలరు." అని ధర్మరాజు చెప్పెను. ఆ మాటకు శౌనకుడు ఈ విధముగా బదులు చెప్పెను :

"ఆహా ! ఈ ప్రపంచమునందు మీరు చూపిన ధర్మమునకు విపరీతముగానే మనుష్యులు నడుచుకొనుచున్నారు. సత్పురుషులు గర్హించిన పనులనే దుష్టులు సంతోషముతో చేయుదురు. లోకములో అజ్ఞానులు, కామోపభోగమునకు, ఉదర పూరణమునకు మాత్రమే పాటుబడెదరు. వానికొరకై మోహమును, రాగమును పొంది ప్రాపంచిక విషయములనే సర్వదా అనుసరించుచు అట్టి విషయ సామాగ్రిని పవిత్రమైన యజ్ఞశేష వస్తువుగా ఆదరించుచు స్వీకరించెదరు. వివేకవంతుడైనను మనస్సును ఇంద్రియముల వైపు ఈడ్చుకొని పోవును. అప్పుడు వాని వివేకము, దుష్టాశ్వములు వశములో నుండక సారథిని చెడుత్రోవకు లాగుకొని పోవునట్లే, నశించును. జితేంద్రియుడు కాని పురుషుడు ఇట్టి అవసకు లోనగును. మనస్సు ఆయా ఇంద్రియముల విషయములను సేవించుటకు పూనినప్పుడు అందులోనే నిమగ్నమై, అట్టి విషయోపభోగములందే ప్రవర్తిలు చుండును. సంకల్పమునకు కారణమైన కామముచేత మనుష్యుడు విషయములవైపు ప్రేరేపింపబడును. విషయములు బాణములవలె గ్రుచ్చుకొని, వెలుతురు నందలి ఆశ చేత పతంగమువలె, లోభాగ్నియందు పడును. ఆ తర్వాత స్వేచ్ఛగా మానవుడు, ఆహార విహారములు చేయుచు వాటియందే మోహముకలవాడై ప్రాపంచిక సుఖములో పడి ఆత్మజ్ఞాన శూన్యుడగును. ఈ విధముగా మనుష్యుడు అజ్ఞానము, కర్మ, ఆశ ఈ మొదలగు చక్రములలో తిరుగుచు ప్రపంచములో భిన్న భిన్న రూపములతో జన్మించు చుండును. బ్రహ్మ మొదలుకొని తృణమువరకు ఉన్న ప్రాణులందరి యందును, మరియు జలము యందు, భూమియందు, ఆకాశమునందు, మాటిమాటికి జన్మించుచు జనన మరణ చక్రములో తిరుగు చుండును.

ధర్మరాజా! ఇప్పుడు నేను చెప్పినది అవివేకులగతి. వివేకవంతుల గతినిగూర్చి చెప్పుచున్నాను వినుము. ధర్మమునందు, శ్రేయస్సునందు ఆసక్తిగలవాడై మోక్ష విషయములందు సర్వదా అనురాగముకల మానవుడు వివేకియనబడును. "కర్మమును చేయుము, కర్మమును విడువుము" అని వేదము ఆజ్ఞాపించుచున్నది. కనుక ఈ చెప్పబోవు ధర్మములన్నియు అహంకారము విడిచి అనుష్ఠించవలయును. ధర్మమునకు ఎనిమిది మార్గములు శాస్త్రములో చెప్పబడినవి. అవి "యజ్ఞాచరణము, వేదాధ్యయనము, దానము, తపస్సు, సత్యము, క్షమ (ఓర్పు) ఇంద్రియ నిగ్రహము, లోభమును విడుచుట." ఈ ఎనిమిదింటిలో మొదటి నాలుగు ధర్మములు పితృయాన మార్గములోనున్నవి. అనగా వీటిని అనుష్ఠించుట వలన మానవుని ఇవి పితృలోకమార్గమునందు కొనిపోవును అని అర్థము. అవశ్యకర్తవ్యములైన హోమ, సంధ్యోపాసనాదులు, అభిమానమును వీడి కర్తవ్య బుద్ధితో చేయవలెను. కోరికలను ఒక ఉన్నత ధ్యేయమునకు లగింపజేయుటచే, ఇంద్రియములను వశమునందుంచుకొనుటచే, అహింసావ్రతమును పాలించుటచే, గురు శుశ్రూషచే, యోగసాధనమునకు ఉపయుక్తమైన మితాహారమును భుజించుటచే, వేద శాస్త్రముల అధ్యయనముచే, కర్మలను భగవంతునకు సమర్పించుటచే మనస్సును నిరోధించుటచే, మనుష్యుడు సర్వ శ్రేయస్సులను పొంది ముక్తినిగూడ సాధించగలడు. సంసారమును జయించగోరు బుద్ధిమంతుడు, రాగద్వేష రహితములైన కర్మలను ఆచరించును. ఇట్టి నియమములను పాలించినందువలననే దేవతలు సకలైశ్వర్యములను పొందగలిగిరి. ఇట్టి ఐశ్వర్యము చేతనే వారు ప్రజారక్షణము చేయుచున్నారు. కనుక యుధిష్ఠిరా! నీవుకూడ ఇంద్రియ నిగ్రహముకలవాడవై నచో తపస్సిద్ధిని యోగసిద్ధిని పొందగలవు. యజ్ఞముల వలన, యుద్ధాది కర్మలవలనపొందుసిద్ధి "పితృమాతృమయీ సిద్ధి" యనబడును. అనగా పరలోకములోను, లోకములోను లాభమును గలిగించు సిద్ధి అని అర్థము. ఇట్టి సిద్ధి నీకు పూర్వమే లభించి యున్నది- ఇప్పుడు నీవు తపస్సుచేసి, బ్రాహ్మణులను భరించి, పోషించగల యోగ సిద్ధినిపొందుటకు ప్రయత్నించుము. సిద్ధపురుషులు తాముకోరిన వస్తువులన్నిటిని తమ తపః ప్రభావముచేత పొందగలరు. కనుక నీవు తపస్సుచేసి, నీ కోరికను దానిద్వారా పరిపూర్ణముచేసికొనుము. దీని కొరకై ధన సంపాదన నీకు లేదని చింతిల్లకుము. తపస్సుచేతనే ధనము ద్వారా నెరవేర్చదగిన పనులను సాధించగలవు."

శౌనకుని మాటలను విని ధర్మరాజు తమ్ములతోనున్న పురోహితుడు, ధౌమ్యునివద్దకు పోయి అతనితో నిట్లనెను; "బ్రాహ్మణోత్తమా! విద్వాంసులైన ఈ బ్రాహ్మణులు నా వెంటనే వనమునకు వచ్చుటకు సంసిద్ధులైయున్నారు. నేను ధన హీనుడను, వీరిని పోషించజాలను కనుక నాకు దుఃఖము కలుగుచున్నది. వీరిని విడువజాలకుండ గూడా ఉన్నాను. ఇట్టి సందర్భములో నాకు కర్తవ్యమును మీరు ఉపదేశింపుడు." ఆ మాటలు విని ధౌమ్య మహాముని ఆయన ప్రశ్నమునకు ధర్మపూర్వకముగా ఉపాయమును చింతించి ఇట్లు బదులు చెప్పెను.

"రాజా సృష్టి ప్రారంభకాలమునందు సమస్త ప్రాణులు ఆకలిచే మిక్కిలి బాధపడుచుండెను. అప్పుడు సూర్యభగవానుడు తండ్రివలె ప్రాణులయందు దయగలవాడై ఉత్తరాయణమునందు భూమియందలి జలమునంతయు తన కిరణములచే ఆకర్షించి, దక్షిణాయనమునందు తిరిగి భూమిని జలమయము చేయుచుండెను. ఇట్లు సిద్ధమైన భూమియందు ఓషధీశుడైన చంద్రుడు ఆ జలముతో ఆహార ధాన్యములను ఉత్పత్తి చేసెను. తరువాత ఆరు రుచులు గల ఓషధులు ఉత్పన్నములయ్యెను. ఈ విధముగా ప్రాణులకు భూమియందు ఆహారము లభించెను. ఇట్లు లభించు ఆహారము సూర్య స్వరూపమైనది కనుక సూర్యుడు ప్రాణులకు తండ్రివంటివాడు. కాబట్టి ఓ రాజా ! నీవు సూర్యుని శరణు పొందుము. జన్మముచేత, కర్మముచేత పరిశుద్ధులైన రాజులు సంకట సమయములందు ప్రజలను, తపస్సుచేసి రక్షించెదరు. భీముడు, కార్తవీర్యార్జునుడు, పృధుచక్రవర్తి, నహుషుడు మొదలగు రాజులు తపోయోగ సమాధులద్వారా ప్రజలను గొప్ప ఆపదలనుండి రక్షించిరి. ధర్మరాజా! ఇట్లే నీవుకూడ సూర్యునిగూర్చి తపస్సుచేసి ఈ బ్రాహ్మణులను పోషించుము !" అని చెప్పెను. [ సశేషం. ]

# ఉస్మానియా విశ్వవిద్యాలయ స్వర్ణోత్సవాలు

---టి. రాజగోపాలన్

టాగూర్ ఆడిటోరియం



జంట నగరాలలో విజ్ఞాన దీధితులతో నిరంతరం కాంతిమయమై వెలిగే ప్రాంతం—ఉస్మానియా విశ్వ విద్యాలయ ఆవరణం. 1917లో విశ్వ విద్యాలయాన్ని నెలకొల్పడానికి, ఆనాటి హైదరాబాదు రాజ్యపాలకుడు మహా ఘనత వహించిన నవాబు మీర్ ఉస్మాన్ అలీ ఖాన్ బహదూర్ వారు తమ 'ఫర్మానా'ను—అంటే రాజామోదాన్ని—యిచ్చారు. 1918 అక్టోబరు 5 వ తేదీ గజెట్‌లో యిది ప్రచురితమైంది. తదను గుణంగా ఉస్మానియా విశ్వ విద్యాలయం ఆవిర్భవించింది.

ఈ విశ్వ విద్యాలయాన్ని నెలకొల్పడానికి ప్రధాన కారకులు ఆనాటి హైదరాబాదు రాజ్య ప్రధాన మంత్రి సర్ అగ్బర్ హైదరీ. ఇందువల్ల ఇక్కడి విద్యార్థులు విజ్ఞాన సముపార్జనకు ఏ మద్రాసో, ఏ ఆలీఘరో వెళ్లాల్సిన అవసరం లేకపోయింది. అన్ని స్థాయిలలోను ఉర్దూ మీడియంగా యిక్కడ విద్యాబోధన జరగడం యీ విశ్వ విద్యాలయ ప్రత్యేకత. మిగతా భారతదేశంలోని విశ్వ విద్యాలయా లన్నిటా ఇంగ్లీషు బోధనా భాషగా వుండేది.

పది పదిహేనేళ్లకు పైగా యీ విశ్వ విద్యాలయం హైదరాబాదులోని ఆయాచోట్ల అద్దె భవనాల్లో వుంటూ వచ్చింది. అయితే 1934 లో ప్రస్తుతం యీ విశ్వ విద్యాలయ ఆవరణలోనే ఏర్పాటు చేసిన తాత్కాలిక భవనాల్లోకి మార్చడం జరిగింది. తర్వాత ఉస్మానియా విశ్వ విద్యాలయ భవనాల నిర్మాణానికి ఒక బృహత్తర ప్రణాళిక రూపొందించారు. తదను గుణంగా మొట్ట మొదట బ్రహ్మాండమైన ఆర్ట్స్ కళాశాల భవనాన్నీ, విద్యార్థులకు హాస్టళ్ళను నిర్మించారు. 1939లో ఆర్ట్స్ కళాశాల భవనానికి ప్రారంభోత్సవం జరిగింది లగాయతూ యీనాటి వరకు యీ బ్రహ్మాండమైన భవనంలో ఆర్ట్స్, కామర్స్ విభాగాలే గాక సువిశాలమైన విశ్వ విద్యాలయ గ్రంథాలయం, పరిపాలనా కార్యాలయాలు కూడా దీంట్లోనే వుంటూ వస్తున్నాయి. ఆ తర్వాత కొన్నేళ్ళకి క్రమ క్రమంగా భౌతిక, రసాయనిక, జీవశాస్త్రాలకు: ఇంజనీరింగ్ కాలేజీకి విడిగా అద్భుతమైన వాస్తు నిర్మాణంతో అత్యంత మనోహరంగా భవనాలు నిర్మాణమయ్యాయి. లోగడ సైన్సు విభాగాలు వుంటూ వచ్చిన భవనాల్ని ఇప్పుడు కొన్నిటిని హాస్టళ్ళుగా ఉపయోగిస్తున్నారు. మరి కొన్నిట్లో వైద్య, సాంకేతిక విభాగాల్ని ఏర్పాటు చేశారు.

మనోహరమైన ఉద్యాన వనాలతో అత్యంత రమణీయమైన పరిసరాలతో యీ విశ్వ విద్యాలయం హైదరాబాదు నగరం శివార్లలో 1600 ఎకరాల ఆవరణలో ఏర్పాటైవుంది. ఇక్కడి భవనాలన్నిటి లోకి తలమానికమైన ఆర్ట్స్ కాలేజి భవనం నిర్మాణానికి ఆరోజుల్లో రూ 30 లక్షలు ఖర్చు అయింది. మధ్యయుగం నాటి భారతీయ, మహమ్మదీయ వాస్తు నిర్మాణ ఫణితిలో యీ భవనం నిర్మింపబడింది.

తర్వాత తర్వాత చాలా భవనాల్ని నిర్మించారు. విడివిడిగా నాలుగు సైన్సు బ్లాకులు, ఇంజనీరింగ్ కళాశాల పశువైద్య—పశు పోషణ కళాశాల, న్యాయ కళాశాల యింకా ఎన్నెన్నో విభాగాలకు విడివిడిగా భవనాలు తలెత్తాయి. ఈ విశ్వ విద్యాలయ ఆవరణలోనే ప్రాంతీయ పరిశోధక లేబరేటరీ, సెంట్రల్ న్యూట్రిషన్ రిసర్చి లేబరేటరీ, అస్ట్రోనామికల్ లేబరేటరీ, సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్, కాలేజి ఆఫ్ టెక్నాలజీవంటి సుప్రసిద్ధ సంస్థలు వున్నాయి.

ఈ విశ్వ విద్యాలయంలో స్వీయ మార్గదర్శక పద్ధతి అమల్లోవుంది. అంటే విద్యార్థి నాయకులనుండి, అధ్యాపకుల నుండి నలుగుర్ని మార్గదర్శకులనూ, ఒక ప్రధాన మార్గదర్శకుడినీ ఏర్పాటు చేస్తారు. వీరు విద్యార్థుల కార్య కలాపాలను పరిశీలిస్తూ వారు సక్రమ మార్గంలో నడిచేటట్టు మార్గదర్శకులుగా వ్యవహరిస్తుంటారు.



దర్బార్‌హాలు, మహిళా కళాశాల

ఈ విశ్వ విద్యాలయ ఆవరణలోనే నిజామియా ఖగోళ పరిశోధన శాల వుంది. విశ్వ విద్యాలయం పనిచేసే సంవత్సరం పొడవునానూ, వేసవి శెలవల్లో ఉదయం 9 గం॥ నుంచి సాయంకాలం 5 గం॥ వరకున్నూ పనిచేసే సర్వహంగులూ గల డిస్పెన్సరీ కూడా యిక్కడవుంది. మంచి హోటలూ, స్టేషనరీ వస్తువులన్నీ దొరికే స్టోరూ, చవక ధరల అపరాల షాపూ వున్నాయి. స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు బ్రాంచి పోస్టాఫీసు కూడా వున్నాయి.

కాలేజీలు, లైబ్రరీ, వసతిగృహాలు, సిబ్బంది వసతి గృహాలు, ఆటస్థలాలు మొదలగు వాటిలో ఒకే ఆవరణలో వుండాలని మొదట తలిచారు. కాని కోటి పైగా జనాభాగల విశాల రాష్ట్రం విద్యావసరాలు తీర్చగలిగేందుకు అనుగుణంగా మార్పులు చేయడం అవసరమైంది. కొంత కాలానికి ఈ విశ్వవిద్యాలయం అటు బోధనా, యిటు అనుబంధ సంస్థగా రూపొందింది. ఒక్క నైజాం కాలేజీ తప్ప నగరంలోనూ, జిల్లాలలోనూ వుండే యూనివర్శిటీకి చెందిన యితర కాలేజీలు ఈ విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయబడినవి. దేశానికి స్వతంత్రం రావడం వల్లనూ ఆతర్వాత రాష్ట్రం యూనియన్‌లో అంతర్భాగంగా కలియడం వల్లనూ, మార్పులు చెందుతున్న సాంఘిక రాజకీయ జీవితాల దృష్ట్యానూ, అనుగుణమైనవిధంగా విశ్వవిద్యాలయంకూడా మారుతూ వచ్చింది. బోధనా భాషగా ఉర్దూస్థానే యింగ్లీషు ప్రవేశపెట్టడం మార్పులో గమనించదగిన విషయం. విశ్వవిద్యాలయం పనిచేసే విధానాన్ని ప్రజాస్వామ్యీకరించే దృష్టితో 'రివైజుడు చార్టర్' అమలు పరచడం మరో విశేషం. ఆర్థికంగా నిధులకోసం రాష్ట్ర ప్రభుత్వంపై ఆధారపడడం మినహా విశ్వవిద్యాలయం స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన సంస్థగా రూపొందడం మరో ముఖ్యమైన విశేషం.

ఉస్మానియా విశ్వవిద్యాలయం 1917లో స్థాపించబడి ఆనాటినుండి విద్యావ్యాప్తికి విశేషంగా కృషి చేస్తున్నది. 1956లో భాషాప్రాతిపదికపై పునర్విభజన జరిగినపుడు మహారాష్ట్ర కర్ణాటక ప్రాంతాలలోని కళాశాలలు దీనికి అనుబంధంగా వున్నవన్నీ విడిపోవడంతో ఈ విశ్వవిద్యాలయం నూతనంగా ఏర్పడిన తెలంగాణా ప్రాంతానికి పూర్తిగా అంకితమై విద్యావ్యాప్తికి కృషిచేసే అవకాశం లభించింది. డా॥ రాధాకృష్ణన్ కమిషన్ చేసిన సిఫారసుల మేరకు పి యు సి ; మూడేళ్ళ డిగ్రీకోర్సును ప్రప్రథమంగా ఈ విశ్వవిద్యాలయం అమలు జరిపింది. పైగా జర్మన్, ఫ్రెంచ్ యిటాలియన్, రష్యన్ భాషలలో బోధనా తరగతులను, పత్రికా రంగంలో, పబ్లిక్ అడ్మినిస్ట్రేషనులో లైబ్రరీ సైన్సులలో తరగతులనుకూడా నడుపుతున్నారు. 1959 ఫిబ్రవరిలో అమలులోకి వచ్చిన కొత్త చట్టం దృష్ట్యా గతంలో వుంటున్న 'రివైజుడు చార్టర్' రద్దుపరచడం జరిగిది. ఈచట్టం ప్రకారం ఈ విశ్వవిద్యాలయం, రెసిడెన్షియల్ సంస్థగాను, బోధనా అనుబంధ సంస్థగాను పనిచేయడం తటస్థించింది.

విశ్వవిద్యాలయం గ్రంథాలయంలో ఒక లక్ష యిరవై ఐదు వేల అమూల్య పుస్తకాలు వున్నాయి. వ్రాత ప్రతుల విభాగంలో సంస్కృతం, తెలుగు, మరాటీ, కన్నడ, ఉర్దూ, అరబిక్, పర్షియన్ భాషలకు చెందిన వ్రాత ప్రతులు 6000లపైన వున్నాయి. వ్రాతప్రతుల సంకలనాలు ఈ దిగువ వివరించ బడినవి.

(1) 30 000 వాల్యుములతో సాలార్‌జంగ్ లైబ్రరీ
(2) 4,208 వాల్యూములతో సర్ అక్బర్ హైదరీ సేకరణలు.
(3) 2,397 వాల్యూములతో సర్వారుక్‌ముక్కి సేకరణలు

పుస్తకాలు అందరికీ అందుబాటులోవుండే గ్రంథాలయ విభాగంలో 12,000 పుస్తకాలున్నాయి. ఈ విభాగంలో 228 మంది పఠితలకు వసతి కలిగించేందుకు వీలుంటుంది. రిఫరెన్సు విభాగంలో 3000 పైచిలుకు పుస్తకాలు వుంచబడినవి.

ఈ ఏడాది అక్టోబర్ నెలలో ఈ విశ్వవిద్యాలయం స్వర్ణోత్సవం జరుపుకోనున్నది. అక్టోబరు 5వ తేదీన ఈ స్వర్ణోత్సవానికి రాష్ట్రపతి డా॥ జాకిర్‌హుసేన్ ప్రారంభోత్సవం చేస్తారు. వారంరోజులపాటు ఈ ఉత్సవాలు జరుగుతాయి. ఈ సందర్భంలో భారత దేశంలో సుప్రసిద్ధులను ఈ విశ్వవిద్యాలయం సన్మానించి గౌరవ డాక్టరేటు బిరుదులు వారికి సమర్పించ నున్నది. పుస్తకాల ప్రదర్శన సాంస్కృతిక ప్రదర్శనలుకూడా ఈ స్వర్ణోత్సవ సందర్భంలో నిర్వహించ బడతాయి.



విశ్వ విద్యాలయం లైబ్రరీ

( చివరి అట్ట : ఆర్ట్స్ )

సీరియల్:

# గృహిణి

పిలకా గణపతిశాస్త్రి

## జరిగిన కథ

పార్థసారధి రాఘవనాట్య కళామండలి ద్వారా నాటకాలు వేస్తుండేవాడు. ఒకసారి ఆయన ఏలూరులో కృష్ణతులాభారం నాటకం వేశాడు. ఆ నాటకంలో పాల్గొవలసిన సరోజ రాకపోవడం వల్ల నాటకం వాయిదా పడింది. ఆమె రాకపోవడానికి కారణం ఏమిటని పార్థసారధి సహనటుడైన రాఘవను అడిగాడు.

రాఘవ పార్థసారధితో సరోజను గురించి అతి మామూలుగా ఏమాత్రం ప్రత్యేకత లేనట్టుగా అన్నాడు—

'ఏమోనయ్యా! నాకు కూడా దీని అంతేమి తెలియడంలేదు! ఆ మధ్యన ఒకసారి మాటల సందర్భంలో తనకేదో సినీమాలో ఛాన్సువచ్చినట్టు చెప్పింది. అంతే! ఒక వేళ వస్తే మాత్రం! నాటకంలో వేషంకూడా వెయ్యడం మానివేసి అంత తొందరగా ఎందుకు వెడుతుంది? ఎంతగా ఆలోచించినా దానికి, దీనికి ఏమి సంబంధం ఉన్నట్టు కనబడదు! ఏదో అత్యవసరమయిన పనిమీదే వెళ్ళి ఉంటుంది! సరోజ ఆ మాత్రం బాధ్యత తెలియని మనిషి కాదు! అయినా రంగనాయకమ్మను ఒకసారి కదిపి చూడలేక పోయావు? '

పార్థసారధి నిలువునా నిర్ఘాంత పడ్డాడు.

'అ! అ! సినీమా ఛాన్సువచ్చిందా? నాతో ఎప్పుడు మాట వరసకయినా ఆ మాట చెప్పలేదే! ఎప్పుడు వచ్చింది? ఎక్కడినించి వచ్చింది?'

'అబ్బో! ఇప్పుడా! అప్పుడే చాలాకాలమయింది! అప్పటికింకా ఏదీ స్థిరపడలేదనుకుంటాను! ఆ తరవాత ఎన్నిసార్లడిగినా నాతో ఆ వివరాలేవి చెప్పలేదు మరి!'

పార్థసారథి ఇక అంతగా మాట్లాడలేదు. అంటీ అంటనట్టే ఓ రెండు కబుర్లు చెప్పి వెంటనే రంగనాయకి ఇంటికి బయలు దేరాడు. ఇన్నాళ్ళనించి సరోజ తనతో ఆ సినీమా వ్యవహారం సూచనగా నయినా వెల్లడించలేదని అత డెంతో బాధ పడ్డాడు. అంతేకాదు! రాఘవ కూడా ఆ సంగతి అతి రహస్యంగా దాచివేసి నట్టు పసికట్టాడు. ఇద్దరు కలిసి ఏదో కొంత గూడుపుఠాణీ నడిపించి ఉంటారని కూడా అనుమానించాడు. ఇటీవల కొంత కాలం నించి రాఘవ తనతో అంతగా సన్నిహితంగా మాట్లాడడం లేదు! ఏలూరు నాటకం వ్యవహారంలో కూడా అంతగా ఉత్సాహం కనబరచలేదు! తీరా తేదీ నిర్ణయించిన తరవాత తన పేరు ప్రతిష్ఠల కోసమే ఆరాట పడ్డాడు. అంతే' తనమీద అతనికి ఈర్ష్యాసూయలు బయలుదేరాయేమో నని అంతకు మునుపే పార్థసారధి కొక చిన్న అనుమానం కలిగింది. ఇప్పుడది మరికొంత బల పడింది.

దానితో బాటు ఇప్పు డతనికి ఇంకో అభిప్రాయం కూడా కలిగింది. ఇక సరోజ రాదని తెలిసినప్పుడు రాఘవ పూర్ణచేత ఆదరా బాదరాగా సత్యవేషం వేయించాడు నాటకం మీద అభిమానం కొద్ది ఆ సలహా ఇచ్చాడని పార్థసారధి అప్పుడనుకున్నాడు. పైగా మనస్సులో అతని గుండె నిబ్బరం మెచ్చుకున్నాడు! కాని పూర్ణచేత ఆ వేషం వేయించి ప్రదర్శన పేరు ప్రతిష్ఠలమీద, తనమీద దెబ్బతియ్యడం కోసమే జరిగి ఉండవచ్చునని ఇప్పుడనుమానించాడు. అంతేకాదు! కృష్ణమూర్తి చెప్పిన సరోజా రాఘవల సంబంధంలో కూడా కొంత కాకపోతే కొంతయినా నిజం ఉండి తీరినదని నిర్ణయించుకున్నాడు. ఇంత కాలంనించి వారిద్దరి మధ్య కేరింతాలు, వేళాకోళాలు, ఛలోక్తులు అతని కేమాత్రము అనుమానం కలిగించలేదు! సరోజ స్వభావం తీరే అటువంటిదని సరిపుచ్చుకున్నాడు. ఇప్పు డతనికి అవ్వన్నీ సరికొత్త రూపంలో సాక్షాత్కరించాయి! తలుచుకున్నప్పుడల్లా మాటి మాటికి గుండెలో గుచ్చుకున్న సూదుల్లా వేధించాయి!

ఇంట్లో అడుగుపెట్టగానే రంగనాయకి అతనిని ఇనుమడించిన అభిమానంతో ఆదరించింది సోఫామీద విశ్రమించిన వెంటనే ఏలూరులో నాటక ప్రదర్శనం సంగతి ప్రస్తావించింది. సరోజ, వెంకట కృష్ణయ్య అంత హఠాత్తుగా తలవని తలంపుగా పట్టణం వెళ్ళవలసి వచ్చినందు కెంతో నొచ్చుకొన్నారని వెల్లడించింది. కుమార్తె మన్నించవలసినదని ప్రత్యేకించి బ్రతిమాలు కొన్నదని చెప్పింది 'ఇంతకి ఏలూరులో నాటకం బాగా జరిగిందా? ' అని అడిగింది. పార్థ సారధి చెప్పిన గందరగోళం

సంగతి విని ఎంతో బాధపడింది 'అయ్యో! పాపం: సరోజ సమయానికి అందుకోలేదా? ఎంతపని జరిగింది! ఆ సమయానికి ఎవరినో ఒకరిని నిలబెట్టి ఎలాగో అలాగ మాట దక్కించుకోలేక పోయారా? మరేం లేనిపోని రభస జరగలేదు కదా!'

'పార్థసారథి కొంచం చిరాకు పడుతూ అందుకున్నాడు

'అంత పెద్ద లేనిపోని రభస ఏది జరగలేదుగాని నలుగురిలోను తలవంపు అయిందికదా! బయలుదేరే ముందు కాస్త నా పేర ఒక ఉత్తరం ముక్క రాసి పారేసే పోయేదిగా! దానికి కాళీ లేకపోతే ఎవరిచేతయినా ఒక టెలిగ్రామయినా పంపించే ఏర్పాటు చెయ్యవచ్చుగా!

'ఏమో బాబూ నాకేదేమి అంతు పట్టడం లేదు! మళ్ళీ మర్నాడు నాటకం సమయానికి తప్పకుండా తిరిగి రావాలని అనుకున్నట్టున్నారే! ఏదయినా అవాంతరం వచ్చిందేమో! లేక పోతే సరోజ అంతటి అభాసు పని చేస్తుందా? ఇంతకి ముందు ఎప్పుడయినా ఇలాగ జరిగిందా? అయ్యో! పాపం! ఎంత పని జరిగింది?'

పార్థసారధి మనస్సులో మరింతగా చిరాకు చెలరేగింది! అయినా బాగా తమాయించుకుని నెమ్మదిగా అడిగాడు.

'ఇంతకీ అంత హఠాత్తుగా బయలుదేరవలసినంత అగత్యం ఏమి వచ్చింది?'

'ఏమో బాబూ! అలాంటివన్నీ నాతో చెబుతారా? నా మట్టుకి నేను మర్నాడు నాటకం వేళకి ఏలూరు వస్తారనే అనుకున్నాను!'

'పోనీ ఫలానా పనికోసం వెడుతున్నామని సూచనగా నయినా అనలేదా?'

'అనలేదు బాబూ! అంటే మీతో చెప్పనా?'

ఆమె అమాయిక మయిన వైఖరితో నీళ్ళు నమిలింది. ఆ ధోరణి పసికట్టిన పార్థసారధికి ఆ రహస్యం రంగనాయకికి కూడా తిన్నగా తెలియదేమో అనిపించింది. కాని ఏదో కొంత బయట పెట్టకుండా గుంభనంగా దాచివేస్తున్నదేమో అని తిరిగి అనుమానం కలిగింది. ఆ పైన మనస్సులో జిజ్ఞాస అదే పనిగా పట్టి వేధించడంవల్ల మరి ఉండబట్టలేక ప్రశ్నించాడు.

'పోనీ వాళ్ళిద్దరు ఫలానా తేదీ కయినా తిరిగి వస్తున్నట్టు చెప్పారా?'

'లేదు బాబూ! నాతో వాళ్ళు అమాటే అనలేదు.'

ఇక రంగనాయకిని ప్రశ్నించినందువల్ల రవంతయినా ప్రయోజనం లేదని పార్థసారధికి తోచింది. అప్పటి కప్పుడే కొంచం చీకటి పడింది. ఆమెతో వెడుతున్నానని చెప్పి కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి చేరుకున్నాడు. ఆనాటి రాత్రి భోజనం చేసి పందిరి పట్టె మంచం మీద సుఖంగా మేనువాల్చినా అతనికేమాత్రము మానసిక శాంతి, విశ్రాంతులు లభించలేదు. వేర్వేరు గజిబిజి ఆలోచనలతో ఆందోళనలతో మనస్సంతా చిన్నా భిన్నమయిపోతున్న ట్టొక విధమయిన దుర్భరానుభూతి కలిగింది.

పాపం! తగు మనిషి గుప్త పరిచ్చిన మాట ప్రకారం ఎలాగయినా ఏలూరులో నవంబరు 6 వ తేదీన కృష్ణా తులాభారం ఆడి తీరవలిసినదే! లేక పోతే మొత్తం కొన్నవాళ్ళందరు తమ టిక్కట్ల సొమ్ము తిరిగి ఇచ్చివేయవలిసినదని అతనిని నిర్బంధించ వచ్చును! అందువల్ల గుప్త కెంతయినా నష్టం కలగ వచ్చును! దానితో తమ ఇద్దరి పరపతి, గౌరవము పూర్తిగా బూడిదపా లయిపోతాయి! తా నింతకు మునుపే నటీ నటులందరికి కొంత సొమ్ము ముట్టజెప్పాడు. వేరు వేరు వస్తువులు కొనడం కోసం మరికొంత సొమ్ము ఖర్చుచేశాడు ఆనాడు నాటకం ప్రదర్శించక పోతే ఆ సొమ్ము అంతా పూర్తిగా గంగలో కలిసిపోతుంది! కనక ఎలాగయినా తిరిగి ఏలూరులో నాటకం ఆడించి తీరవలసినదే!

అయితే పరిస్థితులను బట్టి చూస్తే ఆనాడయినా కృష్ణ తులాభారం ప్రదర్శనం సాధ్యపడగలదా? అని సందేహం కలుగుతున్నది. సరోజ, వెంకట కృష్ణయ్య అంత హఠాత్తుగా మద్రాసు వెళ్ళిన కారణం తనకేమి తెలియదని రంగనాయకి అంటున్నది! ఇక రాఘవని కదిపితే వారేదో సినీమా ఆశతో అక్కడికి వెళ్ళి ఉండవచ్చునని సూచనగా మాత్రమే చెబుతున్నాడు! అంతే! వివరాలడిగితే అవి తనకేమి తిన్నగా తెలియవని సమాధానం చెబుతున్నాడు! వారిద్దరి ధోరణిని బట్టి చూస్తే ఏదో కొంత దాచివేస్తున్నట్టు అనుమానం కలుగుతున్నది! పోనీ అనుకుంటే సరోజ వ్యవహారం కూడా సరిగా ఉన్నట్టు కనబడడం లేదు! మొట్టమొదటి నించి ఆమె సినీమా సంగతి రవంతయినా తనతో చెప్పకుండా దాచివేసింది! పైగా మేనమామతో కలిసి అకస్మాత్తుగా మద్రాసు వెళ్ళిపోయింది! ఇంత వరకు అంటీ అంటనట్టు ఒక్క టెలిగ్రాము తప్ప ఆమె దగ్గరనించి వేరే ఒక చిన్న ఉత్తరం ముక్కయినా ఊడి పడలేదు! కృష్ణమూర్తి ఇంతకు మునుపే సరోజా రాఘవల మధ్య సన్నిహితమయిన సంబంధం ఏర్పడినట్టు చెబుతున్నాడు! ఈ వ్యవహారంలోని నిజం ఎంత? అబద్ధం ఎంత? ఎన్నెన్ని విధాల తల బద్దలుకొట్టుకున్నా ఇదమిత్థంగా ఏది తేలలేదు. క్రమ క్రమంగా అతనికి మతిపోతున్నట్టనిపించింది! కాని విపరీతమయిన ఓరిమితో గుండె దిటవు చిక్కబట్టుకున్నాడు.

సరే, సరోజ దగ్గరనించి సమాధానం వచ్చిన తరవాత సమస్యలన్ని మంచు విడిపోయినట్టు పరిష్కారం కాగలవని మనసారా ఆశించాడు. ఇంటికి తిరిగి వచ్చినతర్వాత ఇరవై రెండో తేదీనే ఆమె పేర ఒక సుదీర్ఘ లేఖ పంపించాడు. 24 వ తేదీన ఆమె సమాధానం కోసం ఎంతో ఆత్రంగా ప్రతీక్షించాడు. కాని జవాబు రాలేదు! 25 వ తేదీనాడు కూడా వెయ్యి కళ్ళతో సరోజ ప్రత్యుత్తరం కోసం నిముషమొక యుగంగా నిరీక్షించాడు! కాని సమాధానం రాలేదు! పార్థసారధి కేమి పాలుపోలేదు. ఒక్కొక్కప్పుడా వ్యవహారం మరి ఆలోచించడమే మానివేసి చేతులు కడుక్కుని కూర్చుంటే బాగుండునని కూడా అనిపించింది అతనికి

(సశేషం)

# జిల్లాలనుండి



భారతదేశంలో ఆస్ట్రేలియా హైకమీషనర్ సర్ ఆర్థర్ టాంగే సెప్టెంబరు 3న నాగార్జున సాగర్‌ను సందర్శించారు

## హరిజన దినోత్సవం

హయాత్‌నగర్ సమితిలోని ఆకాశపూర్‌లో ఆగష్టు 30 న హరిజన దినోత్సవం జరిపారు హరిజనవాడను పరిశుభ్రంచేసే కార్యక్రమంలో దాదాపు 200 మంది పాల్గొన్నారు.

## కుటుంబ నియంత్రణ కేంద్రం ప్రారంభం

జనసంబంధ శాఖా మంత్రి, శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ, కరీంనగర్ సమితిలోని చమన్‌పల్లిలో కుటుంబ నియంత్రణ ఉపకేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. తెలంగాణా ప్రాంతీయ సంఘం అధ్యక్షులు, శ్రీ జె. చొక్కారావు అధ్యక్షత వహించారు.

## గ్రామీణ బ్యాంకు గిడ్డంగి ప్రారంభం

కరీంనగర్ జిల్లా మల్కానూరులో గ్రామీణ బ్యాంకు నిర్మించిన కొత్త గిడ్డంగికి సహకార శాఖామంత్రి శ్రీ కె. విజయభాస్కర్‌రెడ్డి, ఆగష్టు 18 న ప్రారంభోత్సవం చేశారు. విద్యాశాఖామంత్రి, శ్రీ పి. వి. నరసింహారావు అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో సహకార శాఖ మంత్రి ప్రసంగిస్తూ ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తమంగా నిర్వహించబడుతున్న గ్రామీణ బ్యాంకులలో మల్కానూర్ బ్యాంకు ఒకటని ఆయన అన్నారు.

## పుడిపర్రు రైతుకు బహుమతి

పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలుకా పుడిపర్రు గ్రామ రైతైన శ్రీ ఎం. జి. రామారావుకు 1967–68 లో జరిగిన రాష్ట్ర స్థాయి చెరకు ఉత్పత్తి పోటీలో రాష్ట్ర బహుమతి లభించింది. రాష్ట్ర వ్యవసాయ శాఖా డైరెక్టరు యీ పోటీని నిర్వహించారు. హెక్టరుకు 262.989 మెగా టన్నుల గరిష్ఠ ఉత్పత్తిని ఆయన సాధించారు.

బహుమతి విలువ రు. 1000 లు. ప్రత్యేక సమావేశంలో శ్రీ ఎం. జి. రామారావుకు యిది అందజేయ బడుతుంది.

## రాజమండ్రిలో మహిళా కళాశాల ప్రారంభం

విద్యాశాఖ మంత్రి, శ్రీ పి. వి. నరసింహారావు సెప్టెంబరు 3 న రాజమండ్రిలో రాజ్యలక్ష్మి మహిళా కళాశాలకు ప్రారంభోత్సవం చేశారు. సుప్రసిద్ధ సంఘ సంస్కర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారి సతీమణి పేరున యీ కళాశాల వ్యవహరించ బడుతున్నది.

## ఉస్మానియా విశ్వవిద్యాలయంలో లక్ష రూపాయలతో నవాజ్ జంగ్ పీఠం

ఆంధ్రప్రదేశ్‌లోని సుప్రసిద్ధ ఇంజనీరు శ్రీ అలీ నవాజ్ జంగ్ స్మారకచిహ్నంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆయన పేర పీఠం ఏర్పరచడానికి వీలుగా ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి లక్షరూపాయలు సమర్పించారు.

అలీ నవాజ్‌జంగ్ స్మారక సంఘం అధ్యక్షులు శ్రీ కె. వి. రంగారెడ్డి, సెప్టెంబరు 16 న ఖైరతాబాదులోని ఇంజనీరింగ్ సంస్థలో జరిగిన సభలో చెక్కును ముఖ్యమంత్రికి అందజేశారు.



నల్లగొండలో ఆగస్టు 30న హరిజన బాలుర హాస్టలుకు గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయ్ శంఖుస్థాపన చేస్తున్న దృశ్యం

ఈ సందర్భంలో శ్రీ రంగారెడ్డి ప్రసంగిస్తూ యీ ప్రతిపాదనను అప్పటి ముఖ్యమంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డికి తెలియజేశామనీ, యీ సంఘం లక్ష రూపాయలు వసూలుచేసిన పక్షంలో అవసరమైన నిధులను మంజూరు చేయడానికి వారు అంగీకరించారని ఆయన అన్నారు.

## పెద గోపత్తిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

ఆరోగ్య వైద్య శాఖల మంత్రి శ్రీ ఇబ్రాహిం అలీ అన్సారీ, ఖమ్మం సమితిలోని పెద గోపత్తిలో గ్రామస్థులు యిచ్చిన రు. 6000/ల విరాళంతో నిర్మించబడిన 4 గదుల ప్రాథమిక ఆరోగ్య కేంద్రం విభాగానికి ప్రారంభోత్సవం చేశారు.



హైదరాబాదులో సెప్టెంబరు 6న జాతీయ కుటుంబ నియంత్రణ పక్షోత్సవాలకు ప్రారంభోత్సవం చేసిన శ్రీ వి. తిమ్మారెడ్డి

## పాఠశాలకు ప్రారంభోత్సవం

భువనగిరి సమితిలోని గూడూరులో ఆగష్టు 25 వ తేదీన, జనసంబంధ శాఖా మంత్రి శ్రీ కొండాలక్ష్మణ్ బాపూజీ, పాఠశాల భవనాన్ని ప్రారంభించారు.

## తురకపల్లికి విద్యుచ్ఛక్తి సరఫరా

గుత్తి తాలూకాలోని తురకపల్లి గ్రామంలో, ఆగష్టు 30 వ తేదీన అనంతపురం జిల్లా కలెక్టరు శ్రీ డి. అరోరా, విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేశారు.

## శివారెడ్డి పేటకు విద్యుద్దీపాలు

హైదరాబాదు జిల్లా పరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఎం. భోజ్‌రెడ్డి, శివారెడ్డి పేటలో విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం చేశారు. ఈ గ్రామం వికారాబాదుకు రెండుమైళ్ళ దూరంలో వుంది.

## దుర్భిక్ష నిర్మూలనం

జాతీయ ప్రణాళికా మండలి ఉపాధ్యక్షులు డా॥ డి. ఆర్. గాడ్గిల్ సెప్టెంబర్ 6 న పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతూ, నాలుగవ పంచవర్ష ప్రణాళికలో రాష్ట్రాలకు కేంద్ర సహాయం పరిమితమైనదనీ, అందుచేత ఆయా రాష్ట్ర ప్రణాళికల పరిమాణం అవి స్థానికంగా సమీకరించుకో గలిగిన వనరులపై ఆధారపడి వుంటుందని అన్నారు.

కేంద్రం అందజేసే సహాయం బ్లాక్ గ్రాంట్లు, ఋణాల రూపంలో వుంటుందనీ, స్థానిక అవసరాల దృష్ట్యా, తమ తమ ప్రణాళికా లక్ష్యాలను నిర్వచించుకొనేందుకు రాష్ట్రాలకు స్వేచ్ఛ వుంటుందనీ, గతంలో మాదిరి పథకాల ప్రమాణీకరణ జరగడం అనేది వుండదని ఆయన వ్యక్తపరిచారు. ప్రాంతీయ అసమానతలనేవి ఏవైనా వుంటే వాటినితొలగించేందుకు రాష్ట్రాల తలసరి ఆదాయాన్ని పెంచే విధానం రూపొందించబడిందనీ, తక్కువ తలసరి ఆదాయం వున్న రాష్ట్రాలకు హెచ్చు సహాయం అందజేయ బడుతుందని కూడ ఆయన అన్నారు.



జాతీయ ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షులు డా॥ డి. ఆర్. గాడ్గిల్ సెప్టెంబరు 6న నాలుగో ప్రణాళిక గురించి రాష్ట్ర ప్రభుత్వాధికారులతో చర్చించారు.

PUBLISHED BY THE SANCHALAK, JANA SAMBANDHA SHAKHA A P HYDERABAD, PRINTED BY THE DIRECTOR, OF PRINTING AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAD

